# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

*

జూన్ 1977

సంపుటము : 54 సంచిక : 6

విడిపత్రిక వెల రూపాయిన్నర

# మీరు ఓటరు కారా!

ఆంధ్రప్రదేశ్ అంతటా ఓటర్ల జాబితాల పునఃపరిశీలన కార్యక్రమం తేది 1–6–1977 నుండి చేపట్టబడినది. 1 జనవరి 1977 తేదీకి మీరు 21 సంవత్సరములు లేక అంతకు మించి వయసు కలిగియుండి ఎటువంటి అనర్హత లేకుండాయుంటే, ఓటర్ల జాబితాలో మీ పేరు చేర్చుటకు మీకు పూర్తి హక్కు వుంటుంది. త్వరలోనే ఎన్యూమరేటరు మీ ఇంటికి రాగలరు. వారితో సహకరించి, సరియైన సమాచారము యివ్వండి.

ఎన్యూమరేటర్ మీ ఇంటిని సందర్శించవపుడు లేదా 25–6–1977 తేదీలోగా మీ నమోదుకు సంబంధించిన నఖలు ప్రతిని మీకు అందజేయకున్నను మీరు వెంటనే ఈ క్రింది అధికార్లను సంప్రదించండి.

సమీప రివెన్యూ డివిజనల్
ఆఫీసర్ లేక తహసిల్దారు ... ... మఫిషియల్ ప్రాంతాలు

## హైదరాబాద్, సికింద్రాబాద్ జంట నగరములలో

| | |
|---|---|
| మున్సిపల్ కార్పొరేషన్ ఆఫ్ హైదరాబాద్‌కు చెందిన ఆయా సర్కిల్ ఆఫీసులకు చెందిన డిప్యూటి కమిషనర్లు<br>లేదా<br>అడిషనల్ కమీషనరు (రివెన్యూ) మున్సిపల్ కార్పొరేషన్ ఆఫ్ హైదరాబాద్, హైదరాబాద్. (ఫోన్ నెం. 57796 లేక 57763) | హైదరాబాద్ ప్రాంతం |
| డిప్యూటి కమిషనర్, మున్సిపల్ కార్పొరేషన్ ఆఫ్ హైదరాబాద్, సికింద్రాబాద్. (ఫోన్ : 72012) | సికింద్రాబాద్ ప్రాంతం |

కె. బి. లాల్,
ప్రధాన ఎన్నికల అధికారి.

# విషయానుక్రమణిక

## జూన్ 1977





# ఏది ఏది మీ గమ్యం?

డా॥ సి. నారాయణరెడ్డి

ఎవరయ్యా ఎందుకు మీ
రెందు కురుకుతున్నారు.
ముళ్లలాగ దిగిపోయిన
కాళ్లు పెరుకుతున్నారు.

ఇటు నిరాశ అటు దురాశ
ఏది ఏది మీ గమ్యం ?
కదురులేని బ్రతుకుమీద
కలలు వడుకుతున్నారు.

సన్నగిల్లెనా ధైర్యం ?
సల్లిపోయెనా వీర్యం ?
రగిలే వేసవిలో ఇం
తగా వణుకుతున్నారు.

ఇరుకునుంచి బయటపడీ
వెరపులోంచి కుదుటపడీ
ఈ యెడారి పొదుగునుంచి
ఏమి పితుకుతున్నారు ?

నేలమీద నిలువలేక
గాలిలోన ఈదలేక
రాలిపడిన ఇంద్రధనువు
రంగులతుకు తున్నారు.

ఉప్పెనలా ఉదయించీ
నిప్పుల్లో జీవించీ
కీళ్లు వాచి గతకాలపు
కీర్తి గతుకుతున్నారు.

# నిట్టూర్పులు......!

డా॥ జయప్రకాశ్ వైద్య

సైకతాలను
పెనుభూతంగా కౌగిలించే
బీభత్స సాగర ఝుంఝుతా
శతధా విభిన్నమైన నా గుండెలో
అగ్నిపర్వతాన్ని బద్దలు చేసి,
తావా నీ అందాన్ని కౌగిలించే ముందు
నువ్వు నాకు దూరంగా వెళ్ళిపో... ...!

సన్నజాజి పందిరి కింద
స్నిగ్ధ కపోల తల్పాల అ
దృష్య అద్భుత శైలిలో
గీతాల జడివాన కురిసి

ఎన్నాళ్ళో కాలేదింకా —
జ్ఞాపకాల విరజాజులింకా
ఆశ్చర్య పడనేలేదు.
చీకటిలో, కుంపటిలో, నా జీవితం
రవ్వలు రవ్వలై రగలక ముందు
నువ్వు నాకు దూరంగా వెళ్ళిపో ... !!

జీవితానికో నిర్వచనం
వ్రాసుకుందామనుకున్నాను.
నిట్టూర్పుల్లో విహరించక, ముందు,
నువ్వు నాకు దూరంగా వెళ్ళిపో ... ...!!!

# దిక్కులేనా రెక్కలు

## శ్రీ రామా చంద్రమౌళి

నా కిటికీ రెక్కలు ఎప్పుడూ తెరిచే ఉంటాయి
పరిమళావర్త పవన ప్రవాహాల కోసం,
జ్వాలాజ్వలిత కవన ఝరీధారల కోసం,
నేను ఎదురు చూస్తూంటాను ఎప్పుడూ
ఉషోదయంకోసం నిరీక్షించే ప్రకృతిలా
ఎందుకు ... ?
వికసించాల్సిన పువ్వులకోసం,
విచ్చుకోవాల్సిన దివ్వెల నవ్వులకోసం —
నేను మేఘంలా విచ్చుకుపోతూంటే
సృష్టి నా కన్నుల్లో సుళ్ళుతిరుగుతూ
గుండెలను తీయగా నలిపి
మధుస్నపిత పారావతమై ఎగిరిపోయింది
మట్టిలా పడిఉన్న మనిషి
మంటలా మింటి కెగిసి
గ్రహాలలో జండాల విహంగాల నెగరేసిన సంగతీ,
మనిషి మనసులో
సున్నమేసిన చీకటి ముద్దలనుదాచుకున్నసంగతీ—నాకు తెలును

ఎవ్వరో ఒకరుంటారు మొక్కను నాటాలనుకునేవారు
ప్రతివాడూ పండిన పళ్ళకోసం సరవళ్ళు తొక్కేవాడే—
"ఒక్క మొక్కనుండి ఎన్నోపండ్లు ..."
... యింకా అర్థంగాలేదా సృష్టి రహస్యం
ఆ చుక్కలాంటి ఒక్కడివి నువ్వెందుకు కాకూడదు —
అది నా ప్రశ్న

... నీ ఎదురుగా చూడు
యీ గిరులు, యీ తరులు, యీ విరులు
ఎంత గర్వంగా తలెత్తుకుని నవ్వుతున్నాయో
మనిషి మనసులోనుండి 'స్వార్థం'పురుగు నిష్క్రమించిననాడు
ఆరిన వత్తిలా ఉన్నవాడు పదునుకత్తిలా ఎదుగుతాడు
యిన్నాళ్ళూ నీచుట్టూ కక్షలో నిలబడి నిన్ను సమీక్షిస్తూన్న
మండే సూర్యుడిని నేను—నాలో కాలి పర్జన్యంలా పునర్జ
న్మెత్తాలి నువ్వు

అందుకే
నా హృదయపు కిటికీ ఎప్పుడూ తెరిచే ఉంటాయి
దిక్కులేని నా కిటికీ రెక్కలు—

# ఆశకు నాకు అంతర్యుద్ధం

## శ్రీ వేముల నరసింహయ్య

స్నేహం చేస్తే యెక్కిరిస్తుందట అందలం
కూడితే కురిపిస్తుందట ధనం
చూపించాను అదృష్టపత్రం
విసిగిపోయి పెంచుకొంది నాతో వైరం
తెలియనట్లుంది దానికి నా మనోధైర్యం
సమరసంలో జరుగుతోంది సమరం
ఎట్టకేలకు కూల్చివేశాను వైరి రథం
నా కత్తికి ఎరచేశాను దాని కంఠం

తీరిందనుకొన్నాను నా మనోరథం
కాని.........కానీ.........
పౌలస్త్యమస్తకంలా
యెంత నరికినా నవ్వుతోందా రూపం
అర్థమే కాకుంది దాని మరణమర్మం
నాకే విభీషణుడు చెబుతాడీ రహస్యం
ఎలా తీరుతుందిక
ఈ ఆశకు నాకూ అంతర్యుద్ధం ?

# అడివి

## శ్రీ ఎస్. మునిసుందరం

శతాబ్దాల చిలుంపట్టి తుప్పెక్కిన
చరిత్ర సంకెళ్లు తెంచుకొని
గతాబ్దాల గాడు తలకెక్కి నిల్చున్న
నాగరక దర్వాజాల పొట్టలు చీల్చుకొని
ఈ అడివికి నేను వచ్చాను.

నాకు తోడుగ
నా ఒక్క కుక్క తప్ప
ఇంకెవ్వర్నూ రాలేదు.
రైతును పిలిచాను, రాజును పిలిచాను
తాడితునీ, పీడితునీ పిలిచాను.

యుగాలుగా ఇరుల యిరుసులలో
చీమల్లా చిత్తయిపోయిన
నలుసుల్లాంటి నావాళ్ల నందర్నీ పిలిచాను.

కాని — ఒక్కర్నూ రాలేదు
నా ఒక్క కుక్క తప్ప.

ఇక్కడ
చెట్లు స్నేహ సుగంధాల నీడలిస్తాయి
పుట్టలు మమతల గొడుగులు పంచుతాయి
మొక్కలు సమతల మొగ్గలు తొడుగుతాయి
తీగెలు తియ్యందనాల జల్లులు వర్షిస్తాయి.

నాఎత్తు పెరగమనే శిఖరాలు
రెక్కలిప్పి ఎగిరే విహగాలు
స్వచ్ఛందంగా పరుగులిడే సెలయేళ్లు
అమాయకత్వం చిలకరించే జింకలకళ్లు.

చిగురుటాకుల గూటిలో
ముడుచుకకూర్చున్న మొగ్గలు
గంధాల్నితాగి మందంగా తిరిగే గాలులు
రేకులు విప్పుతున్న గులాబీల్లా
సుతిమెత్తని ఉదయాలు
రెప్పలను తాకే చిరుస్పర్శలా
చివుళ్లపై మెరిసే మంచు ముత్యాలు.

రెండు చీమల కలయికలో చిట్లిన శబ్దం
రికార్డు చేయగల సుహృదయాలు
వ్యర్థార్తని స్వగతాల సన్నని మూల్గులు
చెవికెక్కించుకోగల చైతన్యాలు.

చెదరక, నిగ్గుతరగక, చైత్రరథంలా
బ్రతుకు పుష్పించగలదు.

ఇక్కడ
సింహాలు అహింసా ధర్మాలు వల్లించవు
వ్యాఘ్రాలు మంచుశాలువాలు కప్పుకోవు
సూర్యుడు చంద్రుని మాస్కు వేసుకోడు
చిక్కటి వెన్నెల కెన్నడూ చెదపట్టదు.

అందుకే
ధీమాగా తిరగ్గలను
నా కుక్కను రక్షించుకోగలను.

# ఆనందపారావతాలయానంతో....

## శ్రీ జి. నరసింహారెడ్డి

బహుధా దీర్ఘదీర్ఘంగా పనిచేసి
బ్రతుకు బరువునెత్తి
ఇలా ఎప్పుడో విశ్రాంతితో కొంత
నిలువనప్పుడు సుఖం ఎక్కడ?

కోకిలల కువకువలు—కదలేపిట్టలు
అప్పుడప్పుడలా ఒక్కసారి
అలసాలసంగా సాగే మలయానిలాలు—
చూడనట్టి బ్రతుకు వృథా
వీడినట్టి బ్రతుకు వ్యథ.

శరత్కౌముదీ స్నానం
చేయని హృదయం పులకిస్తుందనుకోను
సరిద్గానం వినని హృదయం
స్వాదువని ఊహించలేను.
ప్రాగ్దిశావనంలో రవిబింబ ప్రభల పుష్పరజం కురిసి నప్పుడు
మధుమాసం సుమవికాస మధుర సౌరభం విరజిమ్మినప్పుడు
ఆనంద తన్మయతా స్నిగ్ధ సానువులమీద
అలా నిల్వటంకాక మరేమున్నది!?

సరస్సుల్లో ఈదే నిదాఘం
కదలే తుషారావగుంఠనాల హిమకాలం
అహో! బ్రతుకు ద్వేషంచే పీడింపబడని
అమృతవేళల్లో ఆనందభరితం.

క్షణకాలం కాలం నిలిచిపోగా
శోభామయం ప్రకృతిని విలోకిస్తాను
ఆనంద పారావతాలయానంతో పులకిస్తాను.

---

# బహిరంతరాలు

## శ్రీ కె. వెంకటపతిరెడ్డి

కన్నులుమియుచున్న భయంకర రుధిరజ్వాల లోపల,
ప్రతిగుక్కకు మైకం కమ్ముతున్న మదిరాహేల వెలుపల
భూగర్భంలో ఎక్కడో దాగిన ఉచ్ఛలత్ స్రవంతి
ఉపరితలంలో ఎండి బీటలు వారినవేసవికి విశ్రాంతి.
కటకటాల మాటున కవిలగోవు పొదుగులో
ఇంకని పీనపయోధరధార,
ఆరుబయల వద్దన్నా కురుస్తున్న
అజాగళస్తన క్షీరధార.
లోగిట్లో ప్రగతిశీల శక్తుల కత్తిపోట్లు
ముంగిట్లో సైకత కుడ్యశోభాసముద్దీప్తికై అగచాట్లు
ఒకటి నిస్సహాయ నిశ్శబ్ద భ్రూవిక్షేపం
వేరొక్కటి నిర్హేతుక జాయమాన కటాక్షం
అంతరింద్రియపు జాగిలాలు నిశీథంలో
తిమిరంతో సమరం చేస్తున్నాయి,
కళ్ళముందే పట్టపగలు నట్టనడివీథి జీవనమందిరంలో
నిలువు దోపిడి,
నడిసంద్రంలో హోరెత్తిన సుడిగుండం
తీరానికి ఈవల విషవాయు విస్ఫులింగాలకి
తట్టుకోలేనంది.
కంటికి కంటికి, చెవికి చెవికి అంతరం వున్నా
దర్శన శ్రవణాలలో వాటికి స్పర్శవుంది.
మంటికి మింటికి ఎంతటి ఎడమున్నా
శూన్యంలో అవి సంగమిస్తాయి
ఇవి బహిరంతరాలు
అస్తి నాస్తిలా స్పృశింపవు—సంగమింపవు.

# వెలుగు నీడల మధ్య

శ్రీ వి. వి. స్వామి

అదిగో నవ్వింది అరుణారుణ కాంతికిరణం
ఆకాశంలో వంగింది ఆశాస్వప్నాల రంగులహరి చాపం
పులకిత హృదయానంద మధుర సంగీత రాగ సమ్మేళనం

అంతలోనె ఆవరించింది — అంధకారం
కాలాహిలా పెనవేసింది—నైరాస్యం

అది గదిగో వియత్సైకతాన ధవళజ్యోత్స్నా నికుంజం
మనసంతా ఘుభుప్రసూన మంజరీ పుంజం.

అయ్యో ఎక్కడదీ నీలాభ్రశకలం
కసితో కబళించింది నిర్మల శశిబింబం.

ఏమిటీ అన్యాయం. ఏమయ్యాడు
ఇప్పుడేగా ఇటువచ్చాడు
విశ్వాంతరాళాన్ని వెలిగించిన చంద్రుడు ?

— రివ్వున పైకెగసి
గోళాలను ఢీ కొని బద్దలైందీ ప్రశ్న
మళ్లీ వినిపించింది ప్రశ్న.

అంతా నిశ్శబ్దం — నిశ్చల నీరవార్ణవం.

అమ్మయ్య ! చివురాకుల్లో ఒక చిరుకోరకం
మరలా కన్నుల్లో ఆశాప్రవాహం.

గంధం పూసుకొని
మధువు నింపుకొని
రంగుదిద్దుకొని
అయ్యింది ఆ మొగ్గ — అందాల సుమబాల
ఆనంద లహరీ వల్లరీ పవన డోల.

ఇంతలో విలయకాలార్భటీ ప్రభంజనం
సాగించింది తన నిరంకుశ కర్కశ కరాల విలాసహేల

అబ్బా ! తెగినకంఠం. దోగిన రక్తం
రెక్కలూడిన పక్షిలా విలవిల్లాడింది ప్రసూనం.

ఇంత నిర్వేదంలో ఏదో ఆనంద తరంగం

అది నవమాసాల వయసుబాటసారి భువనంలో కాలిడిన
తొలి ప్రతాపం

మళ్లీ ప్రారంభం
ఆశావల్లరులు. ఆనంద ఝరులు
మమతాబంధాలు--అనురాగ గీతాలు
—ఎక్కడో గుండెను కుదిపే శోకం
మజిలీ మారిన మానవుని అంతిమ పయనం
ఇహబంధాలు త్రెంచుకున్న శాశ్విత మౌనం
వెలుగూ నీడా ఒక్కచోటే
ఆనంద బాష్పం అశ్రుకణం ఒక కంటే
రంగు రంగుల వలయం
అందులో తిరుగుతోంది ఓ సుందర శిల్పం
దానికి పోయాలి ప్రాణం
అదే జీవితం

"సౌంధ్య శ్రీ"

# సంప్రదాయం ప్రగతి వ్యతిరేకమా...?

సంప్రదాయం ఏ కాలంలో ప్రగతి వ్యతిరేకతను సూచించిందో, సంప్రదాయాన్ని నిరసించేవారు యిదమిద్ధంగా తేల్చలేదు. సాహిత్యం అందరి హక్కుగా మారిన ప్రజాస్వామ్యంలో ఈ ప్రచారం సాగుతుంది. ప్రస్తుతం జరుగుతున్నదికూడా అదే! సంప్రదాయమంటే సదవగాహనలేని కవులకు వ్యాకరణ సూత్రాలు, ఛందస్సు, అలంకారాలు, ఈ పదార్థ సముచయం సంప్రదాయంగా కన్పిస్తోంది. పాత అనే దానికి పర్యాయపదం సంప్రదాయమని కొందరి భావన.

వర్తమానకవికి, ముఖ్యం అభ్యుదయ కవికి [అభ్యుదయ కవులు ఒక రాజకీయ పక్షాన్ని భుజాన మోస్తున్నారు] తాను నమ్మిన వ్యక్తిగత సిద్ధాంతమార్గాన మిగిలిన మానవజాతిని నడిపించాలనే కోర్కె ఎక్కువైపోయి, దానికి సాధనంగా, వచన కవితను ఎన్నుకున్నాడు. సామాజిక లక్ష్యం వ్యక్తిగత లక్ష్యంతో ఛేదిస్తుంది కదా. వ్యక్తిగత లక్ష్యమే సామాజికలక్ష్యం కావాలనే తపన, కరపత్ర కవిత్వంగా రూపుదాల్చింది. ఈ సిద్ధాంతం ఏకపక్షమేనని అంటే వారిని తిరోగాముల క్రింద, వర్తమానముఖానికి వేల ఏండ్ల పాతను అతికించేవారి క్రిందా జమచేస్తున్నారు. సాహిత్యం విశ్వశ్రేయస్సును చాటిచెప్పాలనే నిజాన్ని— వక్రంగా ఎత్తిచూపిస్తున్నారు. ఇక్కడ యథార్థం కానరాదు. సాహిత్య పవిత్రతను గురి మరిచిన బాణంలా వదిలేస్తున్నారు.

"Poetry is some-thing "Divine". It is atonce the centre and circumference of knowledge. It is that which comprehends all Sciences"...... [Shelly]

ఈ Divine అన్న మాటలోను "knowledge" అన్న మాటలోను ఎంత అర్థాన్ని పిండుకోగలడు పాఠకుడు, వాడి ఓపిక.

## "నానృషి కురుతే కావ్యం"

ఎందుకంటే ఋషికాలేనివాడు కవికాలేడు కనక. కవి ఋషి కావాలంటే ముందు ద్రష్టకావాలి. ముందు తనలోని ఋషిత్వాన్ని దర్శించుకోగలగాలి. ఈ దర్శనం ఇక్కడ ప్రారంభమై సమస్త చరాచర వస్తుసముదాయంలోని ఔచిత్యాన్ని అంతర్దృష్టితో చూడటంతో సాగిపోతుంది. అపుడే కవిగాగలడు. ఒక మహార్థాన్ని శిల్పదృష్టితో చెప్పగలగటం మహాకవి లక్షణం. ధర్మాంశతత్వాన్ని చూడగలగటం శిల్పం. ఈ విలక్షణమైన సంపదను కావ్యంలో అంగవైకల్యం లేకుండా నిక్షేపించటం శిల్పం. ఇది విశ్వ శ్రేయాన్ని చాటుతుంది. సంప్రదాయాన్ని విప్పి చెపుతుంది. పరమ నిగూఢమైన అభిప్రాయములను సంతరించగలవాడే మహాకవి.

## "గ్రీవా భంగాభిరామం ... ...

అనే శ్లోకంతో ప్రారంభమయ్యే శాకున్తలంలో, కాళిదాసు తన కావ్యార్థమునకు ఉన్నతముగా చెప్పదలచిన మహావిషయమును సూచించినాడు.

శాకున్తల కావ్యవస్తువు సారంగము. శరము విమర్శ. కావ్యము కాయము. ఎడతెగని వియత్తు. పర్వతాచ్ఛాదితము ఉర్వి. ఈ మహాభావములను ఒక్క శ్లోకములోనే పొందుపరిచిన మహాశిల్పి కాళిదాసు.

ఈ కవిత్వం ఏకపక్ష కవిత్వంకాదు. ఇందులో అసందర్భ ధ్వనులు వినిపించవు. ఈ కవిత్వమే పరిశుద్ధమైన భావ సంపదకు ముకురమై శాశ్వతత్వం ఆపాదించుకొనగలుగుతుంది. విశ్వ జనీనతను చాటి చెప్తుంది. బహ్వర్థకంగా భాసించి ఉభయ తారకంగా ఉంటుంది. వాగ్గతశక్తి చేత. ఉచ్చరించినవాని జీవగతశక్తి చేత. అది మహావాక్కు. బహిరాగమన వాంఛా సహితమైన జీవైకదేశ వృత్తి వాక్కు. ఆ వాక్కు ఋషి అయిన కవిమాత్రమే చెప్పగలడు.

"Poetry is the record of the best and happiest moments of the happiest and best minds." [Shelly.]

ఈసు, అసంతృప్తి; వీటిని ప్రతిధ్వనించే కవిత్వం పై చెప్పిన "record" ను తయారుచేయలేదు. సంప్రదాయానికి అభ్యుదయానికి వైరుధ్యంలేదుకదా! ఉందని చెప్పటంతో ప్రారంభమైన తర్కం కవితాక్షరాభ్యాసకులైన ప్రతివారికి, ఆయుధమైపోయింది.

ఒక జాతి జాతీయతకు ఆ జాతి సంప్రదాయం పునాది. కవిత్వంలో ఈ సంప్రదాయం మరీ స్పష్టం. సంప్రదాయం ఏ ఒక్కడి వ్యష్టి ప్రయోజనాలను దృష్టిలో నుంచుకొని ఏర్పడ్డ వస్తువుకాదు; సమిష్టి ప్రయోజనాలకోసం ఏర్పడ్డ సంపద. విశ్వ శ్రేయస్సును కవిత్వం ఒనగూర్చుకొన్నప్పుడే సార్థకత. వ్యక్తిగత ప్రయోజనాన్ని ఆశించిన వర్తమానకవి, ఇదే సర్వజన సమ్మతమైనదానినిగా అభివర్ణించి, ప్రచారంచేస్తే ఆ ప్రచార సాహిత్యం విశ్వశ్రేయస్సును ఆశించదు.

ఇది మాత్రమేకాదు. వీరి సాహిత్యంపట్ల వీరికే యిదమిద్ధమైన నిశ్చయం, అవగాహన లేదు. ఎందుకంటే "They know so little what they think. "Know thyself", How could they, those men who have hardly a me to

**know. In every collective beleif religios or social, very rare are the men who believe, because very rare are the men who are men. Faith is a heroie force. Its fine has kindled but very few human hearts." [Romain Rolland]** స్వధర్మాన్ని గురించి—సంప్రదాయాన్ని గురించి. ఈవాక్యాలు, స్వధర్మ సంప్రదాయపరంగా అవగాహన చేసుకుంటేనే తెలుస్తుంది. సాహిత్యంలో సంప్రదాయాన్ని నిరసించటం, ఏసంప్రదాయం కాకుండా వుంటుందా? అదొక సంప్రదాయం. ఏసామాజిక శ్రేయస్సును స్పృశించిన సంప్రదాయం.

"తనవ్రాయు గంటంబు మొనవాడి
విశ్వంభరా ప్రజలకు ప్రాణరక్షణగాగ......"

పాండురంగ మహాత్మ్యయంలోని ఈ, తెనాలి రామకృష్ణయ్య గారి మాటలు గంటం మొనకు ఎంతటి ప్రాశస్త్యాన్ని నిర్దేశించిందో, అప్పుడే విశ్వకవి కాగలడు. ఈ విశ్వ శ్రేయం కరపత్ర కవిత్వంలో ఉంటుందని ఆశించ గలమా!

**"Ornaments would man our Union, their jingling Would drown thy whispers" [Rabindranath]**

పిడివాదులు, సంప్రదాయ నిరసులు, "Ornaments"అనే మాటను, ఛందస్సు అలంకారాలు, వ్యాకరణసూత్రాలు. వీటికి మరోపేరుగా ఉపయోగించుకుంటే నేను, అసందర్భకేకలు, ఆవేశ పూరిత అల్లకల్లోలమైన భాషాపద గుంఫనాలు వీటికి మారుపేరుగా తీసుకుంటాను. ఈ కేకలు, రంకెలు, విప్లవం మొదలైన అర్ధ, శ్రేయోభావరహిత అకవిత్వ దుర్వాయువులు, కవిత్వానికి, రససిద్ధికి, అడ్డుపడే గోడలని వీటివల్ల కవిత్వ ప్రయోజనం సిద్ధించదని.

**"My poets Vanity dies in shame, before thy sight" (Rabindranath)** గల గలలతో— కేకలతో, కరపత్ర సాహిత్య రచనలతో— మహాకవి అయిపోవాలనే తపనగల కవి, చేసే గారడీ విన్యాసాలు, కొన్నాళ్లయినాక చచ్చిపోతుంది. కవి బ్రతికుండగానే. కానీ మహాకవి మరణించినాకూడా చలనరఉండని ఒక కీర్తి ధ్వజాన్ని నాటి మరీ పోతాడు. కవిత్వంపోదు. ఒక మహాకవి దృష్టి తగులే — చనుబాలకవులకు మోక్షం వస్తుంది. ఆత్మ విమర్శవుంటే; సంప్రదాయ మంటేనే అవగాహన లేకుండా సంప్రదాయాన్ని నిరసించటం, ఆత్మ వ్యంధత్వం అవుతుంది. ఒక కవి సంప్రదాయ శైలిని పోలిస్తేనే శవవాహకుడైతే— ఈ ఆరోపణ చేసినవాడే నిర్వాహకుడు కావాలి.

వర్తమానం రేపటికి ఏమవుతుందో తెలియని అర్భకుడు గతమనే మాట ఎత్తరాదు. కవిత్వానికి గతమేమిటి? సంప్రదాయాన్ని గురించి తెలుసుకోవటానికి, అవసరమైన, శ్రమ పట్టుదల, అద్యయనం, వీటిని తట్టుకోలేక సంప్రదాయాన్ని ఒకేఒక మాటతో, త్రోసివేస్తే సరిపోతుందనే దురూహలోపడి ఆ కూపంలోనే మండూకమై జీవిస్తాడు.

వివేకంతో — అనుభవాన్ని ఆపోశనంపట్టి దాని సత్యాన్ని ప్రత్యక్ష జీవనతత్వంగా గోచరింప చేసుకోవటానికి, సంప్రదాయం పట్ల సదవగాహనతో కూడిన సంప్రదాయబలం కావాలి.

పాత్ర, బియ్యం, నీళ్లు నిప్పు, యివన్నీ వివేకమైన పరిస్థితిలో [సంప్రదాయబద్ధంగా] వాడుకుంటేనే, "అన్నం" అనే పదార్ధం తయారవుతుంది.

మానవునికి ప్రత్యక్ష పరోక్ష పరిసర సంబంధ బాంధవ్యాలు నిర్వాధకంగా ఎలా వుండాలో—ఎందుకుండాలో; విడమరిచేది సంప్రదాయం!

(A) వివాహమైనవారే భార్యా భర్తలుగా ఎందుకు పరిగణింపబడుతున్నారు?

(B) లైంగిక సంబంధంగల ప్రతి ఆడా—మగా, వీరిని మనం ఎందుకు భార్యాభర్తలుగా గుర్తించము?

(C) కామం ప్రకృతి సహజమైన వస్తువుకదా! ఇది అన్నా— చెల్లెలు, తల్లీ — కొడుకు వీరిమధ్యనే ఎందుకు నిషేధించబడింది?

ఇలా ప్రశ్నలు వేసుకుంటూపోతే, సంప్రదాయం ఏమి చేస్తుందంటే—"మనిషీ—మనీషతో యోచించు"మని చెప్తుంది.

శ్లో. తత్సాధుకృత సంధానం...... [కాళిదాసు]

ఆశ్రమ మృగవిషయంలో పంధించిన భాగాన్ని విడిచిపెట్టమని చెప్పటం విడిచిపెట్టటం సంప్రదాయం. ఇది శిఖాసునుదు, ఎవరు చెప్పినా ఒకటే! శిరోధార్యమే!

"సూత తపోవనవాసివాన్" ... [కాళిదాసు]

ఉపరోధము కూడమిచేతనేకాక, రధములో కూర్చొని ఆశ్రమ సమీపంలోకి పోవటం అవినయము, అపచారము అగునని, పాదచారిగా, వినత వేషముతో పోవటాన్ని, దుష్యంతుడు పాటిస్తాడు. ఎందుకు ఇలా చేయాలి. మహారాజుకదా? అంటే, సంప్రదాయం ఎవరికైనా ఒక రీతిగానే వుంది.

సంప్రదాయంపట్ల సదవగాహనతో సమస్యా పరిష్కార సాధనకుపక్రమించటం విజ్ఞతకానీ, సమస్యలకు సంప్రదాయమే కారణమనటం అజ్ఞత, అల్పజ్ఞత. ఇలా పతనాన్ని కవిగా తాను పొందుతూ, పతితుణ్ణి కూడా, పతనం చేయటం కవులు తమ హృదయంలో స్పందించని అనేక విషయ సముదాయాన్ని ముట్టుకొని, ఆత్మ వంచనపాలు గావటమే!

అభ్యుదయాన్ని తన శరీరాంగంగా ఒనగూర్చుకున్న సంప్రదాయం ఆధునిక చైతన్యాన్ని కూడా చెప్తుంది. విశ్వశ్రేయోదాయకమైన దివ్యభావదీప్తి దర్శనీయం కావాలంటే సంప్రదాయం వినా మరో భూమికలేదు.

# వైరభక్తి

## 'జమదగ్ని'

(గతసంచిక తరువాయి)

## పంచమాశ్వాసము

చేదిని చైద్యుఁడెంత చెడెఁజెప్పగ రాదు, తనంతతానె యు
న్మాదినియై వరించినది మానిని కృష్ణునటంచుఁ, గృష్ణుఁడున్
గాదన కన్య దత్తయగు కాంతను దొంగిలె నంచుఁ, గాన నిం
కే దెటులైన శీఘ్రముగ నిద్దఱ యంతము చూడ నెంచెడిన్॥

తన దని యెంచుటే మొదలి తప్పిద, మంగనఁజూచి తాను పొం
గును గను మాత్ర నామె తనకున్ లభియించునె? కన్యయెప్పుడున్
జనకుని యింట న్యాసమగు, సర్వవిధంబుల యోగ్యుఁడౌ వరున్
గని యొసఁగంగ నాతనికిఁ గామిని యౌఁ దన తావు చేరుటై॥

ఈఁడ జనించె గాని తన కిచ్చట నున్కి యొకింత మాత్రమై
యాడకుఁ దాను పోవలసి నందుననే యటు లాడ బిడ్డయౌ
పోడిమి కల్గెఁ, జెందనగు పూరుషు నిర్ణయముం బొనర్చు టే
నాడును తండ్రిదో తనదొ, నాతి లభించు టికెట్లు సాధ్యమౌ॥

జనకుఁడు లేని యప్పు డనుజన్ జనకుం బలె నన్న తల్లి యి
చ్చును గని యీయవచ్చు, ననుజాత యటంచును తల్లి తండ్రి యి
చ్చును గమనింప, కింతి యెద చాయ యెఱుంగక, మిత్రుఁడంచు నె
వ్వనికొ యొసంగ, నన్న తగు వాఁడెటు లౌను వివేకహీనుఁడై॥

తల్లియు తండ్రి యుండగ, సుతన్ గ్రహియించెడి యోగ్యుగూర్చి తా
ముల్లము తెల్పకుండు నెడ, నుద్ధతుఁడై, యధికార హీనుఁడై,
చెల్లె నొసంగు దే ననుచుఁ జెప్పిన యన్నను బట్టి, యామె దౌ
యుల్ల మెఱుంగకే, యువిద నొందితి నేనను, టెంత తెల్వియౌ॥

శిశుపాలుం డటువంటి తెల్విఁబడి, తా సిగ్గేది, నా స్త్రీని త
త్పశు పాలుండు హరించె, వాఁడు పరమభ్రష్టుండు, నారీ మనో
వశ కృన్మాయిక విద్యలన్ దెలియు దౌర్భాగ్యుండు, చోరుండు, దు
ర్యశమున్ గొప్పగ నెంచు సిగ్గరి, యతండా మీకు దేవుండనున్॥

అతఁడా రుక్మిణి గొంచుబోవు నపు, డెట్లైనన్ సరే యడ్డి, యా
యతివన్ వానికి దక్కనీ ననుచు, సైన్యాన్వీతుఁడై, రుక్మితో,
నితర క్ష్మాపతి కోటితో, నిలుపగా నెంతే ప్రయత్నించి, త
త్పతి తా నేసిన యొక్క యాశుగముతోఁ, బ్రాణమ్ములన్ గాచుకో॥

అతి భీతిన్ గనరాక దాగి, తన ధైర్యంబున్ బ్రదర్శించియున్,
బతియున్ వానిని మేనబావయని, పూర్వప్రోక్త వాగ్దాన సం
స్మృతిఁతో నిమ్మని యారకుండఁ, దన కింకే యడ్డు లేదంచు, దు
ర్మతియై కృష్ణ విరోధులన్ వెదకి, వారల్ ప్రాపులం చెంచుచున్॥

ఉన్నా నేను, ప్రపంచమున్నయది, సర్వోదాత్తమౌ ప్రజ్ఞతో
మన్నున్ మిన్ను సమస్తమున్ గెలిచి, సమ్యగ్భోగ సామ్రాజ్య ల
క్ష్మి న్నా యిష్టము వచ్చినట్లు చను దాసిం గాగఁ బాలింతు, నెం
దున్నాఁడింక జగద్విభుం డితరుఁ,డీ యున్నట్టి నేనుండఁగన్॥

ప్రకృతిని తల్లియంచు గొలువన్, దయ దాలిచి యామె నాకుఁ గో
రికలను దీర్చుచున్ మనిచి రేపును మాపును సాకునంట! యా
యక దయ యేరికిన్ వలయు? నద్భుతబుద్ధి విశేషముండి నే
నొకరిని గొల్చు దైన్యమున నుండగ నేల?జయింతు సర్వమున్॥

ప్రకృతి జయంబు గాంచు ప్రతిభా ఘను కంటె జగద్విభుండు వే
ఱొకఁడు కలండె? భూతగణమున్నది, యియ్యది చెప్పినట్టులే
టిక యగు నాకు నూడిగము లీల నొనర్పగ, సర్వసౌఖ్యముల్
ప్రకటిత శేముషిం గనెద, వచ్చిన దేహము సార్థకంబుగన్॥

ఎవఁడో యల్పుఁడు చేతకాని యతఁడై, యీ విశ్వముంగాంచి, త
ద్వివిధానేక మహత్త్వముం దలఁచి, తద్విజ్ఞాత కాలేక, దే
వివి నీవంచు భజించు, వాఁడకట ప్రహ్వీభూతుఁడై, వ్యర్థుఁడై,
యవమాన్యుండు, దరిద్రుఁడై మనును, నే నట్లేల చావన్ వలెన్॥

చావున్ గెల్తును, చావుతప్పని యెడన్, సర్వేష్టభోగంబు లి
చ్చా వశ్యంబయి నన్ను గొల్వగ నవశ్యంబంది, నాకంటె నే
దైవంబున్ గన రాఁడు పొమ్మనుచు, నా ధాటిన్ బ్రదర్శింతుఁ, గా
దా విశ్వమ్మనె రూపు మాపెదను, నాకై కానిచో నేలొకో?

ఎల్లరు కృష్ణుగాంచి జగదీశ్వరుఁడందురు, వాఁడు నీచుఁడౌ
కల్లరి, వట్టి మాయ బ్రదుకై, యొక కొన్ని విచిత్రకార్యముల్
బొల్లిగఁజేసి, గొప్పవని, పొల్లు మనుష్యులు దేవుఁడీ వనన్,
గొల్లఁడు తాను దేవుఁడను కొంచును వెఱ్ఱిగ విఱ్ఱవీగెడిన్॥

కాలము కూడి రానకట కంసుని జంపెను, చచ్చెగాని యా
భీలుని వాని బోలు నొకొ భీరుఁడు కృష్ణుఁడు? కంసుఁడల్లుఁడై
కూలుటఁగూతు కోసమయి క్రోధము నూనె జరాసుతుండు, నా
యాలి హరించు జాల్మ నణగార్తును మాగధుతోడి మైత్రిమై॥

వేఁడన వేఁడ్కు వాఁడగు, గిరి వ్రజ వప్ర సురక్షితాత్ముఁడై,
కూడిన గొఱ్ఱెలట్లుగనె కోట్ట నిబద్ధులఁజేసె రాజులన్,
వాడి కరాసి వ్రేటులను భైరవ తృప్తిగనిచ్చు కంఠముల్;
వీఁడొక వీరుఁడౌనె పరవీర భయంకరుఁడాతఁడుండగన్॥

సకల క్షత్త్రియ వంశజాతుల జరాసంధుండు తాగెల్చి, నే
టికి నే బంద్రు ధరాధి నాయకులఁబట్టెన్, దక్కునేబంద్రు చి
క్కక యేమౌదురు? నూర్గురైన తఱి తత్కంఠంబుల్వన్ ద్రుంచి శీ
ర్షకముల్ తృప్తిగ భైరవార్పిత మొనర్పన్, వాఁడు దుర్భేద్యుఁడా॥

హంస డి భకులు వాని సైన్యాధిపతులు
లింగమున్ మ్రింగు మన గుడి మ్రింగు వారు
తనకు మూర్ధాభిషిక్త శతమ్ము వలయు
రాజు లన వేఁడు వేసవేల్ రాజవరుల॥

కారాబద్ధులఁజేసి రా ఘనులు, నా కంసాంతకుం డన్నచోఁ
గారాల్ నూరుచునుండు రెల్లపుడు, కష్టన్ పొంద్రకుండున్ దృఢీ
కారం బొప్పఁగ వాసుదేవుఁడను నేగానీ మరెవ్వాఁడు నా
పేరన్ లేఁడను, నేను వారి బడి యేడ్పింతున్ మనః కంటకున్॥

ఇట్టి తలంపులన్ బెనిచి, యీాసు శతాధిక మౌచు, నల్దెసల్
తొట్టిన మంటయై యెగసి దుస్సహ మౌచును తొందరింప, వాఁ
డట్టె బృహద్రథాత్మజుని యండను జేరి, చమూపతిత్వమున్
బట్టె, యదూత్తముం డీఁకనుబట్టువడెన్ దనకంచు నెంచెడిన్॥

స్వాశ్రయ నాశహేతువగు వహ్నికి వైరముచుట్ట మౌట, స
ర్వాశ్రయుఁడైన కృష్ణు నెడ వైరము హెచ్చిన చైద్యుఁడంధుఁడై,
యశ్రమ సాధ్యమౌను తన యాశయమంచు, స్వజాతి మృత్యువున్
బ్రశ్రయ మొప్పఁజేరి, కొలువన్ సమకట్టెను; దైవ మొప్పనే?

తన మృతి వాని చేతనని తథ్యమెఱింగిన వాఁడుగాన రు
క్మిణి గొని పోవునాఁడు మృతికిన్ భయమంది పరారియయ్యె, నం
తన శిశుపాలు భీరుఁడనఁదథ్యముకాదు, మహాపరాక్రముం,
డని మొన వాని మ్రోల హరి కన్యులు నిల్వగ లేరు ధీరులై॥

కౌశిక చిత్ర సేనులనఁగా యమతుల్యులు, శస్త్రమృత్యువే
కోశమునందులేని కడు క్రూరులు, వారిని జేర్చు మాగధున్,
శ్రీ శివదేవుఁడన్న మతిఁజేరి, స్వజాతి వినాశహేతువై
యా శిశుపాలుఁ డాత్మరిపు నార్పఁగఁజూచును దుష్టచిత్తుఁడై॥

వాఁడటు మాగధున్ గొలిచి, వానికి సైన్య పతిత్వమూని, య
వ్వాఁడు పొనర్చు రాజశతబంధన హింసకు బాసటౌచు, నీ
రేడు జగంబులందుఁ దన కెవ్వఁడు లేఁడె దురంచు పేర్చి, క్రొ
వ్వాడి మగంటిమిన్ దిరిగి, వాఁడు ఘొనర్పని పాపమున్నదే?

సారతపస్వి బభ్రు వొకసారి నిజాంగన సుందరాంగి సౌ
వీరము చూడఁబంపె, నట వీఁడు బలాధికుఁడే నటంచు, నా
చారు చరిత్ర సాధ్వి నొక చాటునఁ బట్టి బలాత్కరించి, ని
ర్దారత పేరు చెప్పి, తన దారగఁజేసెను, సాధ్వులేడ్వగన్॥

పాలిత ధూర్తయుండు శిశుపాలుఁడు పార్థివు కార్యమూని వై
శాలికి నేగె, నచ్చట విచార విదూరుత సంచరించి, ఛం
డాలుఁడు, స్వీయ మాతులుని డాసి, గృహంబున కంటకింపుగా
నారి చరింప, భద్ర, తన యాళియె పొమ్మని తెచ్చె, నాయమన్॥

పరదారాపహృతి ప్రవీణత లహో ప్రాప్తించె, జన్మాంతరా
చరితంబై వెనువెంట వచ్చిన కుసంస్కారంబుగా వాని, కు
ర్వర సర్వుల్ తమ కన్య నిచ్చు తలపే పాపంబుగా నెంచిరో,
వరియింపన్ జనఁబోదా యెవ్వలెయు తత్పాపిష్ఠు క్రూరాత్మునిన్॥

తను వరియించు కన్యనరుదారగ పెండిలి యాడు ధన్యతన్
గనక, తనూజఁగన్న యొక కారుణికుండు నరుండి తండు నా
తనయకు నంచునీయక, స్వదారగ నన్యగృహీత కాంతనే
కొనఁదగు పాపులున్ జగతిఁగొల్లలుగాఁగనిపింతు రెల్లెడన్॥

ఎంగిలి కూటిపై బ్రదుకు లీడ్వక తప్పని జీవితంబు లు
ర్వింగనుచుండు, మట్లె ప్రభవింతురు కొందరు పారదారికా
ర్తిం గని కాలమీడ్చు కు గతింగను పాపులు, తత్పరిస్థితిన్
పొంగుచు పౌరుషంబనుట, పోలు శునిత్వమె శ్రేష్ఠ మంటకున్॥

సోదరి తల్లి యంచనక, చూపున కానిన సుందరాంగికై
వేదురునందు భ్రష్టమతి, వీడని పాశవ తత్త్వమౌచు, సం
పాదిత పుణ్య లేశమున మానవతన్ గనినట్టి వాఁడు, రూ
పాదిక మందె మానవత, యాంతరమందు పశుత్వ మెక్కువౌ॥

కర చరణాదికంబులను గాంచి నరాకృతి నున్నయంత నే
ల్లరు నరులే యటున్న భ్రమలన్ బడరాదు వివేకవంతు, లీ
నర తను ధారులందె పులి, నక్క, యెలుంగు, భుజంగమంబు, కే
సరి, శునకంబు మున్నయిన జంతువు లుండును మారురూపునన్॥

పశు తను వైన జీవునకుఁ బాపఫలంబగు జన్మమౌట, త
త్పశుతను బాపికో నలున పద్ధతి భోగము తప్పవేలులే,
దనువులు బాసి యన్య జని నందగనౌను, పరాత్పరుండు దు
ర్దశఁ దొలఁగింప నెంచునెడఁ, దాల్పగ నిచ్చు మనుష్యదేహమున్॥

అది తన కబ్బినన్ సుకృతి, యప్పటినుండియు జాగరూకతన్
మెదలి, మనం బొకండు కడు మేలయి వచ్చుట, తన్మనుష్యతన్
గుదురుగ నిల్పికొంటకయి కోరి నిరంతర నిర్విరామ స
త్పద గతి సాగు సంస్కరణ తత్పరుఁడై శుభమందగా వలెన్॥

నరదేహంబు నరత్వమున్ నిలుపుచున్, నారాయణుంజేయు ని
ర్భర శక్తింగల యట్టిదౌ, దద్ది లభియింపన్ దాని వ్యర్థంబుగా
దొరలం జేయుచుఁ దోఁచినట్లు చనుచో దుర్దైవ మా పూర్వ దు
ర్భర పశ్వాది శరీర ధారణమె తప్పంబోక కూర్చున్ వెసన్॥

చైద్యుండీ జని మర్మమున్ దెలిసి స్వేచ్ఛన్ వైరభావంబుతో
వాద్యున్ దిత్యు ననుక్షణంబు తలపోయన్బూనె, నేనాటికేన్
భేద్యంబౌను స్వకాయ మాతని కృపన్, ధీదూరుఁడై తాను దు
ర్భేద్య ద్రోహ మొనర్చుచుండిన యెడన్, భిన్నంబగున్ వెంబడిన్॥

తన కీ జన్మముతో నమోఘముని వాగ్దత్త ప్రభుద్రోహకృ
త్తను వెల్లైన నశించి, దైవకృపఁ బ్రాప్తంబౌను తద్దాన్య భూ
షణ పుణ్యాంగము — దుష్టదేహమున శ్రీ శధ్యాన మింకెట్టు లా
నని యీ మార్గము ద్రొక్కె, నిష్ఠమెయి తానందెన్ పరాకాష్ఠయున్॥

పశుతను వెట్లు పూర్వకృత పాపఫలంబయి కాలయాపన
ప్రశ మన లక్షణం బగునొ, పార్థివరాక్షస దేహమిద్దియున్
ప్రశమితమౌను కాలమున, రా దగు దుష్ఫల ముండఁబోదు, త
ద్వశమయి తానొనర్చు దురితంబులు భర్జిత బీజ భూతముల్॥

వచ్చు ఫలంబు లేక, పరిపంధిగ భాగవతాపచార మి
ట్లెచ్చుగఁజేయఁ జేయ పరమేశ్వరుఁడెట్లను కోపమందిము
చ్చిమ్ములు రేగినట్లు తన శీర్షము ద్రుంచి యసహ్యవేదనా
భ్యుచ్చయ హేతుదేహమిది యూడ్చును తప్పదటన్న యాశమై॥

ప్రారబ్ధక్షయమెంచి తీవ్రుఁడయి చెప్పన్‌రాని దోషంబు లె
వ్వారున్ జేయగ సాహసింపనివి దైవ ప్రేరితుండౌచు దు
ర్వారుండై పొనరింప సాగెఁబయి కప్పాపాత్ముఁడట్లయ్యులో
లో రాజీవ విలోచనాంఘ్రి యుగ సుశ్లోకాత్ముఁడై యొప్పెడిన్॥

నూనరి మాగధుండయిన, శూరుఁడు చైద్యుఁడు వాని చేతి ధా
రా నిశితాతిలోక చతుర క్షుర తుల్యుఁడు, బ్రహ్మదత్త సం
తానము సైన్యనాయకత తాల్చిన వారఖ శస్త్ర మృత్యువే
లేని కృపాణముల్, నరబలిన్ బొనరింపగ నడ్డ మున్నదే ?

నలువురు నల్వురే భువన నాయకుఁడీ చతురాస్త్రయుక్తిచేఁ
గొలకొల లాడుచున్న పురుగుల్ బలె భూమికి భారమౌచు వి
చ్చలవిడి సంచరించు నరజన్ముల నెందరినో వధించి, వి
హ్వలత భజించు లోకమున కచ్చెరు వౌనటు కూల్చెవారలన్॥

మా గధుఁడార్జితుండగుచు మాటికి మాటికి దండయాత్రగా
రాగ భయార్దితుండయి పరారయినట్టులు కాని పించకే
దాగి, నృదేహధారి నిజధామమునే త్యజియించి, వేలుచో
నూఁఢు మఱొక్క డే ర్పఱచి, యుండెను తానట విస్మయం పడన్॥

ఆ భీరుం డతి భీరుఁ, డాతఁడొక లెక్కాయంచు వీరెంచి, వి
శ్వాభీలంబుగ రేగి మారణ మహాయజ్ఞంబు గావింప, స
ర్వాభిజ్ఞుండగు స్వామి యూరకొనెఁదానై చేతకానట్లు లో
హో భద్రం కరుఁడాతఁడెంతటి నటుండో యూహ్యమే కాదహో॥

అంతకు కారకుండయిన యాతని కొక్కటి చేతకాని దీ
సుంతజగాన నుండునొకొ, చూచును జూచును సాక్షియౌచు నీ
వింతను హేలగాఁ, దుదకు విశ్వమునే హరియింపఁజేయు, నా
యంతము గూడ జీవకృతమై చను కర్మఫలానుసారియౌ॥

చూచెద జూచె యాదవుఁడు, చూచి నిమిత్తములైన వీరి సం
కోచము చేయనెంచి, యనుకూల శుభక్షణమందుఁ, జచ్చెరా
నీచుఁడు హంసుఁడన్న నుడినిన్ డిభకుండు వినంగఁజేసె, నా
లోచనలేని యా జడుఁడు, లోకమికెందుకు నా కటంచునున్॥

జలముల మున్గి చచ్చె, నను జమ్మఁడిటుల్ మరణింప, నింక నీ
యిల వయి నుందునే యనుచు నేడ్చి బలాన్మృతినందె హంసుఁ, డా

ఖలియుర దుర్మ్రుతిన్ విని విపక్ష విహంగమువోలె మాగధుం
డలసట నంది స్వీయ భవనాంగణ మందున మృత్యువున్నటుల్॥

తలంచుచు నింటనే గడప దాటక యుండిన కాలమందు, ని
ష్పత్తలముగ రాజసూయ మరి సూదనుఁడై పొనరింపనెంచె ని
ర్మల మతి ధర్మమానుఁ, డది మాటుగ కృష్ణుఁడు, భీమపార్థులు
జ్జ్వలులయి వెంటరాగఁ జని, చంపగఁజేసెను వాని నింటనే॥

మునికృప నిద్ద అమ్మలకు ముక్కలు రెండయి పుట్టుటేమి, వా
నిని గను తల్లులే కనుకనిన్ గనఁజాలక వీధిఁబాఱ వై
చిన నవి సంధితంబులయి జీవముతాల్చి బలిష్ఠ దేహమై
యినకుల నాశహేతువగుటేమి, యిదంతయు మాయకాదొకో!

కారణ కార్యజాతముగఁ గానగ నౌ జగమంత కొక్క స
త్కారణ మున్నదన్న నది కారణహీనము, సత్తు కారణం
బై రమణీయ కార్యగతి నందిన యట్లుగఁ దోఁచునట్టిదై
పార మెఱుంగ రాని యనుభావ జగంబున కంతమున్నదే!

తీరినబుద్ధి దీని కవధింగను కోరిక దూరి దూరి యే
తీరము చెందలేక ప్రకృతింబడి నీరసమైన వేళ, నీ
దారి నెఱుంగరాదు నిజతత్త్వము వట్టిన ముంచు మంచు వి
ప్పారఁగఁజేయ లో నమరు నగ్ని జ్వలింపగఁ జేయగావలెన్॥

విచ్చిన మంచుగానయిన విశ్వసమస్తము మాసిపోవ, ని
వ్వచ్చర మంచుఁ దామెఱిఁగి పట్టగు నాత్మయె, విశ్వరూపమై
విచ్చిన దంచు కీ లెఱిఁగి, విశ్రుతకీర్తులు బ్రహ్మవేత్తలా
యచ్చపు తెల్విగా నిలిచి యందిరి యాత్మసుఖ స్వరూపతన్॥

ప్రకృతి యసంగ మానసమె, పట్టున నిల్వక పాఱుచుండుటే
ప్రకృతియగున్, నిరంతరము పాఱుచు పట్టగరాని పొంగులై
వికృతిని బొందు దానిబడి వెల్లులు విశ్వమెఱుంగ నెంతు, రీ
ప్రకృతి విచిత్ర చిత్రగతి బద్ధులఁజేయు సమస్త జీవులన్॥

మాయికమైన మానసమె మాయ జగంబగుచుంట నెంతగాఁ
బోయిన నేదియో తెలియఁబోయిన దన్నటు తోఁపఁజేయుటే
చేయును, దాని మాయఁబడి చిక్కుటయే యగుగాని జీవునిన్
జేయదు ముక్తు, జీవితమె చేదగు దుర్దశఁదెచ్చుఁ దప్పకన్॥

ఎడపెడలౌచుఁ బేలిపడి యంటిన మాగధు దేహ భాగమున్
సుడివడి చూచి, స్నేహమున శూన్య మనస్కత దుఃఖమందియున్
గడువడి నచ్చోటున్ విడిచి కానల నొంటరిగాగ నుండి తో
ద్పడిన విచారధార నిటు భావన చేసియుఁ జైద్యుఁడంతటన్॥

అడుసున మున్గి, వెల్వడగ యత్న మొనర్చెడివాఁడు, వేగిరం
పడిన కొలంది లోఁబడెడి పద్ధతి, మాయకు మూలమైన యా
గడుసు మహత్త్వశక్తి యదుకాంతుఁడె యింతకు హేతువంచు, లో
బడక వధింతు వీనినని వైరమువే ప్రబలించుకొంచుఁబోన్॥

సహదేవున్ మగధాభిషిక్తునిగఁ దత్స్థానంబునందుంచి, ధా
ర్యహుఁడౌ ధర్మజు రాజసూయమున కాహ్వానించి, సద్భక్తుఁడై
బహురత్నాంబర భూషణాదిక గజాశ్వశ్రేణి నర్పింపగా
బహుమానంబున గొంచుఁ, గృష్ణుఁడరిగెన్ బార్థుల్ తనున్ గొల్వగన్॥

మాగధు చేతఁగారఁ బడి క్రమ్గుచునుండిన రాజలోక మ
య్యాగసుఁజంపఁజేసి తమనందఱనున్ విడిపించి, పూర్వ రా
జ్యాగతి సౌఖ్యముండుఁడని యంపిన కృష్ణుని, వారు దేవునిం
గాగ భజించు టచ్చెరువె? కాంబరి సర్వులమంద సౌఖ్యముల్॥

మాగధుఁ ఛీల్చినాఁడు పవమాన తనూజుని భీమబాహు సం
వేగ నికృత్త దేహుఁడయి, వీరులు కౌశిక చిత్రసేను లు
ద్వేగమునంది స్నేహమున వీడిరి దేహములన్ దమంతటన్,
సేగి యొనర్చెఁ గృష్ణుఁడని చేది ధరాపతి వైరమూనెడిన్॥

ఇదియొక వెఱ్ఱి, లోకమున నెవ్వని కెవ్వఁడు మేలుకీడులన్
పొదవగఁ జేయలేఁడు, తమ పుట్టువు చావు సమస్త భోగముల్
కదలెడి జీవకృత్యములఁ గొంతురు సర్వులు, కాని వానికిన్
గదలని యాత్మకారణముగాఁ దలపోయుదు రజ్ఞతా మతిన్॥

కారణ కారణంబగుచుఁ గార్య సమస్తముగాగఁదోఁచు ని
ష్కారణమైన యాత్మకొక స్పందనమున్నదె? యున్నదేకమై
వేరెది లేక యుండుగద, విశ్వసమస్తము తానెయౌచు, నౌ
రౌర యదెట్లు కారణ మిహాగత జీవ శుభాశుభాదులన్॥

అది యట్లుండగ, నద్ది తానన, కవిద్యా మోహితుండైన త
త్పద విభ్రష్టుఁడు జీవుఁ, డాత్మకృత సర్వస్వాత్త సంభోగ సం
పద నోలాడుచు, నెవ్వఁడో తనకు నాపాదించె నంచెంచుఁ,ద
త్పద వాచ్యుండును చేయలేని దిది జీవభ్రాంతి ముమ్మాటికిన్॥

తనకున్ దానె రిపుండు మిత్రుఁడును, దుర్దైవంబునాఁ బూర్మ
న్మను దాఁజేసిన పాపమేయగును, గర్మప్రాప్తమౌ భోగమున్
గను జీవుండు సుఖాసుఖంబులకు నిక్కంబందుఁ దాహేతువౌ
నని గుర్తించి, విముక్తి నందుటకునై యత్నంబుచేయన్‌వలెన్॥

ఆత్మాభిన్నుఁడ నేను, సర్వజగ మధ్యస్తంబు నాయందు, నే
నాత్మన్ గావున నాకు భిన్నముగ నన్యంబేమియున్ లేదు, వి
శ్వాత్మత్వ స్ఫుటభావనా మహిమ నే నాప్తకాముండ నన్
స్వాత్మప్రత్యయమున్న వానికిక మిత్రా మిత్ర భావంబెటుల్॥

శిశుపాలుం డవివేకి కాఁడు, త్రిజను శ్శ్విత్ర స్వభావంబుతోఁ
బశుపాలుండగు నీశ్వరున్ గలియు తాత్పర్యంబుయై వానిపై
కసి పూవెన్ విసువెత్తి చంపి తనకీ కాయంబు పోగొట్టి లో
నినుమంతైనను భేదమెంచని తనంబే కాచునన్ దృష్టియై॥

కాలము కూడి వచ్చినను గాని ఫలింపదు లక్ష్య మెంత తం
టాలును పడ్డ దేహధరణంబున దప్పని చిక్కుగానఁ బో
గాలము కోసమై యతఁడఖండ తపంబొనరించెఁ గృష్ణునిం
దాలపనంబు రూపమున నయ్యది మెల్లగ పక్వమందగాన్॥

నలువురు తమ్ములున్ జనిరి నాల్గుదెసల్ విజయంబుగాంచి భూ
తల పతు లెల్లరున్ యమసుత ప్రభుతన్ మన మార నొప్పికో
నలఘుఁడు రాజసూయ మహితాధ్వర దీక్షితుఁడయ్యె నన్న వా
ర్తలు విని చైద్యుఁడున్ దలను దాల్చెఁ దదాజ్ఞను ముక్తికాంక్షమై

(ఇంకా వుంది)





పసి బిడ్డకు
జీర్ణసంబంధమైన
బాధలు కలిగినప్పుడు...

సౌమ్యంగా పనిచేసే

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

బాధను అతి త్వరగా తగ్గిస్తుంది




గృహౌషధములు
తయారుచేయుటలో
తరతరాలుగా
నమ్మికకు పాత్రమైన
అమృతాంజన్‌వారి
తయారి.

కడుపునొప్పి, అజీర్ణము, వాయువు, పళ్ళు వచ్చేటప్పుడు కలిగేబాధలు మొదలైన వాటిలో దేనితోనైనా సరే, మీ పసిబిడ్డ బాధ పడుతూంటే అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్‌తో అతి త్వరగా ఉపశమనం కలిగించండి త్వరగా సులభంగా తిరిగి మీ పసిబిడ్డ ఆనందంగా నవ్వుతుంది.

అమృతాంజన్ లిమిటెడ్

OBM 3410/1 TG

హిందీమూలం : ప్రీతమ్ బేలీ    అనువాదం : గాదంశెట్టి

# ఒక చౌక్కా, ఒక అబద్ధం

బేచర్‌కు ఇంతకు ముందెప్పుడూ ఇలా జరగలేదు. అతడు చౌక్కా ఎప్పుడూ తొడుక్కోలేదు. ఇంతవరకూ పనికి పోలేదు. రాత్రిళ్లు ఇలా ఎప్పుడూ జాగారం కూడా చేయలేదు.

రాత్రంతా బేచర్ అటూ ఇటూ పొర్లుతూనే వున్నాడు. ఒక్కక్షణంకూడా కునుకు తీయలేదు. తన కొత్త చౌక్కా గుడిసెలోనే తన ఎదుటనే ఒక చిలుము పట్టిన పాత టిన్నురేకు డబ్బా పైన పెట్టివుంది.

బేచర్ ఇంతకు ముందెప్పుడూ చౌక్కా తొడుక్కోలేదు.

గ్రీష్మఋతువు మండిపోయే కంబళి మాదిరి వస్తుంది. ఆ పెళపెళ లాడే ఎండల్లో చౌక్కా అవసరమే వుండేదికాదు.

వర్షఋతువులో బాగా వానకురుస్తుంది. వానజల్లు కొరడా దెబ్బల్లాగా వొంటిపైన పడుతుంది. చురుకైన సూదుల్లాంటి వర్షపుబొట్లు వేనకువేలు వొంటిపైన పడుతూవుంటాయి. వాటి చురుకైన కొనల తాకిడికి తట్టుకుంటూ నల్లని తాబేలులాగా ముడుసుకపోయి మోకాళ్లపందున తలదాచుక్కొని గుడిసెలోనే గుట్టుగా వుండిపోయేవాడు. వర్షాలు దాటిపోగానే ఊరిబయట, ఆ భిల్లుల గూడెంలో, చుట్టువట్ల కొండలపైన, వాటి లోయల్లోన పరిసర పాలాల్లోన నలువేపుల పచ్చపచ్చని మెత్తని గడ్డి దుప్పట్లు పరచినట్లుండేది. అప్పుడుకూడా బేచర్‌కు చౌక్కా అవసరం వుండేదికాదు.

శీతాకాలపుచలి చురుకైన కత్తిపదునులాగా శరీరంలో గుచ్చుకుంటుంటే, బేచర్ ఒక పాత గోనెపట్ట ముక్క వొంటికి చుట్టుకొని తిరుగుతూ వుండేవాడు.

కలపమండీ యజమాని ముసలి షావుకారు కరెంట్‌షాక్ తగిలి ఆకస్మికంగా చనిపోతే, ఆయన కొడుకు తన తండ్రి తాలూకు మంచి మంచి ఖరీదైన బట్టలు బ్రాహ్మలకు దానంచేసి, పాత బట్టలు బీదలకు దానంచేస్తే ఓ పాత కంబళీ బేచర్ తండ్రి, మంగలూ వంతుకు వచ్చింది.

మంగలూ ఆ పాత కంబళీని రెండు ముక్కలుచేసి ఒకటి తన పెళ్లానికీ, రెండోది బేచర్‌కూ ఇచ్చాడు.

బేచర్ తన వొంటిపైనున్న పాత గోనెపట్ట తీసివేసి దాన్ని చిన్న చిన్న ముక్కలుచేసి, వాటిల్లో ఎండుగడ్డి కుక్కి చిన్న చిన్న బంతులు చేశాడు. వొంటిమీద ఆ పాత కంబళిముక్క చుట్టుకొని ఊళ్లో తిరుగుతూ ఇంటింటికీవెళ్లి ఆ బంతులు తన సావాసగాళ్లకు పంచాడు.

బంతులు పంచడం నెపంమాత్రమే. తన కంబళి సావాసగాళ్లకు చూపడమే అతడిలోని ఆకాంక్ష. ఆరోజు సాయంకాలం వరకు పిల్లలంతా బేచర్ తయారుచేసిన బంతులతో ఆడుకుంటూ వుండిపోయారు. వాళ్లంతా కావాలనే, ఏదో ఒక నెపంతో బేచర్ చుట్టుకొన్న కంబళిని ముట్టుకువేవాళ్లు. కంబళిని తాకినంతనే తమశరీరాల్లో వేడి పాకినట్లుగా వాళ్లంతా భావించేవాళ్లు.

కంబళిముక్క గుడిసెలో తనక్రింద పరుచుకొన్నాడు. కొత్త చౌక్కా ఎదురుగుండా చిలుము డబ్బాపైన పెట్టివుంది.

బేచర్ నెమ్మదిగాలేచి తన చౌక్కాపైన చెయ్యివేసి నిమరడం మొదలెట్టాడు. బేచర్ తల్లీ దండ్రీ ఇద్దరూ గురకలు పెడుతున్నారు. తండ్రిగురకలు బిగ్గరగా, తల్లిగురకలు మెల్లగా వున్నాయి. వాళ్ల హెచ్చు తగ్గు గురకలు వింటూంటే, బేచర్‌కు సంబరంగా వుంది. తాను కూడా కృత్రిమంగా గురకలు తీయడం మొదలెట్టాడు. వాళ్ల ముగ్గురి గురకలు ఒకదానిలో ఒకటి లీనమైపోతున్నాయి.

కృత్రిమంగా గురకలు తీయడంలో బేచర్ గొంతు ఎండిపోయింది. నీళ్లుత్రాగడానికి గుడిసెలోనుండి బయటికివచ్చాడు. ఊరి కుక్క బొంకా ఓ మారు బిగ్గరగా మొరిగి బేచర్ అడుగుల శబ్దం గమనించి అతనివద్దకు వచ్చేసింది. బేచర్ రావిచెట్టుక్రిందవున్న కడవలో నీళ్లు ముంచుకొని త్రాగాడు. గుటకలు వేసేప్పుడు నీళ్లలో ఒక నక్షత్రం మెరుస్తూ, కదుల్తూ కనపడింది. తలఎత్తి నీలాకాశంవంక చాలా సేపు చూస్తూ వుండిపోయాడు. రాత్రి కప్పుకున్న నల్లకంబళికి వందలకొలది వెండి, బంగారు నక్షత్రాలు పొదగబడి వున్నాయి. చాలాసేపు ఆలోచిస్తూ వుండిపోయాడు. నక్షత్రాలు కూర్చబడ్డ ఆ ఆకాశపు చౌక్కా ఎంతబాగుంది! దూరంగా పొలాల్లో మిణుగుర్లు మిలమిల్లాడుతున్నాయి. అవన్నీ చూస్తూ వుండిపోయాడు. అతడికేమీ అర్థంకావడంలేదు. ఈ నక్షత్రాలు, ఈ మిణుగుర్లు, ఈ రాత్రి, నక్షత్రాలు చెక్కబడ్డ ఈ ఆకాశపుచౌక్కా, గుడిసెలోపల చిలుము డబ్బాపైన పెట్టివున్న తనచౌక్కా, ఇదంతా అయోమయంగా వుంది.

కుక్క బేచర్ కాళ్లు వాసన చూచి అతడిదృష్టి తనవేపుకు త్రిప్పుకుంది. బేచర్‌వంగి దాని ముఖాన్ని తన చేతుల్లోకి తీసుకొన్నాడు. కుక్క కళ్లు మూసుకుంది.

"బాంకా, నా కొత్తచొక్కా చూస్తావా?" బేచర్ అడిగాడు కుక్కను.

కుక్క తోకఆడిస్తూ వుండిపోయింది.

బేచర్ పరుగెత్తుకుంటూవెళ్లి గుడిసెలో దూరి తన కొత్త చొక్కాతెచ్చి కుక్కకు చూపిస్తూ తాను చూస్తూ వుండిపోయాడు. కుక్క తోక పైకెత్తి అతడిముందు గంతులు వేయసాగింది. ఉల్లాసంతో ఊగిపోతున్న బేచర్ కుక్కతోక పట్టుకొని పైకిలాగాడు. కుక్క కుంయ్ కుంయ్‌మంటూ పరుగెత్తిపోయింది. అతడేమో సంబరపడుతూ గుడిసె లోపలికి వెళ్లిపోయాడు. చొక్కాను మళ్లీ అదే పాత డబ్బామీద పెట్టేశాడు. క్రిందపడుకొని అటూ ఇటూ పొర్లుతూ తల్లిదండ్రుల గురకలువింటూ సూర్యోదయంకోసం ఎదురుచూస్తున్నాడు.

ఆనాటి సాయంకాలం మంగలూ ఇంటికివచ్చి బేచర్‌కు పని దొరికిందన్న సంతోషవార్త చెప్పాడు. ఊరి ప్రక్కనున్న పొలంలో ప్రభుత్వం నూనెగనుల కొరకు అన్వేషణ జరుపుతూంది. బావులు త్రవ్వబడుతున్నాయి. కాంట్రాక్టర్లు పని ప్రారంభం చేశారు. ఒక సూపర్‌వైజర్ను బ్రతిమాలుకొని మంగలూ తన కొడుక్కు పని ఏర్పాటు చేసుకొనివచ్చాడు.

ఈ వార్తవిన్న బేచర్ తల్లి పట్టరానంత సంబరపడింది. తన కొడుకు మొట్టమొదటగా పనిలో ప్రవేశిస్తున్నందుకు ఒక కొత్త చొక్కా తెమ్మని భర్తతో చెప్పింది. భర్త రాత్రికి బజారు నుండి వచ్చేప్పుడు రెండురూపాయల చొక్కా ఒకటి తెచ్చాడు. బేచర్ ఇంతకు ముందెన్నడూ చొక్కా తొడుక్కోలేదు, పనికి వెళ్లనూలేదు. రాత్రంతా ఇలా జాగారం కూడా ఎప్పుడూ చేయనే లేదు.

అటు ఇటూ పొర్లుతూనే రాత్రంతా గడిపాడు. రాత్రి, మిణుగుర్ల మెరుపులు, నక్షత్రాలు చెక్కబడ్డ ఆకాశపు చొక్కా, అన్నీ మాయమైపోయాయి, పగలు వచ్చేసింది తన రంగురంగుల ముస్తాబుతో.

తొడుక్కొన్న చొక్కా ఎలా వుంటుందో ఓమారు చూసుకోవాలనుకున్నాడు బేచర్. చొక్కా తొడుక్కొని ఒక పగిలిపోయిన అద్దంముక్కలో చాలాసేపటివరకు కళ్లు నిక్కబొడుచుకొని చూస్తూ వుండిపోయాడు. కాని, విరిగిపోయిన ఆ అద్దంముక్కలో ఓమారు ఒక చెయ్యి సగం కనబడితే మరోసారి మెడమాత్రమే కనబడేది. పై భాగం ఓమారు కనబడితే క్రిందిభాగం మరోమారు. వెనుకభాగం బొత్తిగా కనబడ్డమేలేదు. పాపం! బేచర్ మొత్తం చొక్కా ఒకేసారి చూడాలనుకున్నాడు. కాని వీలుకావడంలేదు.

ఉదయాన్నే కుక్కను వెంటబెట్టుకొని దగ్గరి పొలాల్లోకి వెళ్లాడు.

ఒక పంటపొలంలో దిష్టిబొమ్మను చూశాడు. దాని పాత చొక్కా తీసేసి తన కొత్తచొక్కా తొడిగాడు. దిష్టిబొమ్మను ఈ కొత్త చొక్కాలో చూసిన కుక్క భౌం భౌం అంటూ తోక ముడుచుకొని పరుగెత్తింది. బేచర్‌కు చాలా ఆనందం కలిగింది. అతడు ఆ దిష్టిబొమ్మను నాలుగువేపుల తిరిగి తిరిగి మనసారా చూస్తూ వుండిపోయాడు.

తర్వాత తన చొక్కా విప్పుదీసుకొని స్నానం చేయడానికి నది ఒడ్డుకు వెళ్లాడు.

ఒక చిన్న రాతిని ఒక పాతమేకుతో గీరి గీరి దాని చిట్టు తయారుచేశాడు. నదిలోకివెళ్లి ఆ చిట్టుతో రుద్దిరుద్ది ఒళ్లంతా శుభ్రం చేశాడు. అతడి కాకిరంగు మెరవడం మొదలెట్టింది. తన మొదటిచొక్కా మొదటగా తొడుక్కోవడంలో తిరగబడిపోయింది. మళ్లీ విప్పి సరీగ్గా తొడిగాడు. మళ్లీ తొడుక్కున్నప్పుడు మళ్లీ మళ్లీ విప్పడం తొడగడం చేయవలసి వచ్చింది.

ఇంటికి తిరిగివస్తున్న బేచర్ తనలో తాను మురిసిపోతున్నాడు. తన సంతోషానికి తానే సిగ్గుపడుతున్నాడు.

తల్లి కొత్తచొక్కా తొడుక్కొన్న తన కొడుకును చూసి నుదుట ముద్దుపెట్టుకొంది. తండ్రి తలమీద చేయిపెట్టి నిమిరాడు. ఆ రోజు బేచర్‌కు లభించపోయే కూలీ 'రూపాయ'లో అతడి జేబు ఖర్చుకుగాను రెండుపైసలు ఇవ్వాలా లేక ఐదుపైసలా? అన్న విషయాన్నిగురించి తల్లి దండ్రులిద్దరూ చాలాసేపటివరకు ఒక నిర్ణయానికి రాలేకపోయారు.

తల్లి కుమారుని ముఖంవేపు స్పష్టంగా చూసింది. చిన్నప్పుడు తన భర్త ముక్కూ మొఖంకూడా ఇలాగే వుండేదనిపించింది. వెంటనే భర్తకు నచ్చజెప్పింది, బేచర్‌కు జేబుఖర్చుకుగాను ఐదు పైసలు ఇవ్వాల్సిందేనని.

తండ్రి కలప మండీవేపు తన పనిమీద వెళ్లాడు. బేచర్ తన తండ్రి చెప్పినట్లుగా ఊరిబయట నూనెబావులు త్రవ్వేవేపుకు నడిచాడు. అతడికంటేముందే, అక్కడ చేరిన తోటివాళ్లంతా అతడి చుట్టూ మూగారు. ఆశాపూరిత నేత్రాలతో అతడి కొత్త చొక్కా వేపు చూస్తూ వుండిపోయారు. వాళ్లంతా ఆ కొత్త చొక్కాను గురించి మాట్లాడ్డం మొదలెడితే బేచర్‌కు అంతకుముందు తాను పంచిన బంతులు జ్ఞాపకం వచ్చాయి.

దారిలో అందరూ తన కొత్తచొక్కావేపే చూస్తూ వున్నారా? అనిపించింది బేచర్‌కు. తాను కూడా వాళ్ల చొక్కాల వేపు చూస్తున్నాడు. ఒకరిది చేనేతచొక్కా అయితే మరొకరిది పట్టుది. ఒకరిది ఖద్దరుచొక్కా అయితే మరొకడికి చొక్కానేలేదు. ఒకరిది విదేశీ టెర్లిన్‌ది. కొన్ని మామూలు చొక్కాలైతే కొన్ని రంగురంగులివి. ఇవాళ రోడ్డుపైన బేచర్‌కు మనుష్యులు కాకుండా చొక్కాలే వస్తూ పోతూ వున్నట్లనిపించింది.

* * *

త్రవ్వకం స్థలంవద్దకు వచ్చిన భిల్లుజాతీ కూలీలంతా

బేచర్‌ను కొత్త చొక్కాలో చూసి మొదట చాలా సంతోషించారు. ఆనక నవ్వసాగారు.

''అబ్బ! పిల్లాడు పెళ్ళికొడుకై కూలి చేయడానికివచ్చాడ్రా.''

కొంతమంది చొక్కాధర అడగసాగారు. చూస్తూ చూస్తూ వుండగానే ఎన్నోచేతుల మరకలు అతడి కొత్త చొక్కాకు అంటుకున్నాయి. బేచర్‌కు చాలా బెడ్డగాతోచింది. పనిజేయడానికి వచ్చిన భిల్లుజాతి ఆడపిల్లలు చప్పట్లుకొట్టి తనను దగ్గరికి పిలిస్తే, తాను భయపడి తిరస్కరించాడు.

త్రవ్వకం జరిగేచోట తమ పనుల్లో లీనమై వున్న చాలామంది కూలీలు బేచర్‌నుచూసి తమతమ పనులనే మర్చిపోయారు. వాళ్లందరి ఈర్ష్యాపూరితమైన, ప్రశ్నార్థకమైన, చురుకైన చూపుల్తో తన కొత్తచొక్కాకు చిల్లులు పడతాయేమోననిపించింది బేచర్‌కు.

అక్కడి భిల్లుజాతి కూలీలంతా మాసి చినిగి పోయిన బనియన్‌లు, చింకి పాతలైన చొక్కాలు తొడుక్కొని వున్నారు. వాళ్ల ముడతలు పడిపోయిన ముసలి వాళ్ళు పాత అంగవస్త్రం ఒకటి మొలకు కట్టుకొనివున్నారు. కొంతమంది పోలీసులు తమ దుస్తుల్లో వున్నారు. బ్రొరమీసాల సూపర్‌వైజర్ ఒకాయన ఖాకీదుస్తులు వేసుకొని వున్నాడు. ఓ పెద్ద ప్రభుత్వాధికారి తెల్లటి సూటుతో ఖాకీటోపీ పెట్టుకొని వున్నాడు. ఇంకా ఎంతో మంది చేతులు చూస్తూ చూస్తూ వుండగానే బేచర్ కొత్త చొక్కాపట్టిలాగ్గా, కొన్ని గుండీలు ఊడేపోయాయి.

ఒక ముసలికూలివాడు తన పైపంచ తీసి పక్కనపెట్టి ఓ గిన్నెలో సున్నంకలిపి, బేచర్‌ను చొక్కా విప్పి రమ్మంటే, బేచర్ అదిరిపడ్డాడు.

అక్కణ్ణుండి పరుగెత్తిన పరుగెత్తడం తన గుడిసె దగ్గరకు వచ్చి ఊపిరిపీల్చుకొన్నాడు. అతణ్ణిచూసిన తల్లిముఖం చిన్నపోయింది.

సాయంకాలం మంగాలూ అడిగితే, త్రవ్వకం జరిగేచోట తననెవరూ పనిలోకి పిలవలేదని చెప్పేశాడు.

మంగలూ ఆలోచనల్లో పడిపోయాడు. మళ్లీ అడిగి బ్రతిమాలుకుందామని చీకటి పడగానే సూపర్‌వైజర్ ఇంటివేపువెళ్లాడు.

రాత్రికి పొద్దుపోయింతర్వాత మంగలూ గుడిసెకు వచ్చి చూస్తే ఉతికి ఆరవేసిన చొక్కా బయట తాడుపైన శిలవవేసిన ఏసుక్రీస్తు బొమ్మలా కనపడింది. బేచర్ గుడిసె బయట దండెం వద్ద నేలమీద నిద్రపోతున్నాడు.

చొక్కా జేబులో ఒక మిణుగురు తళుకు తళుకు మంటుంది. మంగలూ చెయ్యివిసిరి దాన్ని విదిలించేశాడు.

బేచర్ నిద్రలో కలవరిస్తూ అటూ ఇటూ పొర్లుతున్నాడు నిద్రపోతున్న బేచర్‌వేపు చూస్తూ వుండిపోయాడు తండ్రి మంగలూ. బేచర్ ఇంతకు ముందెన్నడూ చొక్కా తొడుక్కోని సంగతి అతడికి తెలుసు. కాని పనిచేయడానికి ఇష్టంకాకపోతే, తనను ఎవరూ పనిలోకి పిలవలేదని అబద్ధం చెప్పవలసిన అవసరమేముంది ?

మంగలూ నక్షత్రాలు చెక్కిన ఆకాశపు చొక్కావేపు చూడలేదు, గుంపులు గుంపులుగావున్న మిణుగుర్ల మెరుపులవేపూ చూళ్లేదు. తలవొంచుకొని గుడిసెలోకి దూరాడు నిద్రపోవడానికి.

రాత్రి, నలువేపుల ప్రసరించిన రాత్రి, బేచర్ నిద్రమాదిరే నిశ్శబ్దంగావుంది. చొక్కా వొలిచిన మేకపిల్ల చర్మం మాదిరి తాడుమీద వేలాడుతోంది.

---

# 'గిరగిర'

'మోవి'

జరలో
　పారవిడి
ఒరచెడి
మరణం నవ్వింది.

భ్రాంతిలో
అశాంతిలో
కదలి కెరటాల్ని
వెనక్కు ముందుకు

తిప్పి విప్పి
జీవితం
ఉరక పరుగు నురుగు
కాదని
అడుగున అణిగిన
అగాధం లోతు
అవగతం కాలేదింకా
అయినా ఆగదీ పంకా
తిరుగును గిరగిర ...

---

శ్రీ కాకుమాను తారానాథ్

# 'అత్యావసర పరిస్థితి'లో రాజ్యాంగము

**'మేము అర్థం చేసుకున్నంతవరకు డిటెన్యూలను ప్రభుత్వం తల్లిలాగ చూస్తున్నది'- నేటి ప్రధాన న్యాయమూర్తి శ్రీ బేగ్, నాడు**

(రాజ్యాంగశాస్త్ర విషయాలలో ఉత్సాహం తీసుకుని, ప్రముఖ న్యాయవాదిగా 45 సంవత్సరాల వయస్సులోనే పేరుగణించి, అచిరకాలంలోనే అత్యున్నత పదవి నలంకరిస్తాడని ఆశలు గొలిపి, అశేష మిత్రులను దుఃఖంలో ముంచి స్వర్గస్థుడైన ప్రముఖ హైకోర్టు న్యాయవాది శ్రీ ఏ. లక్ష్మీనారాయణ పవిత్ర స్మృతికి ఈ వ్యాసం అంకితం. వారి దయవలన అనేక విషయాలు తెలిశాయి. కులదీపనయ్యర్ తీర్పు, కోకా సుబ్బారావుగారి ప్రసంగవ్యాసాలు వారు లేకపోతే నాకు లభ్యమయ్యేవి కావు. —రచయిత)

**జూన్** 1975—జూన్ 1977—రెండు సంవత్సరాలు. ఈ కాలగమనంలో జూన్, 1975 నుంచి మార్చి 1977 దాకా—ఈ 21 మాసాలు, మన 27 సంవత్సరాల రాజ్యాంగ జీవితంలో విచిత్ర అనుభూతులతో, అనుభవాలతో నిండినవి. ఆ జీవిత విశేషాలను క్లుప్తంగా పరామర్శించటమే ఈ వ్యాసర ఉద్దేశ్యం.

ప్రముఖ న్యాయవాది పల్కీవాలా లెక్కప్రకారం, 1971 నుంచి 1976 దాకా, 5 సంవత్సరాలలో, మన రాజ్యాంగం 19సార్లు సవరించబడింది. 463 చట్టాలు వచ్చాయి. భారత అధ్యక్షుడు 96 ఆర్డినెన్సులు, 30 రెగ్యులేషన్సు జారీచేశాడు. అధ్యక్ష పరిపాలనలో ఉన్న రాష్ట్రాలకోసమని 114 చట్టాలు జారీచేశాడు. ఇక న్యాయశాఖ 36,515 ఆజ్ఞలు తయారుచేసింది.

ఈ అత్యవసర పరిస్థితిలో, ఆగష్టు 1975 నుంచి నవంబరు 1976దాకా, 5 రాజ్యాంగసవరణలు వచ్చాయి. అంతే కాదు, ఈ 27 సంవత్సరాల జీవితంలో 10½ సంవత్సరాలు పైగా మనం అత్యవసర పరిస్థితిలోనే గడిపాం.

మొదటిసారి 1962 అక్టోబరులో చైనా దురాక్రమణ సందర్భంగా, రెండవసారి 1965 ఆగష్టులో పాక్ దురాక్రమణ సందర్భంగా అత్యవసరపరిస్థితి ప్రకటించబడింది. 1968తో ఇది రద్దయింది. తిరిగి 1971 నవంబరులో పాక్ దురాక్రమణ సందర్భంగా ఇది వచ్చింది. సిమ్లా ఒడంబడిక తరువాత కూడా ఇది రద్దు కాలేదు. తిరిగి మొన్న మొన్నటి అత్యవసరపరిస్థితి, జూన్ 75లో వచ్చింది. అన్నీ రాజ్యాంగంలోని 352వ అనుచ్ఛేదం ప్రకారం ప్రకటింపబడినవే. అయితే ఇదివరకటివన్నీ బహిర్గత దురాక్రమణల ఫలితంగా ప్రకటింపబడితే, మొన్న మొన్నటిది మట్టుకు అంతర్గతంగా శాంతిభద్రతలకు భంగం ఏర్పడటంవలన అత్యవసర పరిస్థితి ఏర్పడిందని ప్రకటించబడింది.

ఇలాంటి పరిస్థితులపట్ల దేశంలోని విజ్ఞులు అనేకమంది తమ సందేహాలను వెలిబుచ్చారు. స్వర్గీయ కోకా సుబ్బారావు, ఢిల్లీలోని దీనదయాళ్ రిసెర్చి ఇన్స్టిట్యూట్ వారు ఏర్పాటుచేసిన సమావేశం "ఎమర్జెన్సీ ఇన్ ది కాన్స్టిట్యూషన్ అండ్ డెమొక్రాసి"కు మార్చి 15, 1975న ప్రారంభోపన్యాసం చేశారు. అందులో ఆయన అనేక భావాలు వెలిబుచ్చారు.

356వ అనుచ్ఛేదం ప్రకారం రాష్ట్రపతి పాలనను విధించే అవకాశంకూడా దుర్వినియోగ పరచబడిందని ఆయన అభిప్రాయము. 1960 లో మెజారిటీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కేరళలో రాష్ట్రపతిపాలన విధింపబడిందనీ, 1961 ఎన్నికలలో కమ్యూనిష్టులకు అధికబలం ప్రాప్తించినా, గవర్నరు స్థిరమైన ప్రభుత్వం ఉండే అవకాశం లేదు అన్నాడంటూ రాష్ట్రపతిపాలన వచ్చిందనీ చెప్పారు. అలాగే 1967 అత్యధికులున్నా రాజస్థాన్ గవర్నరు వారి సంఖ్యలోనుంచి స్వతంత్రులను తగ్గించాలని వాదం లేవదీశాడనీ, ఉత్తర ప్రదేశ్‌లో సంయుక్త ప్రభుత్వనాయకుడు రాజీనామా చేస్తే, ఇంకొకరు ప్రభుత్వం ఏర్పాటు చేస్తామన్నా

అవకాశమివ్వలేదనీ, 1973 లో ఆంధ్ర, ఒరిస్సా, ఉత్తర ప్రదేశ్‌లలో రాష్ట్రపతి పాలన విధింపబడిందని చెప్పారు.

ఒక్కొక్కసారి రాజ్యాంగ పరిరక్షణకు అత్యవసరపరిస్థితి తప్పదనీ, కాని సమస్యఅల్లా ఈ రాజ్యాంగ నియంత (కాన్స్టిట్యూషనల్ డిక్టేటరు) ను ఎలా అదుపులో ఉంచాలా అనేదే నంటూ, అమెరికన్ న్యాయశాస్త్రవేత్త కారల్ ఫ్రెడ్రిచ్ వ్రాసిన గ్రంథం "కాన్స్టిట్యూషనల్ గవర్నమెంట్ అండ్ డెమోక్రసీ" నుంచి ఉదహరించారు. ఈ 600 పేజీల గ్రంథంలో రచయిత, రోమనుల కాలంనుంచీ ఈ అత్యవసర పరిస్థితి అనేది ఎన్ని రూపాంతరాలు పొందుతూవచ్చిందీ వివరించాడు. చిట్ట చివర కా రచయిత వీటన్నిటి వెనుకా ఉండవలసినది నిరంతర జాగరూకతతో మెలిగే ప్రజాసముదాయమని అంటాడు. [1]

మానవుడు అంగీకరించిన వాటిల్లోకల్లా ప్రమాదమైనది, ప్రభుత్వానికి అవసరమైనపుడు మానవ హక్కులను ఉల్లంఘించ వచ్చు అనే విషయమేనని, 1866 లోనే అమెరికన్ కోర్టు దీనిని గురించి హెచ్చరించిందనీ, ఇంగ్లాండ్‌లో బలమైన ప్రజాభిప్రాయము, అమెరికాలో న్యాయస్థానాలు ఈ ప్రమాదం రాకుండా కాపాడతాయనీ, భారతదేశంలో మేధావులమీద ఆ బాధ్యత ఉందంటూ ఆ సమావేశాన్ని శ్రీ కోకా సుబ్బారావు ప్రారంభించారు. [2]

సరిగ్గా ఈ సమావేశం జరిగిన మూడున్నర మాసాలకు అత్యవసర పరిస్థితి ప్రకటించబడింది.

* * *

శ్రీ కులదీప నయ్యర్ ప్రముఖ పత్రికా రచయిత. అత్యవసర పరిస్థితి ప్రకటించిన అనంతరము, జులై 16న ప్రధాన మంత్రికి ఒక లేఖ వ్రాశాడు. దానికి ప్రధాన మంత్రినుంచి సమాధానం కూడా వచ్చింది. కాని 24 జులైన ఆయనను అరెస్టు చెయ్యటం జరిగింది. దానిమీద ఆయన భార్య శ్రీమతి భారతీ నయ్యర్ ఢిల్లీ హైకోర్టులో రిట్ వేసింది. ఇద్దరు న్యాయమూర్తులు శ్రీ రంగరాజన్, శ్రీ అగర్వాల్‌లు దానిని విని సెప్టెంబరు 15, 1975న శ్రీ నయ్యర్‌ను విడుదల చేయమని తీర్పు చెప్పారు.

ఇందులో సెప్టెంబరు 1 నుంచి, 10వ తారీకు దాకా వాద ప్రతివాదనలు జరిగాయి. 12వ తారీకున, తీర్పు 15వ తారీకున వస్తుందని న్యాయమూర్తులు చెపితే, ప్రభుత్వం తరఫున శ్రీనయ్యర్‌ను విడుదల చేశారనీ, తీర్పు చెప్ప అవసరం లేదంటూ అర్జీ దాఖలు చేయబడింది. కాని తీర్పు అప్పటికే తయారయిందనీ, కోర్టుపట్ల కనీస మర్యాదతో 10వ తారీకునే తామిట్లా భావిస్తున్నట్లు ప్రభుత్వం చెప్పినట్లయితే బాగుండే దంటూ తీర్పు చెప్పటం జరిగింది.

359వ అనుచ్ఛేదం క్రింద ప్రాథమిక హక్కులు సస్పెండు చేయబడ్డా నిర్బంధితులకు న్యాయస్థానానికొచ్చే హక్కుందని ఈ తీర్పు సారాంశము. ఈ తీర్పులోకూడా కారల్ ఫ్రెడ్రిచ్ గ్రంథం నుండి ఉదహరించటం జరిగింది. అత్యవసరపరిస్థితులను తప్పక ప్రభుత్వం ఎదుర్కోవాలనీ, కాని సమస్యఅల్లా బలమైన చర్యలు తీసుకోవలసిన ప్రభుత్వము, నియంతగా మారకుండా చూడటం ఎలాగా అనేదేననీ, ఇది విచిత్ర పరిస్థితియైనా వాస్తవమంటూ, ఈ వాస్తవంలోనే స్వతంత్రముందంటాడు ఫ్రెడ్రిచ్. దీనిని న్యాయమూర్తులు ఉదహరించారు. [3]

మే 1976లో వచ్చిన హైకోర్టు న్యాయమూర్తుల బదిలీలలో శ్రీ రంగరాజన్‌ను అస్సాంకు వేశారు. రెండవ న్యాయమూర్తి శ్రీ అగర్వాల్ జిల్లా జడ్జి పదవినుంచి హైకోర్టుకు పోయారు. ఆయన నియామకాన్ని స్థిరపరచక పోవటంతో తిరిగి జిల్లాజడ్జిగా ఆయన వెళ్ళటం జరిగింది.

* * *

రాష్ట్రపతి ప్రకటన న్యాయస్థానాల హక్కులను తీసివేయ లేదనీ 21వ అనుచ్ఛేదం క్రింద న్యాయస్థానాలకు ఆ హక్కున్న దంటూ ఇంకా కర్నాటక, బాంబే (నాగపూర్), అలహాబాద్, మద్రాసు, రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, పంజాబ్, హర్యానాల న్యాయస్థానాలుకూడా, కారణాలేవైనా తీర్పుల నివ్వటం జరిగింది.

దానిమీద కేంద్రప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వాలు సుప్రీం కోర్టుకు పోయాయి. ఈ అప్పీళ్ళలో నేటి మంత్రులు శ్రీ అద్వానీ, వాజపేయిలు, శ్రీరామధన్ బోటి వారలున్నారు. వారితరపు న్యాయవాదులలో శ్రీ జెఠ్మలానీ, తార్కుండే, డాక్టరు ఘటాటే బోటివారున్నారు.

మే 1976 లో వచ్చిన ఈ తీర్పు చరిత్రాత్మకమైనది. నాటి ప్రధానన్యాయమూర్తి రే, నేటి ప్రధాన న్యాయమూర్తి బేగ్, నేడు రాజీనామా చేసిన న్యాయమూర్తి ఖన్నా, చంద్రచూడ్, భగవతిలు తీర్పు చెప్పారు. ఖన్నా ఒక్కడే మిగతా న్యాయమూర్తులతో భేదించాడు.

మిగతా న్యాయమూర్తుల దృష్టిలో రాష్ట్రపతి 27 జూన్ 1975న అత్యవసర పరిస్థితిని ప్రకటించిన తరువాత, ఏ పౌరునికీ 226వ అనుచ్ఛేదము ప్రకారము హైకోర్టు కెళ్ళే హక్కు లేదనీ, ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలకు తమ స్వాతంత్ర్యానికి, ప్రాణాలకు **(Life and Liberty)** గల హక్కు 21వ అనుచ్ఛేదం ద్వారా మాత్రమే లభ్యమవుతుందనీ, 359వ అనుచ్ఛేదం ద్వారా ఆ హక్కును రాష్ట్రపతి 'సస్పెండు' చేయటం వలన ఇంకేవిధమైన హక్కులు ప్రజలకు లేవు. అయిదుగురూ అయిదు తీర్పులను వ్రాశారు.

ఇందులో శ్రీ బేగ్, ఖన్నాల తీర్పులు తెలుసుకోదగినవి.

శ్రీ బేగ్, తన 50 పేజీల తీర్పును ఆరుభాగాలక్రింద విభజించాడు. మీసాచట్టముయొక్క ఉద్దేశ్యము అనే శీర్షిక క్రింద, హిట్లర్ నాయకత్వంక్రింద మానసిక స్థిరత్వములేని కొంతమంది వ్యక్తులు ఏవిధంగా జర్మన్ జాతిని తప్పుదారి పట్టించింది మన రాజ్యాంగ నిర్మాతలకు తెలుసుననీ, కాబట్టే మనవారు దూర దృష్టితో ప్రివెంటివ్ డిటెన్షన్‌నే కాకుండా, అత్యవసర పరిస్థితికి కూడా అవకాశం కల్పించారనీ, ఒక వెనుకబడిన దేశము, సుస్థిరంగా, క్రమశిక్షణతో, రాజ్యాంగంలో నిర్దేశించినవిధంగా ముందుకు పోవాలంటే, ఇదితప్ప గత్యంతరం లేదనీ అంటాడు.

ఎమర్జెన్సీలో 'రూల్ ఆఫ్ లా' ఎలా పనిచేస్తుంది అనే ప్రకరణం క్రింద, ఇంతవరకు ఎమర్జెన్సీ ఉన్నా హైకోర్టులు ఈ విషయాలను పరిశీలించవచ్చని సుప్రీంకోర్టు ఇదివరలో చెప్పిందనీ, కాబట్టే ఇప్పటి రాష్ట్రపతి ప్రకటనలో మార్పుచేసి మీసాచట్టంలో ఇంకా కఠినమైన మార్పులుచేసి కేవలం ప్రభుత్వపాలనాశాఖే దీని విషయం జోక్యం కల్గించుకోవాలి అనే ధోరణిని స్పష్టం చేశారనీ అన్నాడు.[4]

అలాగే ప్రస్తుత అత్యవసర స్థితిలో అధికారము దుర్వినియోగ పరచబడింది అని అనటం బాధ్యతాయుతమైన న్యాయవాది చెప్పవలసిన వాదనకాని, దేశభక్తుని ధోరణికాని, ప్రజాసేవకు సంబంధించినది కాని కాదనీ, తమ దృష్టికి ఒక్క ఉదాహరణ రాలేదనీ, నిజానికి తాను న్యాయవాదులను ప్రశ్నించినా ఆ దశలో వివరాలు తమ ముందులేవని సమాధానం చెప్పారనీ అన్నాడు.[5]

401 పేరాలతో గూడిన ఈ తీర్పులో 396 పేరాలో స్పష్టంగా ఇలా వ్రాశారు: దేశంలో అశాంతి చెలరేగినపుడు దానిని ఎదుర్కోవలసిన రాజ్యాంగ సంబంధమైన బాధ్యత ప్రతి ప్రభుత్వం మీదా ఉంటుందనీ, ఏది ఏమైనా నేటి వార్తాపత్రికల వార్తల ప్రకారమే, అనేకమంది డిటెన్యూలు విడుదల చేయబడుతున్నారని అర్థమవుతుందనీ, దీనినిబట్టి ప్రభుత్వమే నిర్ణీతకాలాల్లో పరిస్థితిని పునరాలోచిస్తుందని తెలుస్తుందన్నాడు.

ఇంతేకాక, తమకు (అంటే న్యాయమూర్తులకన్నమాట—రచయిత) తెలిసిన దానినిబట్టి ప్రభుత్వాధికారులు డిటెన్యూలకు చక్కటి వసతి, చక్కటి ఆహారమిచ్చి, అతిచక్కగా దాదాపు తల్లుల లాగా చూస్తున్నారనీ, తల్లితండ్రులైనా పిల్లలు తాముంటున్న ఇంటినే తగలబెడదామంటే, పిల్లలను దండించక తప్పదనీ అన్నాడు.

శ్రీ ఖన్నా ధోరణి ఇంకోవిధంగా నడిచింది. ప్రజల లేదా భారతపౌరుల ప్రాణాలు, స్వాతంత్ర్యం కేవలం 21వ అనుచ్ఛేదం దయాదాక్షిణ్యాలమీదే ఆధారపడి ఉన్నవా? ఆ అనుచ్ఛేదం 'సస్పెండు' అయితే వీరు ప్రభుత్వ దయాదాక్షిణ్యాలమీదనే ఆధారపడాలా అని మీమాంస మొదలుపెట్టాడు.

ఈ హక్కులు 1776 నాటి అమెరికా స్వాతంత్ర్య ప్రకటనలో ఉన్నాయనీ, రెండవ, అయిదవ సవరణలలో వచ్చాయనీ, మానవ హక్కుల ప్రకటన వీటిని పునరుద్ఘాటించిందనీ, అంతర్జాతీయ న్యాయశాస్త్రవేత్తల సంఘంకూడా దీనిని ఆమోదించిందనీ అన్నాడు. రాజ్యాంగం అనేది లేనప్పుడు ఈ దేశంలో సామాన్యపౌరునికి గల హక్కులేమిటి అని ప్రశ్నించాడు. 1931లోనే ప్రీవీ కౌన్సిల్‌లో నైగీరియా ప్రభుత్వానికి సంబంధించిన వివాదంలో లార్డ్ ఆట్కిన్ ఉద్ఘాటనను గుర్తుచేశాడు. ఆట్కిన్ ఉద్ఘాటన ఇది: ''బ్రిటిష్ న్యాయశాస్త్ర సూత్రాల ప్రకారం, ఏ అధికారి బ్రిటిష్‌పౌరుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో కాని, ఆస్తితో కాని, న్యాయస్థానముందు తన జోక్యాన్ని సమర్థించుకోలేని విధంగా, జోక్యంచేసుకోకూడదు. అలా జరిగిననాడు, ఏ న్యాయమూర్తి ఆ అధికారికి వ్యతిరేకంగా తీర్పిచ్చేందుకు జంకడు.''

ఈ ఉద్ఘాటనను రాజ్యాంగానికిముందే, బ్రిటిష్ ప్రభుత్వ హయాంలోనే మన న్యాయస్థానాలు సమర్థించాయి. విప్లవవాది జతీంద్రమోహనఘోష్ వ్యవహారంలో 1932లోనే కలకత్తా హైకోర్టు, తిరిగి 1943, 1945లో నాగపూర్ హైకోర్టులు దీనిని సమర్థించాయి. సుప్రీంకోర్టు కూడా 1956, 1959లలో దీనిని సమర్థించింది. కాబట్టి 21వ అనుచ్ఛేదమే మనకు దిక్కు అనటం భావ్యం కాదన్నాడు.

'రూల్ ఆఫ్ లా' అనేదాని భావాన్ని మనం అర్థం చేసుకోవాలనీ, ఏ దుష్కార్యమూ ఏదో ఒక చట్టం పేరుతోనే జరుగుతుందనీ, నాజీల హయాంలో జరిగిన మూక ఉమ్మడి హత్యాకాండ అంతా చట్టం పేరుతోనే జరిగిందని, నిజమైన 'రూల్ ఆఫ్ లా' అంటే అధికార్ల వినియోగం మీద ఒక పరిమితి ఉండటమే నంటాడు.[7]

ఇంగ్లండ్‌లో ప్రథమ, ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామాల కాలంలో కూడా న్యాయస్థానాలకు రిట్ అధికారాలున్నాయనీ, మన దేశంలో కూడా 1962 చైనా యుద్ధంలోనూ, 1965, 1971లోని పాక్ యుద్ధంలోనూ, న్యాయస్థానాల అధికారాల మీద పూర్తి అదుపు లేదనీ, అయితే ఎవరూ అందువలన యుద్ధ ప్రయత్నాలు కుంటుపడ్డాయని అనటం లేదన్నాడు.

తన తీర్పును ముగిస్తూ, ఏకాభిప్రాయమనేది తనకూ నచ్చినదేనని, కాని అభిప్రాయ భేదమున్నప్పుడు అది పనికి రాదనీ, భవిష్యత్ వీటి బాగోగులు నిర్ణయిస్తుందన్నాడు. (ఆ చివరి పేరాను ఈ వ్యాసంచివరలో ఈయటం జరిగింది.)

ఒకటే తథ్యం. నాటి వాదన రోజుల్లో కోర్టుముందు స్నేహలతారెడ్డి, లాజరస్ ఫెర్నాండెజ్, రాజన్‌లు లేరు. వీరి విషయాలు నాడు వాదించిన న్యాయవాదులకుకూడా తెలిసిఉండదు.

1977 జనవరి మాసాంతంలో తననుకాదని శ్రీ బేగ్‌ను సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తిగా నియమించటంతో శ్రీ ఖన్నా రాజీనామా చేశాడు.

అత్యవసర పరిస్థితిలోని ఇంకొక విశేషము హైకోర్టు న్యాయమూర్తుల బదిలీలు. మే 1976లో పదహారుగురు న్యాయమూర్తులను ఒక హైకోర్టునుంచీ ఇంకొక హైకోర్టుకు బదిలీ చేశారు. అంతకు ముందుకూడా బదిలీలనేవి ఉన్నవి, కాని అరుదుగా జరిగేయి. ఈ పదహారు లెక్కలోకి తీసుకోకుండా, అంతకు ముందు 1951 నుంచి 1976 దాకా పదిహేనుమందిని ఒక హైకోర్టు నుంచి ఇంకొక హైకోర్టుకు ప్రధాన న్యాయమూర్తులుగా బదిలీ చేస్తే, 1959 నుంచి 1976 దాకా పదిమందిని ఒక హైకోర్టునుంచి ఇంకొక హైకోర్టుకు మార్చారు. 1951 నుంచి 1976 దాకా జరిగిన మొత్తం బదిలీలు కేవలం 25 మాత్రమే.

అలా గుజరాత్‌నుంచి ఆంధ్రకు వచ్చినవారిలో శ్రీ హిమత్ లాల్ శేఠ్ ఒకరు. వారు తమ బదిలీ చెల్లదంటూ గుజరాత్ హైకోర్టులో ఒక రిట్ వేశారు.

ఆ రిట్ ధ్రువపత్రం (అఫిడవిట్) 15వ పారాలో స్పష్టంగా కొన్ని బదిలీలు రాజకీయకారణాలవల్లే జరిగాయని నొక్కి చెప్పారు. జస్టిస్ రంగరాజన్‌ను కులదీప్ నయ్యర్ తీర్పు కారణంగా ఢిల్లీ నుంచి అస్సాంకు మార్చారన్నారు. శ్రీ అద్వానీని గుజరాత్‌అసెంబ్లీ నియోజక వర్గంనుంచి రాజ్య సభకు ఎన్నిక కావటానికి వీలుగా గుజరాత్‌లోని గాంధీ నగర్‌లో హాజరు పెట్టాలనీ, ఎన్నికయిన తరువాత ప్రమాణ స్వీకారానికి వీలుగా ఢిల్లీలో హాజరు పెట్టాలనీ అద్వానీ రిట్‌లమీద తీర్పుల నిచ్చిన ఫలితంగా, కర్నాటకా హైకోర్టులోని జస్టిస్ చంద్రశేఖర్, సదానందస్వాములను మార్చారన్నారు. అలాగే బొంబేలోని విమద్‌లాల్ మీసా చట్టానికి సంబంధించిన తీర్పు ఫలితంగా మార్చ బడ్డాడన్నారు. గుజరాత్ హైకోర్టుకు చెందిన తనూ, మెహతాలు బరోడాలోని 'భూమిపుత్ర' పత్రిక తాలూకు సెన్సార్ షిప్ విషయంలో ఇచ్చిన తీర్పు ఫలితంగా బదిలీ చేయబడ్డామని చెపుతూ ఇలా అన్నారు: **"So far as the petitioner is concerned, the Central Government has advised the President to transfer him to Andhra Pradesh in order to punish him for his having written, on behalf of the Divison Bench of Gujarat High Court, Judgment in Special Civil Application No. 141 of 1976. It is therefore penal in character."**

శ్రీ శేఠ్ వేసిన రిట్‌ను గుజరాత్ హైకోర్టులోని ముగ్గురు న్యాయమూర్తులు సరియయినదేనని నవంబరు, 1976లో తీర్పు యిచ్చారు. ఈ రిట్‌లో కొంత తమాషా జరిగింది.

శ్రీ జె. బి. మెహతా, ఎ. డి. దేశాయి. డి. ఎ. దేశాయిలతో కూడిన బెంచి ఆగష్టు 30న వాదనలు వినటం ప్రారంభించారు. కేంద్ర ప్రభుత్వం తరఫున అడిషనల్ సొలిసిటర్ జనరల్ శ్రీ వి. పి. రామన్ వాదన సాగించాడు. ఈ న్యాయమూర్తులే సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తికి ఇలాంటి విషయంమీదే ఒక ఉత్తరం వ్రాసి ఉండటం జరిగింది. ఆ విషయం కేంద్ర ప్రభుత్వానికి తెలిసిందనీ, న్యాయం జరగదని కేంద్ర ప్రభుత్వం అనుమానపడుతున్నట్లు శ్రీరామన్ కోర్టులో అభ్యంతరం లేవదీశాడు. దానిమీద సెప్టెంబరు 10, తిరిగి 20వ తేదీలకు వాయిదా పడింది. సెప్టెంబరు 20న గుజరాత్ ప్రధాన న్యాయమూర్తిని ఇంకొక బెంచిని ఏర్పాటు చేయవలసినదిగా కోరటం జరిగింది. ఆంధ్రాకు ప్రధానన్యాయమూర్తిగా అంతవరకూ ఉన్న శ్రీ ఓబులరెడ్డి అప్పుడు గుజరాత్ ప్రధానన్యాయమూర్తి. ఆ ముగ్గురు న్యాయమూర్తులే సగం విన్న ఆ రిట్‌ను వినాలని ఆయన ఉత్తర్వు చేయటంతో వారే దానిని వినటం జరిగింది.

ఈ రిట్‌కు కేంద్రప్రభుత్వంతోపాటు సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ రే కూడా ఒక ప్రతివాది. అయితే ఈ ఉత్తరం సంబంధమైన అభ్యంతరం ఆయన తరఫున చెప్పబడలేదు.

* * *

క్లుప్తంగా అత్యవసర పరిస్థితిలో న్యాయస్థానాల ధోరణి ఇది. భారత పౌరుల స్వేచ్ఛాప్రాణాలను కాపాడేందుకు, రాజ్యాంగ సంబంధమైన వివాదాలలో, తమకు తోచినవిధంగా నిర్ణయంగావ్యవహరించాయి. తమకు తోచినవిధంగా రాజ్యాంగాన్ని నిర్వచించాయి. అనుశ్రుతంగా వస్తున్న గాడిని తప్పలేదు. అయితే సుప్రీంకోర్టు తీర్పు సర్వదా శిరోధార్యం కాబట్టి, 1976 మే తరువాత ఈ రంగంలో నిశ్శబ్దత ఏర్పడింది.

దురదృష్టవశాత్తు అత్యవసరపరిస్థితిలోని అన్ని తీర్పులు కూడా లభ్యంకాని పరిస్థితిఉంది. న్యాయస్థానాల తీర్పులమీద కూడా "సెన్సర్‌షిప్" విధింపబడింది. బొంబే హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ తులజా పుర్‌కార్, నాగపూరుకోర్టు నూత్న భవనాల ప్రారంభోత్సవ సందర్భమైన తమ ఉపన్యాసంలో దీనిని గురించి బాధపడ్డాడు. ఆ ప్రసంగం "ది 'బేసిక్ ఫీలార్సు' కాంట్రోవర్సీ" అనే పేరుతో 5 ఫిబ్రవరి, 1977 "ఇండియన్ ఎక్స్‌ప్రెస్"లో వ్యాసం రూపేణా ప్రచురించబడింది.

ఏది ఏమైనా భారత రాజ్యాంగం 1975లో రజతోత్సవం జరుపుకుంది. అదే సంవత్సరంలో అత్యవసర పరిస్థితి ప్రకటించబడింది. ఇప్పుడు రద్దయింది. మనం మన కాళ్లమీద నిలబడదలుచుకొని **Indian Constitutional Jurisprudence** కు నాందీవాక్యం పలికామనుకుంటే, ఈ రెండు సంవత్సరాల చరిత్ర అందులో ప్రముఖ ప్రకరణ మవుతుంది. ఏ భవిష్యత్ చరిత్ర కారుడైనా ఈనాడు బయటికి రాని తీర్పులను, ప్రభుత్వ రికార్డులను పరిశీలించి ఈ నాటి రాజ్యాంగ చరిత్రను రచించగలిగితే అది దేశ భవిష్యత్తుకు, ప్రజాస్వామ్యానికి మహోపకార మవుతుంది.

* * *

**"Before I part with the case, I may observe that the consciousness that the view expressed by me is at variance with that of the majority of my**

learned brethren has not stood in the way of my expressing the same. I am aware of the desirability of unanimity, if possible. Unanimity obtained without sacrifice of conviction commends the decision to public confidence. Unanimity which is merely formal and which is recorded at the expense of strong conflicting views is not desirable in a Court of last resert. As observed by Chief Justice Hughes, Judges are not there simply to decide cases, but to decide them as they think they should be decided, and while it may be regretable that they cannot always agree, it is better that their independence should be maintained and recognised than that unanimity should be secured through its sacrifice. A dissent in a court of last resert, to use his words, is an appeal to the brooding spirit of the law, to the intelligence of a future day, when a later decision may possibly correct the error into which the dissenting judge believes the court to have been betrayed." (Last Para in Justice Khanna's Judgment).

## అ థో జ్ఞా పి క లు

(1) "But behind all these procedural devices there must be an alert people, a real constituent power determined to see that their limitations are effectively utilised to ensure the legitimate employment to these emergency powers."

(2) As early as in 1866 in Exparte Milgen, the American Court observed that "no doctrine involving more pernicious consequence was ever invented by the writ of man than that any of its Bill of Rights provisions can be suspended during any of the great exigencies of the Government."

(3) How we have to get effective, vigerous Government action, and yet limit the power of governmental bodies so as to forestall the rise of despotic concentration of power? Logically it is a paradox, but practically it has been done. The task requires all the wisdom man can muster. The prize is his greatest achievement "freedom."

(4) "It is therefore not surprising that by means of a differently phrased Presidential Order of 27 June, 1975 and the amendments in the Act, introducing rather drastic provisions of Sec, 16-A of the Act, the intention has been made clear that preventive detention should be a matter controlled exclusively by the executive departments of the State."

(5) "I do not think that it is either responsible advocacy or the performance of any patriotic or public duty to suggest that powers of preventive detention are being misused in the current emergency when our attention could not be drawn to the allegations in a single case even by way of illustration of the alleged misuse instead of drawing upon one's own imagination to conjure up phantoms. In fact, I asked some learned counsel to indicate the alleged facts of any particular case before us to enable us to appreciate how the power of preventive detention had been misused Mostly, the answers given were that the facts of the case were not before us at this stage which is true. But, it is significant that no case of alleged "malice in fact" could be even brought to our notice."

(6) "And, if one can refer to a matter of common knowledge, appearing from newspaper reports, a number of detenus arrested last year have already been released. This shows that the whole situation is periodically reviewed. Furthermore, we understand that the care and concern bestowed by the State authorities upon the welfare of detenus who are well housed, well fed and well treated, is almost maternal. Even parents have to take appropriate preventive action against those children who may threaten to burn down the house they live in."

(7) "Absence of rule of law would nevertheless be absence of rule of law even though it is brought about by a law to repeal all laws. In the words of Wade, Government under the rule of law demands proper legal limits on the exercise of power."

# 'లహరి'

శ్రీ బొలిమేరు వెంకటప్రసాద్

ఉబికి ఉబికి మబ్బుమనసుల్లోంచి
రాగమాలిక—
పొంగి పొంగి మామిడి గుబురుల్లోంచి
లలిత గీతిక—
తూరుపు వీణపై ఉష పలికించిన
లలిత రాగానికి మురిసి,
మల్లిక ఒడిలో స్నానమాడిన
హిమబిందువు, పసిడి పచ్చిక
పాన్పుపై ఒళ్లు విరిచిందని,
ఉప్పొంగి వలపు నేర్చిన నీ మనసు—
చివురు సొగసుల రుచులు చిందిన
రాగ గీతానికి కులికి,
తన వలపులో తానే
సుడులు తిరిగిన పిల్లగాలి
గలగల పదము పాడిందని,
తనువంతా పులకించిన నీ వలపు—
—ఎఱుగవు కదూ ?—
ఆ చిక్కటి పచ్చిక లోయల్లో
వెంటాడే తలపుల్ని పోగుచేసుకొంటూ
ఆ తీపి లోతుల్లో
తలపు తలుపులు తెరచుకొని,
—ఓ కల దాగుందని—
—ఎఱుగవుకదూ ?—
నీకు తెలియకనే కనిపించి
నాకు తెలియకనే మాయమైన
నీకు—లోకాన ఎక్కడైనా ఎన్నడూ వసరతం,
నాకు—లోకాన ఎన్నడో ఆ సుప్రభాతం?
నీ తలపులతో సన్యాసిరాజునైనా,
నీ వలపులతో నటరాజును……
కావాలని ముందుజన్మ కోరిక !
అందాకా…
ఉబికి ఉబికి మబ్బు మనసుల్లోంచి
రాగమాలిక—
పొంగి పొంగి మామిడి గుబురుల్లోంచి
లలిత గీతిక—
సరళ సరాగాలు కురిసినప్పుడల్లా
గుండెనుంచి గొంతుదాకా నిషాదస్వరం
మదినుంచి పెదవిదాకా నిశ్చల గీతం
పదమునుంచి పాటదాకా నిశ్శబ్ద తరంగం !



శ్రీ జంధ్యాల బాలగంగాధర తిలక్

# అక్షరాస్యత - అభివృద్ధి

ఏ దేశమయినను సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక రంగములలో త్వరితగతిని అభివృద్ధి చెందవలెనన్న ఆ దేశములో విద్యాభివృద్ధి అధికముగా ఉండవలెను. ప్రజలెల్లరు అక్షరాస్యులయి ఉండుట ఆవశ్యకము. దేశ సర్వతోముఖాభివృద్ధికి విద్య ఎంతేని సహకరించును.

విద్య మనుజునిలో నేర్పు, నైపుణ్యాదులను పెంచి అతని ఉత్పాదక శక్తిని పెంచును. వ్యావసాయిక, పారిశ్రామిక రంగములలో ఉత్పాదనము పెంచవలెనన్న అధునాతన పద్ధతులను ఉపయోగించుట ఎంతయో అవసరము. విద్యాహీనులు సహజముగా మూఢ నమ్మకములకు బానిసలయి నూత్నపద్ధతులను అవలంబించుటకు విముఖులుగా నుందురు. కావున అధునాతన పద్ధతులను అవలంబింప చేయుటకు వారిలో విద్యాభివృద్ధి గావించుట అవసరము. అంతేకాక నానాటికి త్వరితగతిని మార్పుచెందుతున్న ప్రపంచములోని విభిన్న మార్పులను అవగాహన చేసికొని అధునాతన ప్రపంచములో చక్కని జీవితము గడుపుటకు వీలుగా విద్య అతనిని మలచగలదు. కేవలము ఆర్థిక రంగములోనే కాక అతని సామాజిక దృక్పథములను కూడా మార్చి పూర్ణ మనుష్యునిగా తయారుచేయును. విద్యలేనివాడు వింత పశువన్న లోకోక్తి ఉన్నది కదా!

నేడు జపాను, అమెరికా, రష్యా, కెనడా, ఆస్ట్రేలియా మున్నగు దేశములయొక్క సర్వతోముఖాభివృద్ధికి ఆయాదేశములలోని విద్యాస్థాయి, అక్షరాస్యత ప్రధాన కారణముగా పేర్కొనవచ్చును.

ఈ విధముగా దేశ సామాజిక ఆర్థిక పురోగతికి విద్య అక్షరాస్యత ఎంతో సహకరించును.

ఇదేవిధముగా విద్యాభివృద్ధికి దేశ ఆర్థికాభివృద్ధి చేయూతనిచ్చును. ఆర్థిక రంగములో బాగుగా అభివృద్ధిచెందిన దేశములు విద్యాభివృద్ధికై అధిక వనరులను వెచ్చించగలవు. ఆర్థికాభివృద్ధి సాధించిన అమెరికా సంయుక్త రాష్ట్రములు, రష్యా, కెనడా, జపాను దేశములలో విద్యాభివృద్ధికై జాతీయ ఆదాయములో 7 నుండి 10—11 శాతము వ్యయము చేయుచుండగా, అభివృద్ధి చెందుతున్న దేశములలో కేవలము 3 నుండి 5 శాతము మాత్రమే కేటాయించ గలుగుచున్నారు. మన దేశములో 1950—51లో కేవలము 1.21 శాతము విద్యకై ఖర్చుచేసిరి. 1969—70 నాటికి 3.2 శాతము కాగలిగినది.

ఈ విధముగా విద్యాభివృద్ధి ఆర్థికాభివృద్ధి ఒకదానితో ఒకటి పెనవేసికొని యున్నవి.

మన దేశములోని విద్యాభివృద్ధిగురించికాక కేవలము అక్షరాస్యత అభివృద్ధిగురించి చర్చించుట ఈవ్యాసముయొక్క ప్రధానోద్దేశ్యము.

దేశ సామాజిక ఆర్థిక రాజకీయ సాంస్కృతిక పురోభివృద్ధికి ఆ దేశ ప్రజలందరు అక్షరాస్యులయి ఉండుట ఆవశ్యకమనియు, నిరక్షరాస్యత అభివృద్ధి నిరోధకమనియు ముందు చెప్పియున్నాము. ఆర్థిక పురోగతి సాధించిన ఆస్ట్రియా, కెనడా, జర్మనీ, జపాన్, న్యూజిలాండ్, ఇంగ్లండు, అమెరికాసంయుక్త రాష్ట్రములలో వయోజనులలో 97నుండి 99 శాతము ప్రజలు అక్షరాస్యులు. ఆఫ్రికా దేశములలో 7నుండి 40—50 శాతము, ఆసియా దేశములలో 10నుండి 80 శాతము అక్షరాస్యులు. భారత ఉపఖండములో బంగ్లాదేశ్‌లో 23 శాతము, పాకిస్తాన్‌లో 39 శాతము, మన దేశములో 29 శాతము అక్షరాస్యులు. ఈ విధముగా ఆర్థికముగా వెనుకబడిన ఆసియా, ఆఫ్రికా దేశములలో అక్షరాస్యత బహు తక్కువ. 90 శాతమునకు మించిన అక్షరాస్యత కలిగిన దేశములు ఆర్థికముగా ముందడుగు వేసినవి. ఆ దేశములలో తలసరి ఆదాయము 500 డాలర్లు మించి యున్నది. 30 శాతములోపు అక్షరాస్యత కలిగిన దేశములలో తలసరి ఆదాయము 200 డాలర్లు మించి యుండలేదు. కావున ఏ దేశమయినను ఆర్థికాభివృద్ధి త్వరితగతిన సాధించవలెనన్న కనీసము 40 శాతము ప్రజలు అక్షరాస్యులయి ఉండి తీరవలెనని ఆండర్సన్, బౌమన్ మహాశయులు అభిభాషించిరి.[1]

భారతదేశములో 1971 లెక్కల (1971 Census) ప్రకారము 54.79 కోట్ల ప్రజలు ఉన్నారు. వీరిలో 28.39 కోట్లు పురుషులు; మిగిలిన 26.40 కోట్లు స్త్రీలు. పురుషులలో 11.20 కోట్లమంది, స్త్రీలలో 4.94 కోట్లమంది—మొత్తము 16.14 కోట్లమంది మాత్రము అక్షరాస్యులు. అనగా 29.5 శాతము మంది అక్షరాస్యులు.

## భారతదేశము

**వయసు : అక్షరాస్యత**

| వయస్సు (సం. లు) | అక్షరాస్యత శాతము |
|---|---|
| 0—4 | — |
| 5—9 | 22.77 |
| 10—14 | 49.74 |
| 15—19 | 50.76 |
| 20—24 | 43.83 |
| 25—34 | 33.94 |
| 35+ | 24.53 |
| వయసు తెలియజేయనివారు | 15.19 |

5—9 సం.ల మధ్య వయస్సుగలవారిలోను, 35 సం.లకు మించినవారిలోను నిరక్షరాస్యత ప్రబలముగా ఉన్నదని పై పట్టిక ద్వారా తెలియుచున్నది. 10—19 సం. ల వయసు గలవారిలో దాదాపు 50 శాతము అక్షరాస్యులు, 25—34 సం.ల వయస్సు గలవారిలో దాదాపు 66 శాతము నిరక్షరాస్యులయి ఉండుట శోచనీయము. ఈ వయసువారే కార్మికులలో అధిక శాతమయి ఉందురు కదా ! 5—9 సం.ల వయసు గలవారిలో గల నిరక్షరాస్య ప్రబలత ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యా పథకముయొక్క అపజయమునకు తార్కాణము.

ఇక విభిన్న రాష్ట్రములను తులనాత్మక దృక్పథముతో పరిశీలించి చూడగా కేరళ, తమిళనాడు, మహారాష్ట్ర, గుజరాతు, రాష్ట్రములలో అక్షరాస్యత కలిగినవారు అధికముగా ఉన్నారని తెలియుచున్నది. కేరళలో 60.4 శాతము మంది అక్షరాస్యులు. తమిళనాడులో 39.5 శాతము, మహారాష్ట్రలో 39.2 శాతము, గుజరాతులో 35.8 శాతము అక్షరాస్యులు. ఇవి కాక పంజాబు, పశ్చిమ బెంగాలు, మణిపూరు, త్రిపుర, హిమాచలప్రదేశ్, కర్నాటక రాష్ట్రములలో అక్షరాస్యత జాతీయస్థాయికంటె అధికముగా ఉన్నది. బీహారు, రాజస్థాను, జమ్ము—కాశ్మీరు రాష్ట్రములలో నిరక్షరాస్యు లధికముగా ఉన్నారు. జమ్ము—కాశ్మీర్ రాష్ట్రములో కేవలము 18.6 శాతము అక్షరాస్యులు. బీహారులో 81.1 శాతము, రాజస్థాన్‌లో 81.9 శాతము నిరక్షరాస్యులు.

అక్షరాస్యత ఆధారముగా మనము మన దేశములోని రాష్ట్రములను 5 భాగములుగా విభజింపవచ్చును. 35 శాతమునకు మించిన అక్షరాస్యత కలిగిన ప్రాంతములను అత్యధిక అక్షరాస్యత కలిగిన ప్రాంతములుగా పరిగణింప వచ్చును. కేరళ, తమిళనాడు, మహారాష్ట్ర, గుజరాతు రాష్ట్రములు ఈ విభాగమునకు చెందును. 30 నుండి 35 శాతము లోపు అక్షరాస్యత కలిగిన ప్రాంతములను అధిక అక్షరాస్యత కలిగిన ప్రాంతములుగను, 25 నుండి 30 శాతములోపు అక్షరాస్యత కలిగిన రాష్ట్రములను సగటు అక్షరాస్యత కలిగిన రాష్ట్రములుగను వ్యవహరింపవచ్చును. అక్షరాస్యత శాతము 20 నుండి 25 లోపు కలిగిన ప్రాంతములను అక్షరాస్యతలో వెనుక బడిన ప్రాంతములుగా పిలువవచ్చును. 20శాతముకంటె తక్కువ అక్షరాస్యత ఉన్న ప్రాంతములను అధిక నిరక్షరాస్యత కలిగిన రాష్ట్రములుగా పరిగణింప వచ్చును. పై విభాగములను వరుసగా మొదటి గ్రూపు, రెండవ గ్రూపు, మూడవగ్రూపు, నాలుగవ గ్రూపు, అయిదవ గ్రూపు అని వ్యవహరింతము. పై విధముగా విభజన చేసి వివిధ రాష్ట్రముల అక్షరాస్యత వివరములు క్రింది పట్టికలో పొందు పరచితిమి.

## వివిధరాష్ట్రములలో అక్షరాస్యతస్థాయి

| అక్షరాస్యత స్థాయి | రాష్ట్రము పేరు | అక్షరాస్యత శాతము |
|---|---|---|
| మొదటి గ్రూపు | కేరళ | 60.4 |
| | తమిళనాడు | 39.5 |
| | మహారాష్ట్ర | 39.2 |
| | గుజరాతు | 35.8 |
| రెండవ గ్రూపు | పంజాబు | 33.7 |
| | పశ్చిమ బెంగాలు | 33.2 |
| | హిమాచల ప్రదేశ్ | 32.0 |
| | మైసూరు (కర్నాటక) | 31.5 |
| | త్రిపుర | 31.0 |
| మూడవ గ్రూపు | అస్సాము | 28.7 |
| | హర్యానా | 26.9 |
| | ఒరిస్సా | 26.2 |
| నాల్గవ గ్రూపు | ఆంధ్ర ప్రదేశ్ | 24.6 |
| | మధ్య ప్రదేశ్ | 22.1 |
| | ఉత్తర ప్రదేశ్ | 21.7 |
| అయిదవ గ్రూపు | బీహారు | 19.9 |
| | రాజస్థాన్ | 19.1 |
| | జమ్ము—కాశ్మీర్ | 18.6 |

పై పట్టికలోని మూడు, నాలుగు, అయిదు గ్రూపులకు చెందిన రాష్ట్రములలో అక్షరాస్యత జాతీయ స్థాయికంటె తక్కువగా ఉన్నది. పై పట్టిక ఆధారముగా మనదేశములోని వివిధ రాష్ట్రములలో అక్షరాస్యతయందు అసమానత ప్రబలముగా ఉన్నదని తెలియుచున్నది.

అక్షరాస్యతయందుఅసమానతలకు కారణములు పరిశీలింతము:

అక్షరాస్యత అధికముగా కలిగిన కేరళ, తమిళనాడు, గుజరాతు, మహారాష్ట్ర ప్రాంతములు ఆంగ్లేయుల పాలనా కేంద్రములుగా పలుసంవత్సరములు అందరి దృష్టి నాకర్షించుకొన్నవి. ఆంగ్లేయుల పరిపాలనా కారణముగా ఆ ప్రాంతములు విద్య అక్షరాస్యతయందు ముందడుగు వేసినవి. కేరళ ఆంగ్లేయులు భారతదేశమునకు రాకపూర్వముకూడా క్రైస్తవ మత ప్రచార కేంద్రము. ఆ కారణముగా కూడా అట అక్షరాస్యత చాలా ఉన్నత స్థాయిలో ఉన్నది. పంజాబు, పశ్చిమ బెంగాలులోని అక్షరాస్యత స్థాయికి కూడా ఇవే కారణములు. పంజాబు అలగ్జాండరు కాలమునుండి విదేశీ ఆక్రమణలకు గురి యయినది. ఈ విధముగా విదేశీయుల ప్రాబల్యము వలన మన దేశములో కొన్ని ప్రాంతములు అక్షరాస్యతలో ముందడుగు వేసినవి.

నిరక్షరాస్యత అధికముగా కలిగిన రాష్ట్రములు ఆర్థికముగా కూడ వెనుకబడి యున్నవి. ఉదాహరణకు ఒరిస్సా, ఉత్తర ప్రదేశ్, బీహారు, జమ్మూ మరియు కాశ్మీర్ రాష్ట్రములలో తలసరి ఆదాయము బహు తక్కువ. ఈ రాష్ట్రములలో 1970—71 సం.లో తలసరి ఆదాయము రు. 400ల నుండి రు. 520 ల లోపున ఉన్నది. తమిళనాడు, మహారాష్ట్ర, గుజరాతు, పంజాబు, హిమాచల్ ప్రదేశ్ మున్నగు రాష్ట్రములలో తలసరి ఆదాయము రు. 575ల నుండి రు. 1000లు లోపున ఉన్నది. కావున ఆర్థిక అసమానతలు అక్షరాస్యతలో అసమానతలకు ఒక, ముఖ్య కారణముగా పేర్కొనవచ్చును.

గ్రామీణ వాతావరణము నిరక్షరాస్యతకు మరొక ముఖ్యకారణముగా పేర్కొన వచ్చును. గ్రామ ప్రజల— పట్టణ ప్రజల నిష్పత్తి గ్రామీణ వాతావరణమునకు కొలబద్దగా పరిగణింపవచ్చును. నిరక్షరాస్యత అధికముగా కలిగిన రాష్ట్రములలో ఈ నిష్పత్తి అధికముగా ఉన్నది. ఉదాహరణకు రాజస్థాన్, మధ్య ప్రదేశ్, అస్సాము మున్నగు ప్రాంతములలో ఈ నిష్పత్తి విలువ 20 నుండి 93 వరకు ఉన్నది. అక్షరాస్యత అధికముగా కలిగిన తమిళనాడు, మహారాష్ట్ర, కేరళ, గుజరాతు, పంజాబు, పశ్చిమ బెంగాలు మున్నగు రాష్ట్రములలో ఈ విలువ 5కు మించలేదు. అనగా గ్రామ ప్రాంతములలో నిరక్షరాస్యత అధికముగా ఉన్నదని తెలుచున్నది. మనదేశములో పట్టణ వాసులలో 61.1 శాతము, స్త్రీలలో 41.5 శాతము అక్షరాస్యులు కాగా గ్రామవాసులయిన పురుషులలో 33.1 శాతము, స్త్రీలలో 12.9 శాతము మాత్రమే అక్షరాస్యులు. అనగా గ్రామ ప్రాంతములలో నిరక్షరాస్యతా నిర్మూలనకు తగినన్ని సౌకర్యములు లేవని తెలుచున్నది.

ఇదే విధముగా పారిశ్రామిక కార్మిక—వ్యావసాయిక కార్మిక నిష్పత్తి శాతము ఆ ప్రాంత పారిశ్రామికాభివృద్ధికి సంకేతముగా పరిగణింప వచ్చును. కేరళ, గుజరాతు, మహారాష్ట్ర, పంజాబు, తమిళనాడు, పశ్చిమ బెంగాలు మున్నగు మొదటి రెండు గ్రూపులకు చెందిన రాష్ట్రములలో ఈ పారిశ్రామిక అభివృద్ధి సంకేత సూచిక 50 శాతము నుండి 80 శాతము వరకు ఉండగా నిరక్షరాస్యత అధికముగా ఉన్న బీహారు, రాజస్థాన్, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్ మున్నగు ప్రాంతములలో ఈ నిష్పత్తి శాతము 30 కు మించిలేదు. కావున పారిశ్రామికాభివృద్ధి అక్షరాస్యత అభివృద్ధికి దోహదకారిగా ఉన్నదని నిర్ధారింప గలుగుచున్నాము.

సాంఘికముగా వెనుకబడిన వర్గములయిన షెడ్యూల్డు కులములు, షెడ్యూల్డు జాతుల ప్రజలలో నిరక్షరాస్యత ఎక్కువగా ఉన్నట్లు కన్పడు చున్నది. జాతీయ స్థాయిలో అక్షరాస్యత శాతము 29.5 అయినప్పటికి ఈ వెనుకబడిన వర్గము వారియందు కేవలము 14.67 శాతము మాత్రమే అక్షరాస్యులు. వెనుకబడిన వర్గమువారిచే కేంద్రీకృతమయిన ప్రాంతములలో నిరక్షరాస్యత అధికము. అస్సాము ప్రజలలో 93.08 శాతము వెనుకబడిన వర్గమునకు చెందినవారు. రాజస్థాన్‌లో 27.95 శాతము, మధ్య ప్రదేశ్‌లో 33.23 శాతము, ఒరిస్సాలో 38.2 శాతము వెనుకబడినవారు. ఈ ప్రాంతము లన్నిటిలోను నిరక్షరాస్యత ప్రబలముగా ఉన్నది. అక్షరాస్యత అధికముగా కలిగి కేరళలో 9.56 శాతము, మహారాష్ట్రలో 11.86 శాతము, తమిళనాడులో 18.57 శాతము మాత్రము నిమ్నవర్గీయులు. దీనిని బట్టి సాంఘికముగా వెనుకబడిన ప్రజలలో అక్షరాస్యతను అభివృద్ధి పరుచవలసిన అవసరము ఎంతేని కలదని తెలిసికొనవచ్చును.

పైన పేర్కొన్న కారణము లాధారముగా గ్రామప్రజలలోను, వ్యవసాయ కార్మికులలోను, సాంఘికముగా వెనుకబడిన ప్రజలలోను, ఆర్థికముగా వెనుకబడిన ప్రాంతములలోను నిరక్షరాస్యతను తొలగించుటకు కృషిచేయవలసిన ఆవశ్యకత ఎంతేని ఉన్నదని చెప్పవచ్చును.

అయిదవ పంచవర్ష ప్రణాళికలో సూచించినట్లు ప్రతి జిల్లాలోను స్థాపింపబడనున్న నెహ్రూ యువక సమాజములు నిరక్షరాస్యత నిర్మూలన కార్యక్రమమునకు ఎంతయో సహకరించగలవు.

ఈ సందర్భమున అక్షరాస్యత వ్యాప్తి కార్యక్రమములు దేశములో పలుచోట్ల ప్రారంభించబడుట ముదావహము. ప్రఖ్యాత భారతీయ ఆర్థిక శాస్త్రవేత్త శ్రీ దాంత్వాలా పేర్కొన్నట్లు ఈ కార్యక్రమములు స్థానిక ప్రజల సహకార ప్రోద్బలములతో ప్రారంభింపబడుచున్నవి. కావున ఇవి విజయవంతమగుటకు చాలా

అవకాశములున్నవి. ఇవి స్థానిక సంస్థలుగా పనిచేయును. కావున కార్మికులకు అనువయిన సమయములలో తగిన రీతిగా అక్షర జ్ఞానము కలిగించుటకు వీలగును. ఇటువంటి కార్యక్రమములకగు ఖర్చు సాధారణముగా పాఠశాల విద్యాకార్యక్రమములకు అగు ఖర్చు కంటె చాలా తక్కువగును.[2] మహారాష్ట్రలో 'గ్రామశిక్షణ శిబిరము' పేరుతో ఏర్పడిన సంస్థ కొన్ని జిల్లాలలో నిరక్షరాస్యతను నూటికి నూరుశాతము నిర్మూలించి అంతర్జాతీయ విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక సంస్థవారినుండి బహుమతి నందెను. ఇటువంటి సంస్థలు దేశములో విరివిగా ఏర్పడి అధికముగా కృషిచేసిన దేశములో అక్షరాస్యత స్థాయిని శీఘ్రగతిని అభివృద్ధి పరచగలము.

ఈ విధముగా కేవలము వయోజన విద్యాకార్యక్రమముతే కాక ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యాకార్యక్రమములు ముమ్మరముగాను, చక్కగాను సాగునట్లు కృషి చేయవలసిన అవసరమున్నది. మనదేశములో 1968—69లో 6—11 సం.ల వయస్సు గలిగిన పిల్లలలో కేవలము 78.1 శాతము, 11—14 సం.ల వయస్సు గలిగిన పిల్లలలో 33.5 శాతము, మొత్తముమీద 6—14 సం.ల వయస్సు గలిగిన వారిలో 63 శాతము పాఠశాలలకు పోవుచున్నారు. అనగా మిగిలిన 37 శాతము పిల్లలు ఏ పాఠశాలలకు వెళ్ళక నిరక్షరాస్యులుగా మిగిలిపోవుదురు. అంతేకాక 3—4 సం. లు పాఠశాలలకు పోయి, ఆ పిదప మానుట కారణముగా వారు కూడా నిరక్షరాస్యులయిపోవు ప్రమాదమున్నది. పరిస్థితులిట్లుండగా 11—14 సం.లు వయస్సు గలవారిలో కనీసము 76 శాతము ప్రజలను 1979నాటికి అక్షరాస్యులుగా మార్చవలెనని ప్రభుత్వ సంకల్పముగా కనిపించుచున్నది.

ఈ సంకల్పము నెరవేరవలెనన్న ప్రాథమిక విద్యాప్రణాళికలో కొన్ని మార్పులవసరము. ఉదాహరణకు ప్రాథమిక విద్యాలయములలో పఠనాకాలము, పరీక్షల కాలము గ్రామ ప్రాంతములలోని వ్యవసాయ పంటల కాలము దాదాపు ఒకటిగా నున్నది. గ్రామ ప్రాంతములలో పిల్లలు కూడా పొలములకుపోయి పనిచేయుట అందరకు తెలిసిన విషయమే! కావున ముఖ్యముగా గ్రామ ప్రాంతములలో పఠనా కాలము, పరీక్షల కాలములలో మార్పు చేయవలెనని పలువురు[3] సూచించియుండుట గమనార్హము.

ప్రఖ్యాత భారతీయ విద్యావేత్త శ్రీ జె. పి. నాయక్ ప్రాథమిక విద్యా ప్రణాళికలో కొన్ని ముఖ్యమార్పులు సూచించినారు. వయో పరిమితి లేకుండా ఎవరయినను, ఏ తరగతిలోనయినను చేరుటకు అనువుగా ప్రణాళికను సరిదిద్దవలెననుట ఆయన ముఖ్య సూచనలలో ఒకటి. అంతేకాక పాఠశాల భవనములు, వేతనము గ్రహించు ఉపాధ్యాయులేకాక స్థానిక తదితర భవనములలోను స్థానిక ప్రజల సహకారముతోను నిరక్షరాస్యత నిర్మూలనకు కృషి చేయవలెనని కూడా సూచించినారు.[4]

పైన పేర్కొన్న ఉచిత ప్రాథమిక విద్యా ప్రణాళికలో కొన్ని మార్పులు నిరక్షరాస్యతా నిర్మూలనకు ఎంతగానో తోడ్పడును.

ఈ విధముగా ప్రాథమికవిద్య, వయోజనవిద్య నిరక్షరాస్యతా నిర్మూలనా ఆయుధములుగా చక్కగా ఉపయోగించుటకు వీలున్నది.

## నోట్సు (Notes):

[ఈ వ్యాసమునందలి భారతదేశ జనాభా, అక్షరాస్యత, కార్మికులు, వెనుకబడిన వర్గము వారలకు సంబంధించిన వివరములు Census of India 1971, Statistical Abstract of India 1972, Pocket Book of Population Statistics (Census Centenary 1972) నుండి, రాష్ట్ర తలసరి ఆదాయమునకు సంబంధించిన వివరములు Delhi Statistical Hand Book 1975 నుండి, అంతర్జాతీయ వివరములు ప్రపంచ బ్యాంకువారి The Assanlt on world poverty నుండి, భారతదేశములో విద్యకు సంబంధించిన వివరములు Education in India, Education in the Fifth Five Year Plan 1974-79 నుండి గ్రహింపబడినవి. ]

1. M. J. Bowman & C. A. Anderson "Concerning the Role of Education in Development" in M. J. Bowman et al (eds) Readings in Economics of Education (Unesco : Paris, 1963) P. 113-131.
2. M. L. Dantwala : "Social Dimensions of Poverty". Vishkeshan II,2,(1976-June)P.73-111
3. Agricultural Economics Research Centre : Primary Education in India (Delhi University : Delhi, 1972) Mimeo.
4. J. P. Naik : Elementary Education in India : A promise to keep. (Allied Publishers : Bombay, 1975.)

శ్రీ కె. రామమోహనరావు

# "విష్ణుకుండినుల రాజధాని"

దాదాపు రెండు శతాబ్దుల కాలము ఆంధ్రదేశమును పరిపాలించిన విష్ణుకుండిన వంశపు రాజులచరిత్ర చాలా ప్రాముఖ్యము చెందినది. విష్ణుకుండిన యుగము ఆంధ్రదేశ చరిత్రలో మహోజ్జ్వలమైన అధ్యాయమని చెప్పవచ్చును. వీరి వంశోత్పత్తిని గూర్చి మనకు తెలియవచ్చు విషయ మత్యల్పము. ఈపూరు, రామతీర్థము, చిక్కుళ్ళ, తుండి, తుమ్మలగూడెము, ఖానాపూర్, పులంబూరులలో లభించిన తామ్రశాసనములును, గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా వేల్పూరు గ్రామమున దొరికిన శిలా శాసనమును విష్ణుకుండినుల చరిత్రకు ముఖ్యమయిన ఆధారములు.

శాతవాహనుల తరువాత తెలంగాణా ప్రాంతమును తమ అధీనములోనికి తెచ్చుకొనిన రాజవంశమేదియో నిశ్చయముగా చెప్ప గలుగుట కష్టము. ప్రాచీనాంధ్ర రాజవంశీయులయిన ఇక్ష్వాకు, శాలంకాయన, బృహత్పలాయన, ఆనంద గోత్రీకులు వేయించిన శాసనములలో ఈ విషయము ప్రస్తావింపబడలేదు.

కాని, శాతవాహనుల పతనానంతరము విష్ణుకుండినులు తెలంగాణా ప్రాంతమున స్థానిక పరిపాలకులుగా నవతరించి, రెండవ మాధవవర్మ కాలమున సుస్థిరమైన సామ్రాజ్యమున కధిపతులయి రని చెప్పుటకు తగిన చారిత్రికాధారములు యిటీవలి కాలమున లభించినవి.

రెండవ మాధవవర్మ తండ్రి అయిన మొదటి గోవింద వర్మయే విష్ణుకుండినుల మూల పురుషుడని భావింపబడుచున్నది. కాని తుమ్మలగూడెపు మొదటి గుది తామ్రశాసనములలో మొదటి గోవిందవర్మ తండ్రికి, పితామహునికి 'మహారాజ' బిరుద ముండి నట్లు పేర్కొనబడినది. నిజమునకు వారికి రాజ్యముగాని, రాజ్యాధి కారముగాని లేకుండగనే 'మహారాజ' బిరుదము వాడబడినది. మహారాజ ఇంద్రవర్మ, మొదటి మాధవవర్మ, మొదటి గోవిందవర్మల పరిపాలన తెలంగాణా ప్రాంతమునకే పరిమితమై యుండెనను నిశ్చయము.

తుమ్మలగూడెపు రెండవ గుది తామ్రపట్టికలో అయిదు తరముల రాజులు పేర్కొనబడినారు. మహారాజశ్రీ గోవిందవర్మ నుండి శ్రీ మాన్విక్రమేన్ద్ర భట్టారకవర్మ వఱకుగల వీరయిదు గురూ తెలంగాణా ప్రాంతమును పరిపాలించిరని భావింపవచ్చును.

తుమ్మలగూడెపు తామ్రపట్టికలో రెండవ గుదియందలి వంశానుక్రమణిక వివరణ మీక్రింది విధముగా మన్నది:




మొదటి గోవిందవర్మ శౌర్యపరాక్రమములచేత తనసామ్రాజ్య మును విస్తరింపజేసెను. అనేక గ్రామములను, సువర్ణమును, అశ్వములను, గజములను, రాజప్రాసాదములను, ఆభరణములను, కన్యలను, భృత్యులను దానమిచ్చెను. అనేక తటాకములను దాన మిచ్చెను. అనేక తటాకములను, ఉద్యానవనములను నిర్మింప జేసెను. తుమ్మలగూడెపు మొదటి తామ్రపట్టికలో పేర్కొనబడిన దానినిబట్టి మొదటి గోవిందవర్మ తన ప్రవర్ధమాన విజయరాజ్య సప్తత్రింశ (37వ) సంవత్సరమున వైశాఖ పౌర్ణమినాడు చాతుర్ద శార్య బౌద్ధభిక్షు సంఘము కొఱకు తన యగ్రమహిషి పరమ మహా దేవియొక్క విహారమునకు దీప ధూప గన్ధ పుష్ప ధ్వజ పాన భోజన శయనాసన గ్లాన భైషజ్య ఖణ్డస్ఫుటిత శీర్ణ సంస్కారాదులకు 'పెణ్కపఱ' అను పేరుగల గ్రామమును దానము జేసెను. ఈ దానము ఇంద్రపురమున జేయబడినది.

## పంక్తులు[1]

12. కులీనజన సమాశ్రయేణ సకల సత్వధాతు త్రాణా
యోత్పాదిత మహాబోధి చిత్తేన మహారాజశ్రీ

13. గోవిన్దవర్మ్మణా ఆత్మనః ప్రవర్ద్ధమాన విజయరాజ్య
సంవత్సరే సప్తత్రింశత్కే వైశాఖ పూర్ణ్ణ
మాస్యాం భగ

14. వతా దశబల బలినః చతుర్వైశారద స్యాష్టాదశావేణిక
బుద్ధ ధర్మ్మ సమలం కృ

15. తమూర్త్తేర్ద్వాత్రింశన్మహా పురుషలక్షణ వరోపలక్షితస్య
జాతి జరామరణ శోకాదిషు బహు

16. సంసార దుఃఖ నిమగ్నసర్వ్వ సత్వాన్తారణా యానేకకల్పా సంఖ్యే యోపచిత పుణ్య జ్ఞానసంభారభార

17. స్యాపగతరాగ ద్వేషమోహా [జన] న మరణదుఃఖస్యా ప్రతి హం [త] [నా] వరణ సకల జ్ఞేయజ్ఞానా

18. త్సమ్యక్సం (బు) ద్ధస్య మా[గ్గ్ర] మభిప్రపన్నస్సర్వ్వ ద్విరాగ శీలశిక్షా [ధృ] త గుణాధ్యయన శ్రవణ [చి]

19. న్త న భావనాధ్యాన సమాధి సమాప (త్త్యా)ది భిగుణగణై రనుత్తర పుణ్యక్షేత్ర త్రియానయాయినం చాతుర్ద్ద

20. శమార్య్య సఙ్ఘముద్దిశ్యత్యాగ పరిభోగాన్వయ[మా] పథి క ఇ్ఛ పుణ్య క్రియావస్య్వభినివర్త్త

21. యిష్యేణమాతా పిత్రోః సర్వ్వ సత్వానాఞ్చ నిఖిలదారి ద్ర్యే దుఃఖోపశమన హేతోః స్వస్యాల్గ్ర

22. మహిష్యా పరమమహాదేవ్యా విహారస్య దీప ధూప గన్ధ పుష్ప ధ్వజ పాన భోజన శయనాసన [గ్లా] న

23. భైషజ్య ఖణ్డ స్ఫుటిత శీర్ణ సంస్కారాది [క] శిల మాలానుప [చ్ఛే] దార్థ్ధ్యాంద్వా [వెమ్ము ద]ల పెణ్క పఞ

24. నామధేయో గ్రామో ఉదక ధాన పూర్వ్వకం మతిసృష్టో సనిధి సదణ్డకర ద్విష్టి [సో—భాగ]

25. భోగప్రదేయ చారభట దూత వల్లభరాజపురుషైరప్రవే శ్యో విముక్త సకల పరిహారో విష్ణుకుణ్డి

26. కుల వంశ్యై రాజభిసంరక్షణీయో సంవర్ద్ధనీ యో స్థితి రేషా స్థాతస్థిత్య [వి్క] పఞ్చ

27. మహాపాతక యోగః ప్రవృత్త పుణ్యక్రియావిచ్ఛేదేహానన్త దుఃఖ భూయిష్టే నర [కభీత్యా]

28. క్షేత్రగతి స్వనిష్ట కర్మ్మఫలోష భోగ మనుభవన్తి॥

ఈ యింద్రపురము నల్గొండ జిల్లాలోని తుమ్మలగూడెం కొండ దిగువ నున్న గ్రామమేనని ఊహింపవచ్చును. కాకతీయ త్రికూట దేవాలయము, రాష్ట్రకూట దేవాలయ శిథిలములుగల ఈ గ్రామ మిప్పటికిని ఇంద్రపాల పురమని వ్యవహరింపబడు చున్నది. ఈ గ్రామ పరిసర ప్రాంతపు పొలములలో అత్యంత సుందరముగా చెక్కబడిన జైన విగ్రహము లభించినది. విష్ణు కుండినుల కాలమునకు చెందిన యిటుక కట్టడముల అవశేషములు కూడ కొన్ని దొరికినవి. బహుశ పరమభట్టారికాదేవిచే నిర్మిత మయిన మహావిహార మిదియే అయి ఉండవచ్చును.

మొదటి గోవిందవర్మ తరువాత అతని కుమారుడు రెండవ మాధవ వర్మ రాజ్యమునకు వచ్చెను. అతడు పదకొండు అశ్వమేధ ములను, సువర్ణ, పౌండరిక, వాజపేయ, సర్వమేధ, రాజసూయ, పురుషమేధ, లనేగాక యితరములయిన వేయి క్రతువులను చేసెను.

## [2] రెండవ విక్రమేన్ద్ర భట్టారక వర్మ్మ తుమ్మలగూడెం తామ్ర శాసనం మొదటి రేకు రెండవ ప్రక్క

6. రాజ శ్రీ గోవిన్దవర్మ్మణః పుత్రస్యై కాదశాశ్వమేధబహు సువర్ణ్ణ పౌణ్డరీక వాజపేయ

7. క్రతు సహస్ర సర్వ్వమేధరాజసూయ పురుషమేధాద్యా [హరణాత్స] మ్యగ నుష్ఠిత శ్రుతి వి

## రెండవ రేకు మొదటి ప్రక్క

8. హితాశేష దుష్కర కామ్య కర్మ్మానుష్ఠానస్య ప్రాగ్దక్షిణా పరమ్భోనిధిరేవా సరిత్సలిల వల

9. య విభూషణాయా భువోభర్తుర్మ్మ మహారాజశ్రీ మాధవ వర్మ్మణః ప్రియపుత్రస్య...

ఇతడు "ప్రాక్దక్షిణా పరామ్భో నిధిరేవా సరిత్సలిల వలయ మహీమండలమునకు ప్రభువు" వాకాటకుల నోడించి వారి రాజ కుమార్తెను వివాహమాడెను. వీరిరువురి సంతానమే మహారాజ మొదటి విక్రమేంద్రవర్మ.

మాధవవర్మ తన రాజ్యమును ఉత్తరమున వింధ్యపర్వతముల ఆవలివఱకు విస్తరింపజేసెను. తపత్‌నదీ తీరమున "ప్రకాష్" త్రవ్వకములలో[3] బయల్పడిన విష్ణుకుండినుల నాణెములు ఈ విషయమును ధృవపరచుచున్నది. ఈ మాధవవర్మయే వేంగి పాలకుడైన రెండవ నందివర్మనో లేక స్కందవర్మనో జయించి వేంగిరాజ్యము నాక్రమించి ఉండవచ్చును. పులంబూరు తామ్ర శాస నములో రెండవ మాధవవర్మ "దశశత సకల ధరణీతల నరపతి"గా పేర్కొనబడినాడు.

## [4] పొలమూరు శాసనము మొదటి రేకు పంక్తులు.

5. సమర సంఘట్ట విజయనః పరనర పతిమకుటమణి మయూఖావదాతచ

6. [ర]ణ యుగళస్య విక్రమాశ్రయస్య శ్రీ గోవిన్దవర్మ్మణః ప్రియ తనయః అతుల

7. [బ]ల పరాక్రమ యశోదాన వినయ సంపన్నో దశశతసకల ధరణీ తలనర

8. పతిరవసి [తవివి] ధ దివ్య త్రివరనగర భవవగత
పరమ యువతీజన వి

9. హరణరతిరన్నన్య నృపతి సాధారణదానమానదయా
ధర్మోధృతి

కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఈ ప్రాంతమును వేంగిదేశముగా గుర్తించినారు. క్రీస్తు శకము 462—464లో మొట్టమొదటిసారిగా శాలంకాయనులను మాధవవర్మ జయించి వేంగిదేశము నాక్రమించి యుండవచ్చును. వరుసగా ఈ మూడు సంవత్సరములలోను ఫాల్గునమాసములో వచ్చిన చంద్రగ్రహణ పుణ్యకాలమున పులంబూరు గ్రామమున కొన్ని భూములను ఇతడు దానము చేసెను. అప్పటివఱకు వేంగిరాజ్యము మాధవవర్మ పరిపాలనక్రింద నుండలేదనుటయు, మరే ప్రాంతమునుండియో దండెత్తి వచ్చెననుట నిశ్చయము.

విష్ణుకుండినుల రాజధానిగా పేర్కొనబడిన ''అమరపుర'' స్థలనిర్దేశము గావించుటయందు పరిశోధకులలో భిన్నాభిప్రాయములుగలవు. గుంటూరుజిల్లాలోని వినుకొండయే విష్ణుకుండినుల రాజధానియనియు, శ్రీశైల మల్లికార్జునస్వామి వారి ఆరాధ్య దైవమైన శ్రీ పర్వతస్వామి యనియు ''కీల్హారన్'' [5] పేర్కొనెను. ఈ వాదమును [6] భావరాజు వెంకటకృష్ణారావుగారు బలపరిచిరి. వినుకొండకు సమీపముననున్న గుండ్లకమ్మ నదికి బ్రహ్మకుండి యనుపేరుండెడిదనియు, దాని ఉపనదులలో కొన్నింటికి విష్ణుకుండి, రుద్రకుండి, అను నామములుండెడివనియు, వానివలననే విష్ణుకుండినులను పేరు ఆ వంశమువారికి కలిగెననియు భావరాజు వెంకటకృష్ణారావుగారు అభిప్రాయపడిరి. కాని [7] నేలటూరు వెంకటరమణయ్యగారు పై వాదమును అంగీకరింపలేదు.

''వినుకొండ'' అచ్చ తెనుగు సమాసము. 'విష్ణుకుండి' పదము విష్ణుపరమైన నీటి మడుగను నర్థము నిచ్చు సంస్కృత సమాసము. అమరావతియే ''అమర పురముగా''ను, నాగార్జునకొండ యందలి బుద్ధభగవానుడే విష్ణుకుండినుల ఆరాధ్య దైవమైన ''శ్రీ పర్వత స్వామి'' అనియు వారు అభిప్రాయపడిరి.

ఇక్ష్వాకుల కాలమునాటి పెక్కుశాసనములలో నాగార్జునకొండనే శ్రీపర్వతముగాను, ఇక్ష్వాకులను శ్రీపర్వతీయులుగాను పేర్కొనబడియుండుటయే వెంకటరమణయ్యగారి వాదమునకు ఆధారము కావచ్చును. మొదటి గోవిందవర్మ బౌద్ధుడనియు, అతని రాణి పరమ భట్టారికా మహాదేవి ఇంద్రపురమువద్ద మహావిహారమును నిర్మింప జేసెననుటయు, బుద్ధ భగవానుడే శ్రీ పర్వత స్వామి యను వీరి వాదమునకు బలమును చేకూర్చినది.

విష్ణుకుండిన రాజులు రెండవ మాధవ వర్మనుండియు అందరును వీరశైవులే యనుట చారిత్రకు లంగీకరించిన సత్యము. వారు పరమ మాహేశ్వరులు. అయినచో బుద్ధభగవానుడే శ్రీ పర్వత స్వామి యనుట పొసగదు. వెంకటరమణయ్యగారి సురి యొక అభిప్రాయము ప్రకారము విజయపురి యందలి కార్తికేయుడే [8] శ్రీ పర్వతస్వామి యనుట కొంతవఱకు సమర్థనీయముగా నున్నది. కాని అమరావతి, నాగార్జున కొండలయందు లభించిన స్తూపము, మహావిహారములుగాని, శిల్పఖండములుగాని విష్ణుకుండినుల కాలమునకు చెందినవని చెప్పదగినవి కావు. పైగా, అమరావతి అనుపేరు క్రీ. శ. 11వ శతాబ్దానంతరము వ్యాప్తిలోనికి వచ్చినదే. అంతకు పూర్వము ధనకటకమని, ధాన్యకటకము లేక దాన్నకడ అని పిలువబడుచుండెడివి. ఆ కారణముచేత వినుకొండ, అమరావతి, నాగార్జునకొండలవద్ద లభించిన పురావస్తు పరిశోధనల ఆధారములన్నియు పై వాదము లన్నింటిని పూర్వపక్షము చేయుచున్నవి.

కనుక, విష్ణుకుండినుల రాజధానియైన అమరపుర తెలంగాణాలో బహుశ తుమ్మలగూడెం ప్రాంతమున నుండెడిదని ఊహింపవచ్చును. ఇదియే 'ఇందుపుర' అని ''ఇందుపురాల'' అని పదకొండు, పన్నెండు, పదమూడు శతాబ్దులనాటి శాసనములలో పేర్కొనబడినది. విష్ణుకుండినరాజులలో ఒకడైన ఇంద్రభట్టారిక వర్మ ఘటికా స్థానముల నేర్పరచెను. '' [9] యథావిధి వినిర్యాపిత ఘటికా వాప్తపుణ్య సంచయస్య.''

'ఘటిక' యను పదమున కర్థము నొక్కొక్క రొక్కొక్క విధమున నిర్వచించినారు. ఘటికా స్థానమనగా విద్యాస్థానమని ఆమోదింప బడినది. వేదశాస్త్రములను బోధించు విశ్వవిద్యాలయములే ఆనాటి ఘటికా స్థానములు. హైదరాబాదు నగరమునకు సమీపమునకు ఇరువది కిలోమీటర్ల దూరముననున్న 'ఘటకేశ్వర్' నందొక ఘటికా స్థానముండెననుట అసమంజసము కాదు. ఈ 'ఘటకేశ్వర్' కు పదునాలుగు కిలోమీటర్ల దూరమున నున్న 'కీసర గుట్ట' అతి ప్రాచీన కాలమునకు చెందిన శైవ క్షేత్రము. ''కీసర గుట్ట''కే కేసరిగిరి అను నామాంతరము వ్యవహారమున నుండెను. 'కేసరిగిరి' అనగా సింహములకొండ అని అర్థము. ఈ గుట్టపై రామలింగేశ్వరస్వామి ఆలయము గలదు. దాదాపు ఏబది శివలింగములు నాలుగు వరుసలలో ఆరుబయట ఉన్నవి. ఈ లింగము లన్నియు నల్లరాతితో మలచబడినవి. ఉపరితలము నున్నగా నున్నది. పైభాగము గుండ్రముగాను, అడుగుభాగము నలుచదరముగాను, ఉండి ఇటుకలతో నిర్మితమైన పానువట్టములోనికి అమర్చబడినది.

ఒక్కొక్క ఇటుక పొడవు పదునెనిమిది అంగుళములు, వెడల్పు పది అంగుళములు, మందము మూడంగుళములు కలిగి ఉన్నది. లింగముల పైని ప్రత్యేకమైన శంఖాకారములో బ్రహ్మసూత్రములు చెక్కబడియున్నవి. పానవట్టమున కుపయోగింపబడిన యిటుకలేగాక, బ్రహ్మసూత్రములు కలిగిన మట్టి లింగము కూడ ఒకటి ఆ ప్రదేశమున దొరికినది. వీటి ఆధారము వల్ల యివి విష్ణు కుండినుల కాలమునకు చెందినవని రూఢి అయినది.

గుట్టమీద నున్న నీటి మడుగుల ఒడ్డునకూడ మట్టి శివలింగములున్నవి.

కీసరగుట్ట సముద్ర మట్టమునకు మూడువందల అడుగుల ఎత్తున రమారమి నాలుగు కిలోమీటర్ల విస్తీర్ణములో వ్యాపించి ఉన్నది. ఈ గుట్టమీద శిధిలమయిన కోటగోడలు—$18 \times 10 \times 3$ అంగుళముల పరిమాణము గల యిటుకలు, యిటుకముక్కలు, కూలిపోయిన కోటగోడ పొడవునా—గుట్టలుగా పడి వున్నవి. కోటకు తూర్పు, పశ్చిమ, ఉత్తర ద్వారములును, యుద్ధ తంత్రమున కావశ్యకమైన బలమైన గోడలును నిర్మితమయినవి. కోటలోనికి నీటిని సరఫరా చేయుటకుగాను తటాకములకు ద్వారములు యేర్పాటు చేయబడినవి. నీటి సదుపాయమునకుగాను, నదులుగాని, వాగులుగాని లేకపోవుట చేత వర్షములవలన లభించు నీటినే నిల్వ చేసికొనుటకు సహజ సిద్ధమయిన రాతి గుంటలకే కట్టలు నిర్మించి మంచినీటి సౌకర్యము కల్పించుకొనెడి వారని ఊహింప వచ్చును. అట్టి కొలనులు అనేకము లిప్పటికిని కీసర గుట్టమీద గలవు. అట్టి నీటి గుంటలలో నొకదానికి విష్ణు కుండమను పేరుండి ఉండవచ్చును! గుట్టకు దిగువను కోటకు బయటి భాగమున పెద్ద తటాకమొకటి గలదు. ఈ తటాకమే కందకముగాను, మంచినీటి కొలనుగాను ఉపయోగపడుతూ ఉండి ఉండవలెను. ముఖద్వారములవద్ద రక్షకభటుల నివాసగృహములుండినట్లు యిప్పటి శిధిలములవలన తెలియుచున్నది.

కీసరకు ఈశాన్యముగా ఒక కిలోమీటరు దూరమున కొండల నడుమ పర్వతాపురం అనే గ్రామం ఉన్నది. కీసరగుట్టతోసహా ఈ ప్రాంతమంతా కలిసి శ్రీ పర్వతమను పేరుతో పిలవబడుతూ ఉండవచ్చు. కీసరగుట్టకు అయిదు కిలోమీటర్ల దూరములో "కుండనపల్లి" అనే గ్రామం ఉన్నది. బహుశ విష్ణుకుండిన నామమునుండే కుండనపల్లి అనే గ్రామ నామ మేర్పడి యుండ వచ్చును.



కీసరగుట్టపైన రాతిమీద చెక్కబడిన "తొలచు వాన్దు" అను అక్షరములు.

రెండవ మాధవ వర్మ వ్రాయించిన తామ్రశాసనములలో వాడిన లిపిని బోలిన లిపిలో చెక్కబడిన "తొలచు వాన్దు" అను అచ్చు తెనుగు పదము, గుట్టపైన ఒక రాతిమీద చెక్కబడినది. పై పదమును బట్టియు, విష్ణుకుండినుల తామ్రశాసనములలో కనుపించు రావిరేవు, లెందులూరు, పెనకపఱ్ఱు, మొదలయిన గ్రామనామములను బట్టియు, తెలుగు పరిపూర్ణమయిన భాషగా అప్పటికే పరిణతి చెందినదనియు, విష్ణుకుండినులే తెలుగుభాషను ఆదరించిన మొదటి రాజవంశము వారనుటయు స్పష్టము.

రెండవ మాధవవర్మ తరువాత అతని మనుమడు, దేవ వర్మ కుమారుడైన మూడవ మాధవవర్మ విష్ణుకుండిన సామ్రాజ్యమునకు యేలిక అయ్యెను. ఇతడు త్రికూట మలయాధిపతియని ఈపూరు తామ్రశాసనములవలన తెలియుచున్నది. ఈ త్రికూటము నాసికప్రాంతమునందలి సహ్యాద్రిశృంగమని విమర్శకుల అభిప్రాయము. త్రికూట మలయములు మూడవ మాధవవర్మ రాజ్యముయొక్క సరిహద్దులను సూచించుననియు, పూర్వదిగ్భాగమున మలయ ప్రాంతమునుండి పశ్చిమమున త్రికూటమువఱకును వ్యాప్తమై యుండిన రాష్ట్రమంతయు నతని యేలుబడిలో నుండెనని నేలటూరి వెంకటరమణయ్యగారి అభిప్రాయము.

"జనాశ్రయ" బిరుదు మూడవ మాధవవర్మ కుండెను. ఈతడు ఛందస్సును ప్రోత్సహించుటకు జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తి అనునొక చందోగ్రంధమును గణస్వామియను పండితునిచేత రచింప జేసెను. దీనిలో సంస్కృత వృత్తములతోపాటు జాతి ఛందస్సులు కూడ పేర్కొనబడినవి.

కీసరగుట్టపైన విరజిమ్మబడినట్లున్న శివలింగములేగాక, ఇటుక నిర్మితములయిన ఆలయ శిధిలములుకూడ అచ్చటచ్చట కనపడుచున్నవి. ఆలయ నిర్మాణములో ఇటుక ఉపయోగించిన తరువాత రాతిని ఉపయోగించుట ఆరంభమైనది. అట్టిదశకు "కీసర గుట్ట" చక్కని ఉదాహరణము. ప్రాచీన కాలమున ఆలయ నిర్మాణము నందు యిటుకలే వాడబడుచుండెడివి. క్రమముగా నల్లరాతితో కట్టుట వాడుకలోనికి వచ్చినది. ఇట్టి నిర్మాణముల అవశేషములుకూడ కీసరగుట్టలో లభించినవి.

ఇటుకలతో నిర్మితమైన నలుచదరపు గర్భగృహముగల జైన దేవాలయముయొక్క ముఖమండపము, అనంతర కాలమున నల్లరాతి స్తంభములచేత కట్టబడినది. ఈ జైనదేవాలయమునకు నూఱుమీటర్ల దూరమునగల చెఱువుగట్టున చిన్న శివాలయమున్నది. ఇది పూర్తిగా నల్లరాతితో కట్టబడినను "యోని" మాత్రము యిటుకలతో నిర్మింపబడినది.

కీసరగుట్టపైన యిటీవల జరిపిన త్రవ్వకములలో పెద్ద యిటుక కట్టడము బయటపడినది. అయిదు పెద్ద పెద్ద గదులు, ముందు దీర్ఘచతురస్రాకారములో పెద్ద హాలు, చదరముగానున్న వసారా, దిగుటకు, ఎక్కుటకు మెట్లవరుసలు బయల్పడినవి.



కీసరగుట్టపైన జైనదేవాలయము.

బయటిగోడ ఏడడుగులు వెడల్పు గలిగి ఉండుటచేత అది అనేక అంతస్థులు గలిగిన భవనమో లేక రాజప్రాసాదమో అయ్యుండవచ్చును. గోడల బయటి భాగమునుండి పెద్ద పెద్ద కొయ్యస్తంభములను నిల్పి, వానిపైన అడ్డముగా కొయ్యదూలములను అమర్చి మట్టి పెంకులతోను, సున్నముతోను పైకప్పు నిర్మింపబడినది. ఈ భవనమునకు ఉత్తరపు వేపున చంద్రకాంత శిలలతో నిర్మింపబడిన విశాలమైన మెట్లవరుసలున్నవి. ఈ మెట్లదారి, రెండు వరుసలలోనున్న ఆరు గదుల భవనములోనికి పోవుచున్నది. ఈ భవనము మధ్యభాగమున విశాలమైన హాలుగలదు. ఆ ప్రదేశమంతయు మరికొన్ని భవనములతో కూడి, ఉండవచ్చును. ఈ భవనముల సముదాయమును బ[హి]ష్కమయిన యిటుకగోడ చుట్టిఉన్నది.

ఈ ప్రదేశములో విష్ణుకుండిన నాణెములు అనేకము దొరికినవి. ఈ నాణెములమీద తోకయెత్తి లంఘింపబోవు ఆకారముతోనున్న సింహపు బొమ్మ ఒకవైపు, రెండు దీపపు సెమ్మెల నడుమ పూర్ణకుంభము—చుట్టు కాంతివలయము, మరోవైపున ఉన్నవి. అందముగా తయారుచేయబడిన మానవుల, జంతువుల బొమ్మలు కూడ కొన్ని యిచట లభించినవి. ఈ బొమ్మలు భవనముల గోడలనలంకరించుటకు వాడబడినట్టివి. గోడల బయట, లోపల కూడ సున్నపుపూత పూయబడినది. కొన్నిచోట్ల అలంకరణలు చేయబడిన భాగములు కూడ కనపడును. రకరకాల రంగులలో మృణ్మయ పాత్రలు, గాజులు, పూసలు, మొదలయినవి లభించినవి.

వాస్తు నిర్మాణకౌశల ముట్టిపడునట్టి అనేక అంతస్తులు గలిగిన భవనములు, అందమయిన అలంకరణలయందు ప్రదర్శింపబడిన కుశలత, నేర్పునుబట్టి ఆ భవన సముదాయమంతయు విష్ణుకుండిన రాజుల రాజప్రాసాదములయి ఉండవచ్చునని భావించుటకు వీలగుచున్నది. ఈ రాజప్రాసాదముల చుట్టును బలమైన కోట గోడ శిథిలములు ఒక కిలోమీటరు విస్తీర్ణములో కనపడుచున్నవి.



కీసరగుట్టపైన త్రవ్వకములలో బయటపడిన మెట్లవరుస.

బ[హి]ష్కములయిన కోట గోడలకు చెందిన శిథిలములు, కోట లోపల దొరికిన నాణెములు, మత సంబంధమైన నిర్మాణములు, "తొలచువాన్లు" వంటి వ్రాతలు, యిత్యాది బలమైన సాక్ష్యాధారముల వలన 'కీసరగుట్ట' యే విష్ణుకుండినుల రాజధానియైన "అమరపుర" మని నిస్సంశయముగా చెప్పవచ్చును.

*(శ్రీ వి. వి. కృష్ణశాస్త్రిగారికి కృతజ్ఞతలతో)*

## ఈవ్యాసము వ్రాయుట కుపకరించిన గ్రంథములు

| క్రమ సంఖ్య | వ్యాసమునందలి పుటలు | గ్రంథము పేరు |
| --- | --- | --- |
| 1. | 3—4 | —"విష్ణు కుండినులు". డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారు. పుటలు 51—53. |
| 2. | 5 | ,, పుట 60. |

| క్రమ సంఖ్య | వ్యాసమునందలి పుటలు | గ్రంథము పేరు |
|---|---|---|
| 4. | 6 | — ,, పుట 72. |
| 3. | 6 | —ప్రకాష్ త్రవ్వకములు 1967. Ancient India Vol. 20 పుటలు 20, 21, 130. |
| 5. | 7 | —ఎపిగ్రఫీ ఇండికా Vol. 4. పుటలు 194, 195. |
| 6. | 7 | —Early dynasties of Andhra Desa భావరాజు వెంకటకృష్ణారావుగారు. పుటలు 422 నుండి 427 వరకు. |

| క్రమ సంఖ్య | వ్యాసమునందలి పుటలు | గ్రంథము పేరు |
|---|---|---|
| 7. | 7 | —విష్ణు కుండినులు. A. P. Archaeological Series No. 40 పుటలు 25, 41. |
| 8. | 8 | —Vishnukundius Reprinted from the Journal of the Madras University Vol. XLVII No. 2. July 75 Pages 28. |
| 9. | 9 | —Epigraphy Indica Vol. IV పుట 193 3rd plate 1st side. |

# రాలినకల

## శ్రీ అద్దేపల్లి రామమోహనరావు

పగలంతా
నాలోని ఆకాశాల్లో మరుగుపడ్డ నక్షత్రాలు
నేను నిద్రపోయే సమయాన
నా రక్త నాళాల్లో ఈదడం ప్రారంభిస్తే
రాత్రంతా
కలలతో తడిసిపోతుంది
నా తలగడ
పరుగు పరుగున పోయి
నేను రైలుస్టేషన్లో అడుగుపెట్టగానే
వెళ్ళిపోతున్న రైలు
దూరాన మలుపులోంచి
నల్లని కూత పెడుతూ ఉంటుంది —
నేను తొందర తొందరగా కాలేజీలో అడుగు పెట్టగానే
గంటలేటయిపోతుంది
గుండె భయంకరంగా కొట్టుకుంటూ ఉంటుంది—
సభలో నేను చదువుతున్న గేయం
సభ్యులమధ్య ఖాళీలోంచి
నిశ్శబ్దంగాపోయి గాలిలో కలిసిపోతుంది —
తల్లకిందులుగా బయటికి వస్తున్న నా ఊపిరి
నేను నిండుగా కప్పుకున్న దుప్పటికి తగిలి
ఊపిరాడక గిలగిలలాడుతుంది—
స్ప్రింగులేని నా కలవరింతలు
అంతటా పగిలిపోయిన నా గుండె రికార్డులా మ్రోగి
పక్కమీద అపస్వరాలు విరజిమ్ముతూ ఉంటే

తూర్పున సూర్యుడు
మెలకువలాగా కదలగానే
నక్షత్రాలన్నీ ఒక్కటొక్కటే
నాలోని ఆకాశాల చాటుకి వెళ్ళిపోతై !
—పొద్దున్నే పనిమనిషి వస్తుంది
గదిలో చెత్తాచెదారంతోపాటు
రాత్రల్లా నా మంచంచుట్టూ
రాలిపోయి వాడిపోయిన కలలన్నీ
చీపురుతో తుడిచేసి
వీధిలో మురుక్కాలవలో పడేస్తుంది !

# మన రైతులకు ఏకైక ఆశాకిరణం

దేశానికి వెన్నెముక అయిన రైతులోకానికి వరప్రసాదం వంటివి సహకార సంఘాలు. సహకార రంగ ప్రగతిలో ఆంధ్రప్రదేశ్ ఘనమైన విజయాలు సాధించింది. రైతుబిడ్డలకు పరపతి లభింపజేయడానికి గత రెండు దశాబ్దాలలో అనేక చర్యలు తీసుకున్నారు.

ఈ యిరవై సంవత్సరాలలో స్వల్పకాలిక, మధ్యకాలిక రుణాలు పెరుగుతూ వచ్చాయి. 1955–56, 1964–65 మధ్యకాలంలోని దశాబ్దంలో సహకార రుణాల మొత్తం రు. 189.98 కోట్లుకాగా, 1965–66, 1974–75 మధ్య దశాబ్దంలో యీ రుణాల మొత్తం రు. 412.40 కోట్లకు పెరిగింది.

రుణాలు యిచ్చే విషయంలో ప్రాథమిక వ్యవసాయ అభివృద్ధి బ్యాంకులు ఉదార విధానాలను అమలు చేస్తున్నాయి. దీని ఫలితంగా ప్రాథమిక వ్యవసాయ అభివృద్ధి బ్యాంకుల ద్వారా రైతులకు అందజేసిన రుణాలు మొదటి మూడు ప్రణాళికలలో ఎన్నో రెట్లు అధికం అయ్యాయి. మొదటి ప్రణాళికా కాలంలో రు. 256.02 కోట్లు వున్న యీ మొత్తం, రెండవ ప్రణాళిక కాలంలో రు. 477.85 కోట్లకు మూడవ ప్రణాళిక కాలంలో రు. 3746.18 కోట్లకు పెరిగింది. ఐదవ ప్రణాళిక రెండవసంవత్సరం 1975–76 లోనే యీ మొత్తం రు. 2723.60 కోట్లకు పెరిగింది. 1974–75లో యీ మొత్తం రు. 1886.16 కోట్లు మాత్రమే వుండేది.

మన రాష్ట్రం వ్యావసాయిక ఆర్థిక వ్యవస్థలో మార్కెట్ సంఘాలు కీలక పాత్ర వహిస్తున్నాయి. 1956 జూన్ నెలలో మన రాష్ట్రంలో 148 ప్రాథమిక మార్కెట్ సంఘాలు పనిచేస్తూ వుండేవి. వాటి వాటా ధనం రు. 26.6 లక్షలు వుండేది. 1976 జూన్ నాటికి యీ సంఘాలు సంఖ్య 265కు పెరిగింది. వీటి వాటా ధనం కూడా రు. 269.22 లక్షలకు పెరిగింది. ఇదీ గత 20 సంవత్సరాలలో యీ రంగంలో జరిగిన గణనీయమైన అభివృద్ధి.

డైరెక్టరు

సమాచార, పౌర సంబంధ శాఖ,

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

21/76-77

శ్రీ బి. జి. ఎల్. స్వామి

# తమిళదేశంలో గోళకీ శైవమతము

[ఇంతకిముందు ప్రొఫెసర్ స్వామిగారి 'తేవారంత్రయం' వ్యాసం 'భారతి'లో వేసిన సంగతి పాఠకులకి గుర్తు ఉండే ఉంటుంది. తమిళదేశంలో గోళకీ శైవాన్ని గురించి ఆయన ఇంగ్లీషులో రాసిన వ్యాసానికి తెలుగు అనువాదం ఈ నెల మొదలు పెడుతున్నాము. వ్యాసంలో ఉదహరింపబడిన గ్రంథాల జాబితా, బొమ్మలు చివరి భాగంతోబాటు వేస్తాము.]

## పీఠిక

ఈనాడు 'శైవము' అనే పదము అనేక శాఖలు, ఉపశాఖలు కూడిన సామాన్య శైవమతాన్ని స్ఫురింపచేస్తుంది. ఈ మత శాఖల్లో కొన్ని ప్రసిద్ధమైనవి, కొన్ని కొంతవరకూ తెలిసినవి. మరి కొన్నింటిని గురించి మనకు తెలిసినది చాలా స్వల్పం. వీటిలో కొన్ని కొన్ని కాలాలలో ప్రజాదరణ, గౌరవము బాగా పొందగలిగాయి. కొన్ని కాలాలలో ఈ ప్రజాదరణ, గౌరవము తగ్గిపోయాయి. కొన్ని రాజాదరణ ఉన్నంతకాలము ఉన్నతస్థితిలో ఉండి, రాజాదరణ తగ్గగానే క్షీణించిపోతూ ఉండేవి. కొన్ని కేవలం ప్రజల ఆదరాభిమానాల వల్లనే వృద్ధిచెందాయి అనే విషయం మనకు తెలుస్తూ ఉంది. వీటిలో చాలా కాలక్రమాన అనేకమైన మార్పులు, చేర్పులకు లోనవుతూ వచ్చాయి. కర్మకాండలోను, తత్త్వ దర్శనములోను మార్పులను అంగీకరించడమూ ఇతర మతశాఖలనుంచి కొన్ని కొన్ని అంశాలను తీసుకోవడమూ జరిగింది. కొన్ని కాలం గడిచిన కొద్దీ విశాల దృక్పథాన్నలవరచుకొన్నాయి; కొన్ని కాలక్రమేణా కర్మకాండ విషయంలో గాని, తత్త్వవిషయంలోగాని ఇతర మతశాఖల ప్రభావాన్ని త్రోసిపుచ్చి తమ విశ్వాసాలలోనే గట్టిపడ్డాయి. చాలా మత శాఖల స్వరూపాల ఛాయలు, ఇతర మతశాఖలతో సౌకర్యంవల్ల, సాహచర్యంవల్ల, తరచూ మారుతూ ఉండేవి. కొన్ని మతశాఖలు ఇతర శాఖలతో కొన్నింటిలో పూర్తిగా కలిసిపోయి తాము అంతరించిపోయిన సందర్భాలు కూడా కనిపిస్తాయి. ఇదేవిధంగా కొత్త మతశాఖలు, ఉపశాఖలు స్థాపించబడటంకూడా జరుగుతూఉండేది.

తమిళదేశపు శైవమతంయొక్క సుదీర్ఘమైన చరిత్రలో 6వ శతాబ్దంలో కూడా ఈ విధమైన ధోరణులే కనపడుతాయి. గోళకీమతము 10వ శతాబ్దంలో తమిళదేశంలోకి ప్రవేశించిన అనేక శైవపద్ధతులలో ఒకటి. ఈ మతశాఖ చరిత్రను సంస్మరించే ప్రయత్నమే ఈ వ్యాసం ...

ఈ వ్యాసంలో ఉపయోగించబడిన ఆకరాలకు ముఖ్యమైన ఆధారం భారత పురాతత్త్వ శాఖవారి శాసన విభాగానికి సంబంధించిన వార్షిక నివేదికలలోని సంగ్రహ విషయాలు (absracts). ప్రచురించబడిన శాసనాల పూర్తిపాఠాలను కూడా ఉపయోగించడం జరిగింది. కాని ప్రచురించబడిన శాసనాల సంఖ్యతో పోల్చితే ... సంఖ్య అతిస్వల్పం. ఈ పరిమితివల్ల ఈ వ్యాసంలో వెలువరచిన భావాలు కేవలం ఊహమీద ఆధారపడినవి కాకపోయినా, తుది నిర్ణయాలుగా పరిగణించడానికి వీలులేదు.

ఇంతకుపూర్వం తమిళ దేశంలోని గోళకీ మఠాలను గూర్చిన కొన్ని విషయాలను చాలా కొద్దిమంది రచయితలు వ్రాసారు. వీరిలో ఒకరు శాసనశాఖవారు (గవర్నమెంటు ఎపిగ్రఫిస్టు). వీరు ప్రతి సంవత్సరము ప్రకటించబడే వార్షిక నివేదికలలో II భాగములో ఆ సంవత్సరము వరకు సంపాదించబడిన విషయాన్నంతటినీ సంగ్రహంగా వ్యాసరూపంలో వ్రాస్తారు. ఇతర రచయితలు, వేరే విషయాలను గురించి ముఖ్యంగా వ్రాస్తూ, సందర్భవశాత్తూ ఈ విషయంపై వ్రాసారు. లోకనాయకి నన్నిత్తంబి, గురుమూర్తి (1970) వ్రాసిన వ్యాసంలో గోళకీ మతసంస్థలు విద్యాకేంద్రాలలో ఒకటిగా పేర్కొనబడ్డాయి. 'తమిళదేశంలో శైవమత చరిత్ర' (రాజమాణిక్కం, 1958, 1962)లో కొన్ని పుటలు గోళకీ మఠాలకి కేటాయించబడ్డాయి. వేంకటరమణయ్య, సోమశేఖర శర్మ (1960) కాకతీయ యుగానికి పరిమితమైనంతవరకూ గోళకీ మతసంస్థలను గురించి చర్చించారు. 'గోళకీమఠము' అనే చిన్న వ్యాసంలో మహాలింగం(1962) ముఖ్యంగా ఆ మఠము ఉత్పత్తిని గురించి వ్రాసారు.

## గోళకీ వంశము

### అ. ఆంధ్రదేశము

తెలుగు దేశంలో గోళకీ వంశములో ముఖ్యమైన లక్షాధ్యాయి వంశానికి మంచి ప్రాతినిధ్యము ఉన్నది. ఇదీ, భిక్షామఠ వంశక్రమము ఇంచుమించు పూర్తిగా ఒక్కటే అని చెప్పవచ్చు. క్రీ. శ. 1261 లో వేయబడిన మాల్కాపురం శాసనం (SII X No. 395; రామయ్యపంతులు, 1930) దూర్వాసునితో ప్రారంభమయిన గురు పరంపరకు చెందిన సద్భావ—శంభువుకు దాహళ మండల కాలచూరి ప్రభువు యువరాజు I (క్రీ. శ. 915—945) మూడు లక్షల రాష్ట్రాన్ని దానం చేసాడని తెలియజేస్తున్నది. (ఈ దాహళ మండలము భాగీరథి, నర్మద నదులమధ్య ఉన్నది) ...

కూడా ఈ శాసనం తెలుపుతోంది. నర్మదానదీ తీరాన త్రిపురికి 12 మైళ్ళ దూరంలో ఉన్న ఛేదఘాట్‌లో ఈ మఠం ఉండేదని హీరాలాల్ (1927) అభిప్రాయం. మాల్కాపురం శాసనంలోని విశ్వేశ్వర—శంభువుకు విశ్వేశ్వర—దేశికుడు, విశ్వేశ్వర—శివుడు, విశ్వేశ్వర—శివాచార్యుడు అనే పేర్లుకూడా వున్నాయి. ఈయన గోళకీ మఠానికి చెందినవాడు. ఆంధ్రదేశానికి రాకముందు గౌడ దేశంలోని దక్షిణ రాఢ రాష్ట్రానికి చెందిన పూర్వ గ్రామ నివాసి.

కాని అప్పటికే కొన్ని శతాబ్దాల పూర్వంనుంచే ఆంధ్ర దేశంలోనూ, తమిళదేశంలోనూకూడా గోళకీ పరంపరకు చెందిన గురువులు నివసించేవారనే విషయాన్ని నొక్కి చెప్పాలి. బీరనాలం బుడి కొడుకు, నాలంబ—పల్లవరాజు అయిన అన్నయ్యదేవుడు అనంతపురం చుట్టుపట్ల ప్రాంతాన్ని పాలించే కాలంలో నాలంబే శ్వరాలయానికి సంబంధించిన వరుణ శివుడనే గురువు గురించి మనం వింటాము. (759—1916, క్రీ. శ. 936) తెలుగు చోడుడైన బీజదేవుడు వేయించిన శక సం॥ 999 శాసనం ఉత్తమ—శివుడనే గురువుకు ఒక గ్రామం దానం చేయబడిన విషయం చెప్తుతుంది. ఈ గురువు గోళకీ మఠానికి చెందిన వాడయి ఉండాలి. (62—1939/40). గుంటూరు జిల్లాలోని సత్తెనపల్లిలోని వంశము పేరుగాని, రాజు పేరుగాని లేని 12వ శతాబ్దపు శాసనం ఒకటి వెలంతూరులోని త్రికోటేశ్వర ఆలయానికి ఇవ్వబడిన భూదానాన్ని, ఈశాన-శివుడనే గురువును పేర్కొంటు న్నది. (7—1908) దానమీయబడిన భూమి ఈ గురువుకు ఒప్పగించబడి ఉంటుంది.

కాకతీయ గణపతి (క్రీ. శ. 1199—1261) రుద్రమ దేవుల (క్రీ. శ. 1259—1295) రాజ్యకాలాల్లో, కాకతీయ సామ్రాజ్యంలో గోళకీ శైవం ప్రబలంగా వుండేది. విశ్వేశ్వర—శివుడు రాజగురువుగా ఉండడంచేత వారి రాజ్యంలోని మత జీవి తాన్ని ఆయన బాగా ప్రభావితం చేసాడు. ఈ పాలకులు వేయిం చిన శాసనాలనేకం, గోళకీ లక్ష్మాధ్యాయి వంశానికి చెందిన గురు వులను, ఆలయాలు, మఠాలు స్థాపించబడడంలో వారి పాత్రను, మత, మానవసేవా కార్యక్రమాలను అమలు జరపడానికై వారు గ్రహించిన దానాలను పేర్కొంటున్నాయి. ఈ గురువుల్లకు సంబం ధించిన సంస్థలు వారి రాజ్యమంతటా ఉండేవి. వీటిలోకొన్ని 16వ శతాబ్దం వరకు కూడా ఉండేవి. (Map. 1) ఈ గురువుల వంశ పరంపరను నిర్మించడానికి శాసనాలు కొంతవరకూ సహాయపడ్డాయి. A R E 1936/37 Part II, Para 19 నుంచి తీసుకోబడి, విపులీకరించబడిన వంశ క్రమము ఈ క్రింద ఇవ్వబడింది. ఇది చాలావరకు శాసనాల ఆధారంతో నిర్మించబడినది.

కాకతీయుల కాలపు శాసనాలు మరికొన్ని ఉన్నాయి. వీటిలో పేర్కొనబడిన గురువులు గోళకీ వంశ క్రమానికి చెందినవారే అయివుంటారు. కాని వారికి ఈ వంశ క్రమములో స్థానం కల్పించలేము. గణపతిదేవుడి శాసనాలలో ఒకటి (233—1937/38, క్రీ. శ. 1257) పుష్పేశ్వర మహాదేవునికై ఒక గ్రామాన్ని దానంగా గ్రహించిన ఈశాన—గురువును పేర్కొం టున్నది. ప్రతాపరుద్రుని రాజ్యకాలానికి చెందిన ఇంకొకశాసనం (50—1957/58, క్రీ. శ. 1313) రాజగురువుగా పేర్కొన బడ్డ అఘోర శివాచార్యునికి ఇవ్వబడిన భూదానాన్ని గురించి చెపు తుంది. ఈ రాజే వేయించిన ఇంకొక శాసనం (233—1905, క్రీ.శ.1313)లో చంద్రభూషణ-శివాచార్యునిపేరు కనపడుతుంది. శ్రీశైలంలోని ఒక శాసనంలో (36—1915, క్రీ. శ.1313) అరసు మఠానికి చెందిన ఈశ్వర—శివాచార్యుడు పేర్కొనబడ్డాడు.

గుంటూరుజిల్లా కంభంపాడు గ్రామంలోని చెంగేశ్వరాల యానికి స్థానాపతి శాంత—శివుని కొడుకు సదా—శివుడు. (301—1931/32, క్రీ. శ. 1258) ఈ శాంత—శివుడు కాకతీయ జన్నిగదేవుని రాజగురువుఅనీ, శ్రీ పర్వతంలోని అభినవ గోళకీమఠానికి పీఠాధిపతి అనీ చెప్పబడింది. (50—1940/41) పుష్పగిరిలోని యజ్ఞజియరు శిష్యుడైన వ్యాపక—శివుడు, చిత్ర మేలి వర్తక సంఘం సభ్యులచేత చిత్రమేలీశ్వరాలయానికి "శ్రీకార్యం"గా నియమించ బడ్డాడు. (6—1953/54) అదే సంవత్సరంలో ప్రకటించబడిన 14, 19 శాసనాలలో అదే పేరుతో పేర్కొనబడిన గురువు ఈ వ్యాపక—శివుడే అయి వుంటాడు. (19—1953/54, క్రీ. శ. 1237)

ఈ గోళకీ పరంపరకు చెందిన గురువులను గురించి మనం తిరిగి 16వ శతాబ్దంలో—విజయనగర రాజుల ఆదరానికి పాత్రు లయిన వారినిగురించి—వింటాం. పుష్పగిరిలోని ఆలయశిఖరానికి పూత పూయించిన అఘోర—శివాచార్యుడు పేర్కొనబడ్డాడు. (307—1905. క్రీ. శ. 1501) శేకు మఠానికి చెందిన ఇమ్మడి రుద్రశివాచార్యుడు కాళహస్తీశ్వరాలయంలో దేవుని నైవే ద్యానికై ధనం దానంగా గ్రహించాడు (164, 172—1924. క్రీ. శ. 1514 & క్రీ. శ. 1519) 497—1905 క్రీ. శ. 1571 శాసనంలో అనంత—శివాచార్యుని శిష్యుడైన పొన్నంబల ధర్మ—శివాచార్యుని శిష్యుడుగా ఇదేపేరుతో (ఇమ్మడి రుద్రశివా చార్యుడు) పేర్కొనబడిన గురువు, ఇతను ఒకరే కావచ్చును.

దేవికాపురంలోని గోళకీమఠము 16వ శతాబ్దంలో విజయ నగర పాలకుల ఆదరానికి పాత్రమై చాలా శక్తివంతమైన కేంద్రంగా ఉండేది. ఈ భిక్షామఠపు వంశాన్ని పేర్కొన్న అత్యంత ప్రాచీన శాసనం సాళువ నరసింహుని కొడుకు ఇమ్మడి రామదేవుని కాలంలో క్రీ. శ. 1505 వేయించబడినది. ఇది ఆలయపు ధర్మ కర్త విశ్వేశ్వర — శివాచార్యుడు పట్టణ నివాసానికి అనుమతిని ఇవ్వడం గురించి చెపుతుంది. (354—1912) ఈయన కృష్ణ దేవరాయల కాలంలో కూడా జీవించాడు. ఆ కాలపు శాసనాలలో కూడా ఆయన ధర్మకర్తగా పేర్కొనబడ్డాడు. (389, 390, 365 క్రమంగా క్రీ. శ. 1513, 1515, 1523) ఈశాన-శివాచార్యుడనే గురువు సుమారు ఇదేకాలం వాడుగా (విశ్వేశ్వర—శివాచార్యుడి కాలం) కనపడుతాడు. విశ్వేశ్వర—శివాచార్యుడు ఆలయ భాండాగారాధికారిగా వర్ణించబడ్డాడు (352—1912, క్రీ. శ.

1519) ఈయనకు ఆలయంలోను, మఠంలోను ముఖ్యమైన నిధులున్నట్లు 368, 373, 256–1919, క్రీ.శ.1522,1531, 1533 సం॥ శాసనాలవల్ల తెలుస్తోంది. వీరిద్దరికి గురుశిష్య సంబంధం ఉందో లేదో స్పష్టంగా తెలియటంలేదు. 400—1912లో మరణించినట్లు పేర్కొనబడిన ఈశాన—శివయోగీంద్రుడు పై శాసనాలలో పేర్కొనబడినవాడే అవటం సందేహాస్పదం.

విమల—శివుడు 253—1905, క్రీ. శ. 1247
(గోళగిరికి చెందినవాడు
త్రిపురాంతకములో మఠం
కట్టించినవాడు)

↓

ధర్మ—శివుడు [253—1905, క్రీ. శ. 1247
223—1905, క్రీ. శ. 1252
89—1958/9]

↓

విశ్వేశ్వర—శివుడు [293—1936/7, క్రీ. శ. 1243
294—1936/7, క్రీ. శ. 1252
201—1936/7 క్రీ. శ. 1252
84—1917 క్రీ. శ. 1261
95—1917 క్రీ. శ. 1268
169—1905
145—1954/55
94—1958/59
96—1917 క్రీ. శ. 1282]

↓

? విద్యా—శివుడు
(40—1942/3)

పరిపూర్ణ—శివుడు
[293—1936/37 క్రీ.శ.1243
294—1936/7 క్రీ. శ. 1252
301—1936/7, క్రీ. శ. 1252]

శాంతశివుడు
(272—1905, క్రీ. శ. 1263
171—1905
165—1905
4—1955/6]

↓

ఉత్తమ—శివుడు
(జ్ఞానోత్తమ—శివుడు)
130—1897, క్రీ. శ. 1236
307—1936/7, క్రీ. శ. 1271
SII. V. 199, క్రీ. శ. 1257]

శ్రీకంఠ—శివుడు
[246—1905, క్రీ. శ. 1270
188—1905 క్రీ. శ.1271/3]

## ఇ. తమిళదేశము

# 1. లక్షాధ్యాయి (భిక్షా) వంశము

తమిళదేశంలో ఈ వంశాన్ని పేర్కొన్న శాసనాలలో అత్యంత ప్రాచీనమైనది రాజేంద్రచోళుడు I కాలంనాటిది. ఈ శాసనం కీళైకాట్టులో (ఇప్పటి నాగపట్టిణం తాలూకాలోని కీళైయూరు) కనకసభాపతి....దేశికర్ అనే గురువు నివసిస్తున్నాడని, ఈ కీళైకాట్టు మఠము, చిదంబరంలోని మేలైచ్చేరిలోని పతంజలి దేవర్‌మఠానికి చెందిన లక్షాధ్యాయి సంతానానికి సంబంధించిన ఆచార్యులకు కేంద్రము అని చెపుతుంది (88—1946/7 క్రీ. శ. 1041) ఈ శాసనం నాగపట్టిణంలో దొరకడంచేత అక్కడకూడా ఒక గోళకీమఠం ఉండేదనికాని, లేక అక్కడ కొందరు గోళకీ మతాచార్యులు నివసించేవారనికాని గ్రహించవచ్చు. ఇంతేకాక ఈ మఠపు పూర్వీకులుకూడా ఈ ప్రదేశాలలో ఉండేవారనికూడా ఇది సూచిస్తుంది.

12వ శతాబ్దంలో లక్షాధ్యాయి వంశానికి చెందిన జ్ఞానశివ—రావళుడి శిష్యుడైన ఓంకారదేవ రావళుడికి వారణాశిలోని కొల్ల మఠముతో సంబంధముండేది. (111—1929/30, క్రీ. శ. 1106) ఈయన తిరుపాచ్చూర్‌లోని వాచేశ్వరాలయ 'స్థానత్తార్' (ధర్మకర్తలు) కు దేవుని 'తిరుపవిత్రం' కొఱకు కొంత ధనము ఇచ్చినట్లు చెప్పబడుతోంది.

13వ శతాబ్దపు చోళ, పాండ్య శాసనాలనిండా గోళకీ మఠాల, గురువుల ప్రసక్తి కనపడుతుంది. కులోత్తుంగుడు III శాసనాలు రెండు, రావళన్‌ను (72—1930/1. క్రీ. శ. 1217) శివదవనప్పెరుమాళ్ అనే పేరుగల అఘోరదేవరావళిర్‌ను (145—1932/3, క్రీ. శ. 1216) పేర్కొంటున్నాయి. వీరిలో మొదటివాడు వారణాశి భిక్షామఠానికి చెందినవాడుగ పేర్కొనబడ్డాడు రెండవవాడుకూడా బహుశా ఈమఠానికి చెందినవాడే అయివుంటాడు—వారణాశితో సంబంధం లేకపోయినా శివదవనప్పెరుమాళ్ అనే రెండవ పేరును పేర్కొనే ఈ రెండవ శాసనం ముఖ్యమైనది. బహుశా ఈ శివదవనప్పెరుమాళ్ అనేది ఆయన మొదటి పేరై ఉండి, ఈ మతంలోచేరి ఏదో ఒకవిధమైన దీక్ష పుచ్చుకున్న తరువాత పెట్టుకున్న పేరు అఘోరదేవ — రావళర్ అయివుంటుంది. ఈ శాసనం శివదవనప్పెరుమాళ్ ఈ దేశస్థుడనీ, (తమిళ) మఠము కట్టించడానికి స్థలము సంపాదించి పెట్టినందువల్ల అతనిని ఈ మఠములో చేర్చుకున్నారని సూచిస్తుంది. 'రావళర్' అనే ఉపసర్గ దీక్ష పొందడాన్ని సూచించేదేకాక గోళకీ మతంలో ఒక ప్రత్యేక శాఖకు సంబంధించినది అనికూడా అనేకమైన ఇతర శాసనాలవల్ల తెలుస్తోంది.

కైలాసదేవ రావళర్ — 11—1935/36 క్రీ. శ. 1234.

(తిరువణ్ణామలైలోని గోళకీమఠం)

ఈశాన—శివ—రావళర్ — 209—1924, క్రీ. శ. 1266 ప్రాంతం.

(తిరక్కోడుకున్రంలోని శివపార్వతిమఠం)

పశుపతి రావళర్ — 48—1928/9, క్రీ. శ. 1277

(పశుపతి—రావళర్—పొన్నంబలకూట్టన్‌కు చెందినవారు—265—1941/2. ఈయనే అయివుండవచ్చును.)

ఈ శాసనాలన్నీ ఈ గురువులందరూ గోళకీ వంశపు లక్షాధ్యాయి సంతానానికి చెందినవారని స్పష్టంగా చెపుతున్నాయి.

ఈశానదేవుడు, (209—1924 శాసనంలో పేర్కొన బడినవాడు కాక ఇంకొకడు) అతని శిష్యులు కరుంగలం లేక సదావాచక నల్లూరులోని నల్లపెరుమాళ్ మఠంలో నివసించేవారు. వీరు తంజావూరు జిల్లాలోని తిరువారూరులో ఉన్న కృష్ణ—గోళకీ మఠంనుంచి ఇక్కడకు వచ్చారని చెప్పబడుతోంది. (504—1909, సుందరపాండ్యుడు I కాలం నాటిది.]

రామనాథపురం జిల్లాలోని తిరుపుత్తూరునుంచి పాండ్య రాజు వీరపాండ్యదేవుడు వేయించిన శాసనం, భిక్షామఠానికి చెందిన 'ముదలియార్' శిష్యుడూ, పీఠాధిపతీ అయిన రాజేంద్రత్తు—ముదలియార్ శివప్రకాశర్‌ను పేర్కొంటుంది. (164—1935/6 క్రీ. శ. 1284 ప్రాంతం) ఈ శాసనం, శివప్రకాశ మఠాన్ని సర్వేశ్వరుడనే గురువు చూసుకుంటున్నాడని చెప్పే శాసనం **(A. D. 1264)** పరస్పరం సంబంధం కలవై ఉంటాయి. ఇంకొక తారీకులేని శాసనం (636—1904. రాజరాజచోళుడు III కాలం నాటిదని గవర్నమెంటు ఎపిగ్రఫిస్టుచేత అనుమానించబడినది) లక్షాధ్యాయి సంతాన ముదలియార్లకు చెందిన 'స్వామిదేవర్'ను పేర్కొంటున్నది. ఈ శాసనాలు 'ఆచార్య' అనే పదానికి బదులు 'ముదలియార్' అనే మాటను ఉపయోగించడంవల్ల ఇవి ముఖ్యమైనవి.

13వ శతాబ్దంలో ఈ గోళకీ మఠాల విస్తరణ తమిళ దేశానికి మాత్రమే పరిమితమవలేదు. చుట్టుపక్కల పాలించేవంశాల పాలనకింద ఉన్నప్రాంతాలలో కూడా ఇవి వ్యాపించాయి. చోళరాజులు కన్నడదేశంలోని తూర్పు ప్రాంతాన్ని (ఇప్పటి కోలారు జిల్లా) జయించగానే ఈ గోళకీ వంశము కూడా అక్కడ వ్యాపించింది. లక్షాధ్యాయి వంశానికి చెందిన సురమి—దేవర్ లేక ప్రసన్న—శివట్టయ్యరుకు శిష్యుడైన రాజగురువు విశ్వేశ్వర—శివుడి కుమారులయిన శిష్యులిద్దరు (సోమేశ్వర—దేవర్, ...... నాయనార్) గంగప్పెరు

మాళ్‌నుంచి భూదానం గ్రహించారు. (ఎస్. ఎస్. కోలార్ ఎ. క. X కోలార్ క్రీ. శ. 1285) చెంగల్పట్టు జిల్లా, తిరువళ్ళూరులోని రామగిరిలోని శాసనం ఒకటి, తేదీ, రాజవంశముపేరు మొ॥ ఏవీ లేనిది, చోళ—పాండ్య—స్వామిదేవ అనే బిరుదుకల ప్రశాంత—శివ ముండియార్ (?ముదలియార్)ను పేర్కొంటున్నది. ఈ గురువును గంగశాసనంలో ఇదేపేరుతో కనిపించే గురువుగా గుర్తించడానికి వీలున్నది. ఇద్దరిదీ శాండిల్య గోత్రమవడం దీనిని మరింత దృఢపరుస్తోంది. (696—1904) గంగప్పెరుమాళ్ (హొయిసల వీరరామనాథుడి సామంతుడు) వేయించిన ఇంకొక శాసనం సకల—శివ—పండితర్‌ను "మా గురువు"గా పేర్కొంటున్నది. (ఎ. క. X 117 చింతామణిది. క్రీ. శ. 1289)

పైన పేర్కొన్న చిదంబరంలోని పతంజలి—దేవర్ మఠం (88—1946/7. క్రీ. శ. 1041) 14వ శతాబ్దంవరకూ వర్ధిల్లుతూనే ఉన్నది.(115—1939/40, క్రీ. శ. 1301) 'అళివిడైతంగి పట్టు'లోని 'నాట్టవర్' ఒక గ్రామాన్ని మఠంలో ప్రతిష్ఠించబడిన 'విశ్వేశ్వర నాయనార్' విగ్రహపూజా నైవేద్యాలకు అక్కడవుండే తపస్వుల భోజనానికి దానంచేసాడు. విశ్వేశ్వర—నాయనార్ ఆ మఠానికి చెందిన, మరణించిన గురువై ఉండాలి. తంజావూరు జిల్లా, తిరువారూరులోని దక్షిణ—గోళకీ మఠానికి చెందిన ఏకామ్రదేవ — ముదలియార్ తిరుకొడున్ కున్రమ్‌లో కొంతకాలం నివసించి అక్కడ విరుద—ముడిత్తన్ మఠం స్థాపించాడు. ఆగమశీలుడు లేక ఉమైయోరుభాగ—ముదలియార్ ఆధిపత్యంకింద భిక్షా—మఠం శాఖ ఒకటి తిరునల్వేలి జిల్లాలో మన ప్పడైవీడులో పాండ్యరాజు మారవర్మన్ వీరపాండ్యుడి కాలంలో ఉండేది. (488—1909, క్రీ. శ. 1357). ఆగమ శీల—ఉమైయోరు భాగర్ శిష్యుడొకడు, ఒక తారీకులేని శాసనంలో (443—1909) పేర్కొనబడ్డాడు. ఇది పై శాసనకాలానికి చెందినదే అయివుండాలి. తిరువారూరులోని దక్షిణ—గోళకీ మఠానికి చెందిన ఏకామ్రదేవ మొదలియార్ ఆ మఠ నిర్వహణకై కొంత భూమిని దానంగా పొందాడు. (234—1924. క్రీ. శ. 1303). వ్యాపక—శివుడు, తిరుచ్చి జిల్లా, తిరువనైక్కావల్ లోని నడువిల్ మఠానికి చెందినవాడు. (352—1914, క్రీ. . 1323)

15వ శతాబ్దంలో గోళకీ వంశము వర్ధిల్లుతూ ఉండేదని క్రీ. శ. 1477 నాటి శాసనం ఒకటి తెలియచేస్తుంది. ఇది ఉత్తర ఆర్కాటుజిల్లా, జటాధారి కుప్పంలోని భిక్షామఠానికి చెందిన ఈశాన—శివాచార్యుడికి భూదానం ఇవ్వడం గురించి చెపుతుంది. (93—1941/2)

గోళకీ భిక్షావంశము 16వ శతాబ్దంలో కూడా ఉండేదనడానికి స్పష్టమైన సాక్ష్యాధారాలున్నాయి. మధుర వీరప్ప నాయకుడి రాజ్యకాలంలో, 1571లో వేయించబడిన శాసనం ఒకటి తిరునల్వేలిలో సర్వశిఖామణి వేంబత్తూర్ ముదలియార్ అఘోర—శివాచార్యుడి ప్రశిష్యుడు, పుష్పాలక—శివాచార్యుడి శిష్యుడు అయిన ఈశాన—శివాచార్యుడి ఆధిపత్యంకిందఉన్న 'తేర్కుమఠం' ఒకదాన్ని పేర్కొంటున్నది. (C. P. of 1940/1, క్రీ. శ. 1571) తిరునల్వేలిలోని వేంబత్తూర్ మఠంలోని తామ్రశాసనం, శైవశిఖామణి పీఠాధిపతి అయిన దక్షిణ—గోళకీ వంశానికి చెందిన శంకర నారాయణాచార్యుడిని గురించి చెపుతుంది. (తా. శా. 33 1940/1). చిదంబరంలోని భిద్యా మఠానికి చెందిన అఘోర—శివాచార్యుడి శిష్యుడైన; పెరుమానాయరప్పండారం తంజావూరు జిల్లా, నన్నిలం తాలూకా, శ్రీ వంజియంలో కుడువంచ్చేరిలోని తన మఠంకోసం కొంత భూమిని కొన్నాడు. (79—1911, క్రీ. శ. 1579). ఉమైయోరుభాగ—మొదలియార్‌ప్పండారం శిష్యుడైన ఆండుగొండనాయనార్, ఆయన అనుచరులు తిరునల్వేలి జిల్లా, శివ—శైలంలో "మడాపత్తియం (మఠము, దానికి సంబంధించే ఆలయము నిర్వహించడంలో) విధులను నిర్వహించడానికి నియమించబడ్డారు. (520—1916, క్రీ. శ. 1587).

తిరుప్పణవాసర్—ముదలియార్, 16వ శతాబ్దంలో పేరు మోసిన గురువు అయివుండాలి. ఆయన చిదంబరంలోని పడమటి వీధిలో ఉన్న వెళ్ళక్కావలన్ మఠంలో నివసించేవాడు. రామనాథపురం జిల్లాలోని కోవిలూర్, కన్నక్కుడిలో దొరికిన నాలుగు శాసనాలు ఆయన భూమిని, గ్రామాలను దానంగా పొందడం పేర్కొంటున్నాయి. (399—1944/5, క్రీ. శ. 1515; 525—1962/3, క్రీ. శ. 1555; 532, 524—1962/3). రామనాథపురం జిల్లా, తిరుపుత్తూరు, పిరన్మలైలోని రెండు శాసనాలు కల్లు మఠానికి చెందిన ఈశాన—శివుడిని పేర్కొంటున్నాయి. (178—1935/6, క్రీ. శ. 1504; 193—1924, క్రీ. శ. 1531). 213—1924, కి. శ. 1501, 'పాండినాట్టు ముదలియార్' అనే గురువును పేర్కొంటుంది. ఈయన రామనాథపురం జిల్లా, పిరన్మలైలోని అరబత్తుమూవన్ మఠానికి పీఠాధిపతి. తిరునల్వేలిలోని నెల్లియప్పర్ గుడి గోడలోని, తారీకులేని సుందరపాండ్యుడి శాసనం ఒకటి భిక్షామఠానికి చెందిన పశుపతి—రావళర్ శిష్యులైన 'నిరంగై ఆడువాన్', 'కల్లికడిం దక్కైయన్', 'తిరుజ్ఞాన సంబందర్'లను పేర్కొంటున్నది. (131, 132—1894; సౌ. ఇం. ఇ. V నెం. 420, 421) ఈ పశుపతి రావళర్ గోళకీవంశపు, లక్ష్మాధ్యాయి సంతానానికి చెందినవాడుగా 48—1928/9లో పేర్కొనబడిన పశుపతి—రావళరే.

## 2. జ్ఞానామృతాచార్యవంశము

ఈ వంశాన్ని గురించి చెప్పే శాసనాలన్నీ 13వ శతాబ్దం నాటివే. ఇవి అన్నీ కూడా తిరునల్వేలి జిల్లా, అంబా సముద్రం తాలూకా, తిరువాలీశ్వరంలోని వాలీశ్వరాలయపు గోడలమీద ఉన్నవే. ఈ వంశానికి గోళకీవంశంతో సంబంధం ఉన్నదనేది 359, 361, 364—1916ల వల్ల స్పష్టమవుతోంది. అఘోరదేవుడు లేక శాలన—శియన్ అనే గురువు గోళకీ మఠానికి చెందిన జియిర్ సంతా

నానికి చెందినవాడని మారవర్మన్ సుందరపాండ్యుడి శాసనాలు చెపుతున్నాయి (358—1916); తత్పురుష దేవుడనే ఇంకొక గురువు కూడా ఉండేవాడు. (364—1916), ఈ అఘోరదేవుడే జటావర్మన్ సుందరపాండ్యుడి శాసనాలలో జ్ఞానామృతాచార్య వంశానికి చెందినవాడుగా చెప్పబడిన అఘోరదేవుడై వుంటాడు. (359, 361—1916). దీనినిబట్టి జియర్ సంతానము, జ్ఞానామృతాచార్య సంతానము ఒకటే అనిపించుతుంది. ఈ వంశాలు గోళకీ మతానికి చెందినవనే విషయాన్ని కూడా ఈ శాసనాలు ధ్రువపరుస్తున్నాయి. 359—1916 పుగళిప్పెరుమాళ్ అనే గురువు తిరువాలీశ్వరంలోని వాలీశ్వరాలయంలో "తిరుజ్ఞానం"ను బోధించినందుకు ఫలంగా కొంతభూమిని దానంగా గ్రహించినట్టు చెపుతుంది (వివరాలకు చూ॥స్వామి, 1971)

## 3. తిరుచ్చట్టిముఱ్ఱం వంశం

ఈ వంశం గురించి 13వ శతాబ్దంలో మనకు కనపడుతుంది. ఇది తంజావూరు జిల్లాలో వ్యాపించి వుండేది. దీనిని గురించి తెలిపే శాసనాలు ఎక్కువ రాజరాజు III, రాజేంద్రుడు III రాజ్యకాలాలనాటివే. అళగియ తిరుచ్చిత్రంబల — ముడైయార్ మతము, తిరుజ్ఞాన సంబంధ మతము (108, 109—1911) కూత్తాడువ్ నాయనార్ మతము (218—1908) ఈ వంశపు గురువుల్లకు చెందినవే. ఇంతేకాక పేరులేని మఠాలు కుత్తాలంలోను (495—1907) అగత్తియన్ పళ్లిలోను (504A—1904) ఉండేవి. ఈ రెండు ఊర్లు తంజావూరు జిల్లాలోవే. ఈ గురువులపేర్లు :

| | |
|---|---|
| జ్ఞాన—శివుడు | 398—1908 |
| సోమనాథదేవ ముదలియార్ | 108, 109—1911; |
| | 513—1904 |
| ఈశాన—శివాచార్యుడు | 220—1908 |
| పరిపూర్ణ—శివాచార్యుడు | 218—1908 |

ఈ వంశానికి చెందిన ఒక ఉపమతము నార్పత్తెణ్ణాయిరవన్ మతం అనేది తిరువావదుతురైలో కులోత్తుంగుడు II రాజ్యకాలంలో ఉండేది (150—1925, క్రీ. శ. 1111). తిరుచ్చి జిల్లా, తిరువణ్ణైక్క (జంబుకేశ్వరం)లోని తారీకులేని బహుశా 13వ శతాబ్దపు శాసనాలు రెండు ఇదే పేరుగల మతము అక్కడ ఉన్నట్లు పేర్కొంటున్నాయి. (486, 487—1908), ఆవూరుడైయన్ శోళకోన్ అనే అతను సన్యాసుల భోజనార్థం ఈ మతం కట్టించాడని వ్రాయబడింది (486—1908). ఈ మఠాలు తిరుచ్చట్టి ముఱ్ఱం వంశానికి చెందిన గురువుల ఆధిపత్యంకింద ఉండేవనే విషయము, నమశ్శివాయ—దేవర్ అనే ఆయన తిరువన్నైక్కావల్‌లోని నార్పత్తెణ్ణాయిరవన్ మఠానికి అధిపతిగా ఉండేవాడనే విషయం గమనింపతగినది. (**ARE, Part II, Para 53**)

## 2. నందికేశ్వర వంశము

ఈ వంశానికి చెందిన మఠాలు మధుర జిల్లా, వీరపాండిలోను (అముండ మతము, 422—1907) చింగల్పట్టుజిల్లా తిరువొట్రియారులోను (నందికేశ్వర మతం 239—1912) వేదగిరి—వారణాసి—పట్టిణం అనేచోట (మానం పెరియాన్ మతం, 560—1911) ఉండేవి. 'అఘోర—దేవుడు, అరియవ్రతం కొండ—ముదలియార్, జ్ఞానామృతదేవుడు క్రమంగా ఈ మూడు మఠాలకు చెందినవారు.

నందికేశ్వర సంతానము ఆముండ మతం అనేదానితో సంబంధం కలిగి వుండేది. ఆముండ మతం అనే పేరు ఆమర్దక మఠం యొక్క రూపాంతరమందివుంటే మహాగణపతినాయనార్ (569—1917]—మహాగణపతి భట్టు లేక స్వామిదేవుడు ఈయనే అయివుంటాడని తోస్తుంది. (465—1917) — దానికి చెందినవాడే అయివుండాలి. 15వ శతాబ్దానికి చెందిన ఈ రెండుశాసనాలు ఆయనకు ఉత్తరాపథంలోని గౌడదేశంలో గంగాతీరాన ఉన్న రాఢా—నరేంద్రిగ్రామంలోని ఆమర్దాశ్రమము సంబంధం ఉన్నదని తెలుపుతున్నాయి. ఆయన ఆమర్దాశ్రమాచార్య వంశము వాడని కూడ వ్రాయబడింది. [569-1917] ఈపేరు 'మత్తమయూర' తెగకు చెందిన రుద్ర—శివుడు స్థాపించిన (ఆమర్దక తీర్థనాథుడు) ఆమర్దాశ్రమాన్ని సూచిస్తోంది. రాఢ, నరేంద్రి అనేవి ఇప్పటి వంగరాష్ట్రంలోని ప్రాంతాలు. [ఎ. ఇ. **XXI** నెం. 37] మిరాషి ఆమర్దకము మాల్వాలో ఉన్నదని అంటారు. (1955)

## 5. కీళై మఠవంశము

ఈ వంశానికి చెందిన గురువులుకూడా ముదలియార్లు అని పిలువబడేవారు. వీరు తంజావూరు జిల్లా, తిరువారూరు (సెల్వ, తిరువారూరు) లోని మఠానికి చెందినవారు. ఇదే ప్రదేశంలో ఉన్న వడక్కీళ్ మతము, దానికి చెందిన గురువు వాగేశప్పెరుమాళ్ ముదలియార్లలో ఒకడు అవడంబట్టి ఈ కీళమఠమే అయివుండవచ్చు. (ముదలియార్పిళ్ళై వాగీశప్పెరుమాళ్) ఈ వంశం 13వ శతాబ్దంలో వ్యాప్తి చెందింది. మధుర, తంజావూరు, దక్షిణ ఆర్కాటు, తిరునల్వేలి, దీనికి సంబంధించిన గురువులు.

| | |
|---|---|
| కయిలాయదేవర్ లేక శివదేవుడు | విక్కిరమంగలం, మధుర జిల్లా (617—1926) |
| వామ—శివ ముదలియార్ | తిరువైగపూర్, తంజావూరు జిల్లా (56—1914) |
| ముదలియార్పిళ్ళై వాగేశప్పెరుమాళ్ | పామని, తంజావూరు జిల్లా (169—1926) |
| వాగీశ్వర—దేవుడు | చిదంబరం, ద. ఆర్కాటు జిల్లా [483—1920] |

పురప్పవళ— శివముదలియార్ సెర్మదేవి, తిరునల్వేలి జిల్లా [652—1916]

తిరునత్త పెరుమాన్ శివపాదహృదయుడి శిష్యుడు తిరువారూరు, తంజావూరు జిల్లా [131, 132—1894]

వందన్ దేవుడు " "

అస్త్రిదేవుడి శిష్యుడు

జటావర్మన్ సుందర పాండ్యుడి శాసనం ఒకటి అళగియ—తిరుచ్చిట్రంబలం—ఉడైయార్ అనే గురువు కీళై మఠానికి చెందినవాడనీ, ఈ మఠం తిరుప్పరికున్రంలోని గోళకీమఠానికి చెందినదనీ చెప్పడంవల్ల పైన పేర్కొనబడ్డ గురువులందరూ గోళకీవంశానికి చెందినవారని తెలుస్తోంది. [403—మధురై, రంగాచార్య] ఈ కీళైమఠం ప్రస్తావన తిరునల్వేలి జిల్లా, సెర్మదేవి శాసనంలోను [657—1916, క్రీ. శ. ? 1260] 131—1894 లోనుకూడా ఉన్నది. [సౌ.ఇం.ఇ. V నెం.420] ఈ రెండవదానిలో తిరునల్వేలిలో గోళకీ [భిక్షా] మఠానికి సంబంధించిన తెర్కిల్ మఠం ఉండేదని వ్రాయబడింది. తిరునల్వేలిలోని బహుశా 13వ శతాబ్దపు ఒక పాండ్యశాసనంలోకూడా ఈ కీళై మఠం ప్రస్తావన ఉన్నది. [131—1894]

## 6. మెయ్‌కండర్ వంశము

శాసనాల్లో ఈ వంశముగురించి మనం 15వ శతాబ్దంలో మొదటి సారిగా వింటాము. రామనాథపురం జిల్లా, తిరుపుత్తూరులోని తిరుత్తారీశ్వరాలయంలోని శాసనం ఒకటి 'తిరువంబలముడైయార్ మరియ జ్ఞానసంబందర్ మెయ్‌కండర్ వంశానికి చెందిన వాడనీ అక్కడి మఠంలో నివసించేవాడనీ ఓంగుకోయిల్ పురాణం అనే గ్రంథాన్ని వ్రాయడంవలన గుడి భూములనుండి కొంత ఆదాయం పొందాడనీ చెపుతుంది [180—1935/6, క్రీ. శ. 1484] ఈ శాసనంలోని మఠము ఇదే గుడిలో 25 సంవత్సరాల తరువాత చెక్కబడిన ఇంకొక శాసనంలో పేర్కొనబడ్డ మఠమే అయితే—అదే అయివుండడం సంభావ్యం—ఈ వంశం గోళకీ వంశానికి సంబంధించినది అని స్పష్టమవుతుంది. ఎందుకంటే దీనిలో లక్షాధ్యాయి వంశానికి చెందిన ఈశాన—శివాచార్యుడనే గురువు ఈ మఠంలో నివసిస్తున్నాడని ఉన్నది. [178–1935/6, క్రీ. శ. 1504]

తిరువణ్ణామలైలోని మెయ్‌కండ వంశానికి చెందిన సత్యజ్ఞాన దర్శనికి శిష్యుడైన తిరుమలై—నాయనార్ చంద్రశేఖరుడు ఇరసై—ప్పురాణం అనే ఇంకొక గ్రంథం వ్రాసినందుకు కొంత భూమిని దానంగా పొందాడు. [485—1937/8, క్రీ. శ. 1510] మఠం ఆదాయ వ్యయాల లెక్కలు వ్రాయడము, దేవుని విగ్రహం ఎదుట స్తోత్రాలు చదివించటము, పువ్వుల మాలలు అందేటట్లు చూడటము ఈ వంశానికిచెందిన షట్పైప్పెరుమాళ్ ధన్మకూట్టన్‌కు ఒప్పగించబడ్డాయి. [202—1935/6 క్రీ.శ. 1546] కాంచీపురానికి చెందిన జ్ఞాన—దేశికుని శిష్యుడైన మెయ్‌జ్ఞాన—మాముని అనే గురువు ఈ వంశానికి చెందిన వాడుగా పేర్కొనబడ్డాడు. [207—1936/7, క్రీ. శ. 15వ శతాబ్దము.]

పైన పేర్కొనబడిన గురువులలో ఒకడైన మఠాధిపతి మలైజ్ఞాన సంబందన్, పై పేరాగ్రాపులో పేర్కొనబడినవాడి కంటె వేరైనవాడు, ఒక 13వ శతాబ్దపు శాసనంలో కనపడుతున్నాడు. [522—1904, క్రీ. శ. 1235/6] ఈ విధంగానే ఇంకొక సత్యదర్శిని, క్రీ. శ. 1382లో పేర్కొనబడ్డాడు. [642—1904.] నల్లూరులో పరియనాట్టు మఠమును బహుమానంగా పొందిన మెయ్‌కండ నాయనార్ 380—1916లో పేర్కొన బడ్డాడు. (**S. 1590, Kollam 840**) వీరందరికీ మెయ్‌కండ వంశక్రమంలో అసందిగ్ధమైన స్థానాలు ఏర్పరచడం కష్టం. ఇంతేకాకుండా కొంతమంది రచయితలచేత మెయ్‌కండ వంశంలో చేర్చబడిన శివప్రకాశుడు, 164, 173—1935/6 లలో కనిపించేవాడే అయితే, ఆయన గోళకీ వంశానికి చెందిన భిక్షామఠానికి [లక్షాధ్యాయి] చెందినవాడై వుంటాడనే తీర్మానించ వలసివస్తుంది. [Anon 1962, అరుణాచల గౌండర్, 1964.]

## 7. అంత ప్రసిద్ధంకాని వంశాలు

శాసనాలు ఇంకా కొన్ని వంశాలను పేర్కొంటున్నాయి. కాని వీటిని గురించి ఎక్కువ తెలియదు. ఇవన్నీ గోళకీమఠానికి చెందినవేనా అని నిశ్చయంగా తెలియదు. కాని కొన్ని దానికి సంబంధించినవే అనే సూచనలున్నాయి. విషకంఠదేవర్, భట్టవీర వంశాల పేర్లను వింటాము. ఎల్లై యిల్లాద—దేవర్ శిష్యుడైన తవప్పెరుమాన్ వీటిలో మొదటిదానికి చెందినవాడు. మహాదేవుడి శిష్యుడైన అనపాయుడు రెండవదానికి చెందినవాడు. శివ—మూర్తి—కాట్టన్ [131—1894] బహుశా తిరునల్వేలి ఉడైయార్ అనికూడా పిలువబడేవాడు—అళగియ నాయకన్ వంశానికి చెందినవాడు, ఉయ్యక్కొండ దేవర్ శిష్యుడు. ఈ గురువులందరు తిరునల్వేలిలోని మాళిగై మఠంలో నివసించేవారు. అక్కడే తెర్కిల్ మఠమనే ఇంకొకమఠంకూడా ఉండేది. దానికి కీళైమఠం వారు ఆధిపత్యం వహించేవారు. వారిలో అఱమిరత్త—ప్పెరుమాన్ ఒకడు. ఇంకొక తెర్కిల్ మఠం మధురలో ఉండేది. అక్కడ తిరునల్వేలి—ఉడైమాన్ అనే గురువు ఉండేవాడు. ఆయన నీలకంఠ—శివుడి శిష్యుడు, [131, 132—1894; **S. II V. Nos, 420, 421.)**

మధురజిల్లా, తెన్‌కరై (శోలవందన్ దగ్గర)లోని మూలనాథ ఆలయంలోని తిరుజ్ఞాన సంబంధ మఠానికి పాండరంగనార్ వంశానికి చెందిన ఉమ్మైయోరు భాగర్ అధిపతి (126—1910, క్రీ. శ. 1281). తిరుచ్చెంగాట్టన్‌కుడిలో ఆండార్ — మరుద

ప్పెరుమాళ్ వంశము ఒకటి ఉండేది. దాని గురువులలో ఒకరు నమశ్శివాయదేవన్ (76—1922, క్రీ. శ. 1232). ఆండార్—ఎంపిరానార్ మఠములోని శెంబైక్కుడి ముదలియార్ వంశము రాజేంద్రచోళుని శాసనమొకదాంట్లో పేర్కొనబడింది (584—1908).

## 8. మొదలియార్ వంశము అని పిలువబడే వంశము

చోళరాజేంద్రుడు III కాలంలోను, పాండ్యరాజులు వీర పాండ్యుడు, కులశేఖరుడు I కాలంలోను వేయించబడిన కొన్ని శాసనాలు, కొంతమంది గురువులను వారి వంశాలను ఈ విధంగా పేర్కొన్నాయి :

| | |
|---|---|
| తిరుచ్చత్తిముట్టత్తు—ముదలియార్ | 218,220,392—1908 |
| సోమనాథదేవ ముదలియార్ | 109—1911 |
| పండరంగవనార్ సంతానత్తు ముదలియార్ | 126—1910 |
| భిక్షామడత్తు ముదలియార్ | 164—1935/6 |

ఈ విధమైన ప్రయోగం విజయనగర రాజ్యకాలంలో కూడా కొనసాగింది :

తిరుప్పణ వాసల్ ముదలియార్ [523—5—1962/3]

ఆచార్య అనే సంస్కృత పదానికి బదులు ముదలియార్ అనే తమిళ బిరుదు [ఆజ్ఞాపించేవాడు, నాయకుడు, అందరికీ పైవాడు, గురువు అనే అర్థంలో] 13వ శతాబ్దపు శాసనాలలో తరుచు ఉపయోగించబడుతూ ఉండేది. తవప్పెరుమాళ్—మడత్తు—ముదలియార్ అంటే అర్థం తవప్పెరుమాళ్ మఠపు ఆచార్యుడు అని మాత్రమే. [108—1911]. ఇదేవిధంగా పండరంగనానర్ సంతానత్తు—ముదలియార్ అంటే పండరంగనానర్ సంతానానికి చెందిన గురువు అని. అందువలన శాసన పరిభాషలో కనిపించే ముదలియార్ అనే పదం కేవలం గౌరవ వాచకమే గాని, ఏదో ఒక కులాన్నిగాని, మత శాఖనుగాని, జాతినిగాని సూచించేదిగా అనుకోకూడదు. [రాజమాణిక్కమ్, 1958]. గోళకీ మతానికి సంబంధించిన వంశాలకంటే వేరైన తమిళదేశపు దేశీయవంశాలు ఉండేవనడానికి ఏ విధమైన ఆస్కారములేదు.

## 9. గోళకీ సంబంధమైన వంశాల గురించిన పరిశీలన సారాంశము

గోళకీ మతాచార్యులు ఉత్తర భారతమునుంచి ఆంధ్రదేశానికి, తమిళదేశానికి రావడం 10వ శతాబ్దంలో ప్రారంభమయి వుంటుంది. రాజరాజు I రాజగురువు ఈశాన—శివుడు, ఈ శతాబ్దపు ఉత్తరార్థంనాటికే తంజావూరులోని రాజరాజేశ్వరాలయంలో నెలకొని ఉన్నారు. [సౌ. ఇం. ఇ. II నెం. 9, 90, 91] ఈతని తరువాత రాజైన రాజేంద్రుడు I గురువు సర్వ—శివుడు [సౌ. ఇం. ఇ. II. నెం. 20]. ఈ రాజే ఈయన శిష్యులకు, ప్రశిష్యులకు—వీరందరూ, ఆర్యదేశము, మధ్యదేశము, గౌడదేశమునుంచి వచ్చిన వారే—వసతులను కల్పించి తన రాజ్యంలో స్థిరనివాసము ఏర్పాటు చేసినవాడు. రాజేంద్రుడికి ఉత్తరదేశంతో సంబంధము ఉండడము, 'టక్కణలాట' దేశాన్ని అంటే దక్షిణ రాఢదేశాన్ని జయించడము బట్టి ఇది అంత ఆశ్చర్యకరమైన విషయముకాదు. [EI. IX page 283] ఈయన ప్రయత్నాలవల్లనే ఎంతోమంది శివాచార్యులు తమిళదేశంలో స్థిరనివాస మేర్పరచుకొన్నారు. [త్రిలోచన శివాచార్యుల సిద్ధాంత సారావళి పీఠిక చూ.]

తమిళదేశానికి శైవ గోళకీ శైవులు ఒకే కాలంలో రాలేదు; వారి ఈ దక్షిణదిశా ప్రయాణం ఎన్నో శతాబ్దాలపాటు జరిగింది. కొన్ని శాసనాలు ఈ విషయాన్ని స్పష్టంగా సూచిస్తున్నాయి. జ్ఞాన—శివుడు అనే ఉమాపతిదేవుడు, గోస్వామి మిశ్రుని సోదరుడైన శ్రీకంఠ శంభువు చెంగల్పట్టు జిల్లా, అరపాక్కంకు, తంజావూరు జిల్లా, అచ్చుత మంగలంకు 13వ శతాబ్దంలో వచ్చారు. [20—1899, 402—1923] 13వ శతాబ్దపు శాసనాలు ఈ విధంగా వలసవచ్చినవారి మొదటి ఊళ్ళను, వారి మతశాఖలను స్పష్టంగా పేర్కొంటాయి. ఉత్తరాపథంలోని ఉత్తరరాష్ట్రంలోని ఉత్తర గ్రామంనుంచివచ్చిన సోమనాథుడు [స్వామిదేవర్] ద. ఆర్కాటు జిల్లాలోని చిదంబరంలో స్థిరనివాస మేర్పరచు

కొన్నాడు. [9—1935/6 క్రీ. శ. 1219] గోళకీవంశపు, లక్షాధ్యాయి సంతానానికి చెందిన ఈశాన—శివ—రావళర్ ఆర్యా పథంనుంచి వచ్చి, రామనాథపురం జిల్లాలోని పిరన్మలైలో నివాస మేర్పరచుకున్నాడు. [209—1924? క్రీ. శ. 1226], దక్షిణ—రాఢ దేశం నుంచి వచ్చిన గంగోళి—ఈశ్వర—శివుడు చిదంబరంలో నివసించేవాడు. [105—1934/5, క్రీ. శ. 1552] అక్కడనుంచే బహుశావచ్చిన గంగోళి—జ్ఞాన—శివుడు [స్వామిదేవర్] ద. ఆర్కాటులోని తిరువణ్ణామలైలో నివాస మేర్పరచుకొన్నాడు. [242—1939/40 క్రీ. శ. 1235] ఉత్తరాపథంలోని కళర్‌కు చెందిన ఈశ్వర—శివుడు రామనాథ పురం జిల్లాలోని అరణ్యకై—శిరువాయర్‌లో నివసించాడు. [47—1924, క్రీ. శ. 1294].

గోళకీ శాఖకు చెందినవారేకాక ఇంకొక శైవశాఖ అయిన ఆమర్దకాశ్రమానికి చెందిన గురువులు కొద్దిమందికూడా దక్షిణ దేశానికి వచ్చేవారనే విషయం గమనింప తగినది. ముందే చెప్పబడి నట్లు 'మత్త—మయూర' తెగకు చెందిన రుద్ర—శివుడనేఆయన దీనిని స్థాపించాడు. గౌడదేశంలోని రాఢ—నరేంద్రిగ్రామంనుంచి వచ్చిన ఆమర్దకాశ్రమానికి చెందిన* మహాగణపతి నాయనార్, 15వ శతాబ్దంలో తిరునల్వేలి జిల్లా, కుట్రాలంలో నివాసించాడని మనం వింటాం (465, 569—1917) మధుర జిల్లాలోని రెండు శాసనాలు జ్ఞానమూర్తి దేవుడిని (560—1911) అఘోరదేవుడిని (422—1907) పేర్కొంటున్నాయి. వీరిద్దరు ఆముండ మఠానికి చెందినవారని చెప్పబడుతోంది. ఆముండ అనేది ఆమర్దకకు వికృతి రూపమైతే, దీనికి గోళకీ మఠంతోగల సంబంధం ఉండడం సంభావ్యం అవుతుంది. కాని ఇక్కడ ఈ గురువుల ప్రభావం అంతగా ఉన్నట్లు కనపడదు.

గోళకీ మతం ఇందుకు విరుద్ధంగా ఇక్కడ స్థిరపడడమే కాక 13వ శతాబ్దంలో అనేక వంశాలుగా వ్యాప్తి చెందింది. (బొమ్మ 1.) ప్రధాన కాండమైన లక్షాధ్యాయి (భిక్షా) వంశము 11వ శతాబ్దంనుంచి 16వ శతాబ్దం వరకు ఏవిధమైన విఘ్నముా లేకుండా కొనసాగింది. ఈ 13వ శతాబ్దంలో 'సంతానా'లని పిలువబడే అనేక ఉపశాఖలు పుట్టాయి. వీటిలో 12వ శతాబ్దం పూర్వార్ధంలో పుట్టిన తిరుచ్చత్తి ముట్ర సంతానం 200 సంవత్సరాల వరకు పెరుగుతూనే వున్నది. నందికేశ్వర, మాళిగై మఠం, కెంబైక్కుడి, మరుడప్పెరుమాళ్, పండరంగవాసర్ శాఖలు 13వ శతాబ్దం మొదటి సగంలో పుట్టి, ఆ శతాబ్దం చివరకే అంతరించి పోయాయి. కాకపోతే ప్రధానశాఖ అయిన లక్షాధ్యాయి వంశంలో లీనమైపోయి వుంటాయి. కీళైమఠ సంతానం 13వ శతాబ్దం మధ్యలో పుట్టి తర్వాత శతాబ్దమంతా వర్ధిల్లింది. కాని ఆ తరువాత దానిని గురించి మనం ఏమీ వినము.

మెయ్‌కండర్ కాలం 13 శతాబ్దంలో మధ్యభాగమని, రాజ రాజు III కాలంలో (485—1902, క్రీ. శ. 1232) చెక్క బడిన ఒక శాసనంబట్టి నిర్ణయించబడినా, ఆయనపేరిటి వంశం గురించి మాత్రం మనం 16వ శతాబ్దంలోనే వింటాం. మెయ్ కండర్ కాలానికి, ఆయన పేరుమీద వంశం స్థాపించబడడానికి మధ్య 200 సంవత్సరాల అంతరం ఉండడానికిగల కారణాలను చెప్పడం కష్టం. సాంప్రదాయక గ్రంథమైన తిరువావడుమలై ఆధీనమ్ (Anon; 1962; మీనాక్షి సుందరం పిళ్లై, 1950) అరుణంది దేవర్, 'శివాజ్ఞానబోదమ్' మెయ్‌కండర్‌నుంచే నేర్చు కున్నారని, ఈ గురు—శిష్య పరంపర అరుణంది దేవర్‌నుంచి క్రమంగా మరైజ్ఞాన సంబందన్, ఉమాపతి, అరుణమశ్శివాయ, శివప్రకాశులద్వారా నమశ్శివాయ (పంచాక్షర దేశికుడు) వరకు కొన సాగిందని అసందిగ్ధంగా చెపుతుంది. ఈ నమశ్శివాయ దేశికుడే తిరువావడుమలై — ఆధీనం స్థాపించాడని చెప్పబడుతోంది. పై పరంపరలోని మరైజ్ఞాన సంబందర్ 522—1904 (క్రీ. శ. 1235/6)లో పేర్కొనబడినవాడే అయివుండాలి గాని ఈ పరంపరలోని ఇతర గురువులను శాసనాలు పేర్కొనవు. అదే విధంగా శాసనాలలో కనపడే గురువుల పేర్లు ఆధీనం గ్రంథాలలోని వంశావళులలో కనిపించవు. కాని మెయ్‌కండ, తిరువావడుమలై వంశాలు రెండు మెయ్‌కండర్‌కు అనంతర కాలపువే. రెండూ కూడా లక్షాధ్యాయి (భిక్షా) వంశానికి అత్యంత సన్నిహితమైనవని తెలిపే లక్షణాలు గలవే. వీటిలో మొదటి వంశానికి చెందిన శివ ప్రకాశుడు భిక్షామఠానికి చెందినవాడు (164—1935/6); తిరువావడుమలై ఆధీనంలో చెప్పబడిన పంచాక్షర—దేశికుని గురువైన శివ ప్రకాశుడు ఈయనే అయివుంటాడు. ఈ తిరువావడుమలైకి చెందిన గురువులు, దేశంలో అనేక స్థలాలలో వ్యాపించి స్థాపించబడిన మఠాలు ఇప్పుడుకూడా శ్రీ—ల—శ్రీ అనే గౌరవ సూచకమైన అక్షరాలను ఉపయోగించుతాయి. ఇది శ్రీ లక్షాధ్యాయి శ్రీ అనే దానిని సూచించే పొడి అక్షరాలే కాని వేరుకాదు. (శ్రీమల్లక్షాధ్యాయితో పోల్చిచూడండి. ఎస్.ఎస్.కోలార్ ఎ.క. X, (క్రీ.శ.1285) ఇది గోళకీవంశానికి చెందిన లక్షాధ్యాయి (భిక్షా) మఠంతో దీనికిగల సంబంధాన్ని స్పష్టంగా సూచిస్తోంది.

---

* మహాగణపతి అనేది ఈ సందర్భంలో యోగసిద్ధులలో ఒక సిద్ధిని సూచిస్తుంది. (చూ॥ కౌండిన్య, 1.27—8.) అందుచేత ఈ పదాన్ని దక్షిణదేశంలో ప్రసిద్ధ దేవుడైన వినాయక పిళ్లైయార్‌గా గుర్తించ కూడదు.

[ఇంకావుంది]

"ము కా రా ం"

# చైతన్య లహరి

దరిశన మీయ గలడా వాడు
రాయిగా మారిననాడు

ఎవడోవాడు. దయగలవాడు. కాపాడేవాడు. ఎప్పుడూ తోడు వుండేవాడు. వాడి పుట్టుకతో పనిలేదు. వివరణల వక్రతర్కా లవ సరంలేదు. అయినా వాడు నాక్కావలసినవాడే. నమ్మకపు నిశ్చింత లలో మేల్కొనే వాడికి.

అయినా నా బాధ్యత నే మరువను. మరువమని నన్నెవరూ అడగలేదు. బాధ్యతలకు ముందు బాధ్యత లెరిగినవారూ అడగలేదు. అడిగి ఎవరూ తెలుసుకోనూలేదు. అయినా నా బాధ్యత నాదే. నాబరువు నాదే. లేనివాడు లేకపోయినా, లేనివాణ్ణే కల్పించుకొని బాధ్యతల దించుకుందుకు ప్రయత్నిస్తాను. త్వమేవ శరణమంటాను. ఇది నైచ్యవలయ విభ్రమణమో, పరిభ్రమణమో......

నామోత మోసేవాడు, నా మాలిన్యాన్ని కడిగేవాడు వుంటే నా బరువు పెంచుకుందుకా, నా పాపాల జీర్ణానికా. అంటే వున్నా డన్న మూడోవాడు మొదటివాడే. అన్న నమ్మకం రెండోవాడికుంటే బరువు పెంచినా దిగుల్లేదు. మోసేవాడు మొదటివాడవుతాడు. అంటే వున్న సత్యాన్ని అన్ని అవస్థలలో (జాగృదాది అవస్థలు) ఎవరు కాదన్నాకూడా నలుగురి భ్రమల్లో నేనూ వుండిపోతాను. అంటే భ్రమ నాకు భ్రమకాదు. అదొక తృప్తి, ఆత్మ సంతృప్తి.

నువ్వు చాలా పెద్దవాడివి. చెట్టంతవాడివి. పుట్టంత వాడివి. కాండవు నువ్వే. కోనవు నువ్వే. తల్లిలోనూ నువ్వే. చెలిలోనూ నువ్వే. నువ్వు 'అది', నువ్వు 'ఇది' అని మటుకు నే చెప్పగలనా? చెప్పే స్థితి ఏది? అంటే నాస్థితి......

ఆద్యంతాలులేని పుస్తకాన్ని. కథ ఎక్కడ మొదలయిందో తెలియదు. ముగింపు ఏమిటో అంతకన్నా. అయినా నే పూర్తి కాలేదు. నేనూ ఈమధ్య పేజీల్లో ఎక్కడో వున్నాను. అంటే కనీసం ఈ విషయం గుర్తించదలిచాను. ఎప్పుడూ ఎందుకో ఏదో చేయాలనుకుంటాను. అది ఇది. అదే అది. ఆ 'ఆశ', ఆ 'తృష్ణ'. అవే నేను. కాని నేను నేనుకాను. నాలో కొరత. నాలో కరువు. నాలో వెలితి. వీట్నే పూరించటానికి నే చేసిన ప్రయత్నం. అందుకు నే ఏం చెయ్యాలి? ఏది చెయ్యాలి? ఏది చేయకూడదు? ఎందుకు చెయ్యాలి? ఎందుకు చేయకూడదు? ఈ ప్రశ్నావర్షంలో తడిసి బాగా జలుబుచేసి, జ్వరానపడి ఇప్పుడిప్పుడే కోలుకుంటున్న స్థితి నా పరిస్థితి.

చైతన్య మిత్యే తదక్షర మిదం సర్వం
తస్యోప వ్యాఖ్యానం భూతం భవిద్భవిష్యతి
సర్వం చైతన్య మేవ.

నేను నేను కానిది. నాన్నైపు నే చూసుకుంటున్న సమయ మిది. అంటే నేను నేను కాని దానితో సంబంధాలు పెట్టుకున్నా. పెంచుకున్నా. అంటే నన్ను నేను తెలిసికొనుటకు లేక పొందుటకు తపన. ఫలితం...

నేను కానిది చైతన్యం. అయినా నిత్యచైతన్యంతోనేను ఈ చైతన్య అవకాశాన్ని చైతన్యాకాశంలోకి దారిగా వుపయోగించాలను కున్నా. ఆ చైతన్యం పూర్ణరూపం. పరిపూర్ణంకూడా. ఈ చేతన చేతనాత్మక సమస్త ప్రపంచమున్ను ఆ చైతన్యంయొక్క సమగ్ర స్వరూపాన్నే తెలియచేస్తుంది. నన్నుగానీ ఇతరులను గానీ, సత్యమును కానీ అసత్యమును కాని యేమియును తెలిసి కొనకుండుటచేత నిజమును అంటే నాలోని నన్ను అంటే నేను కాని దానిని తెలిసికొనక పోవుట అజ్ఞానమే అవుతుందను కోవడంలో తప్పులేదు. ఆ చైతన్యమే భూమి వాయువాది పంచ భూతాలకు శక్తి ప్రసాదిస్తుందని కొందరంటారు. 'భ్రమ'; కేవలం 'మిథ్య' అని అనేవారూ లేకపోలేదు. అదే కొన్ని సమ యాల్లో 'ప్రకృతిమాయ' గా సమయానుకూలంగా ఒక దర్మంగా, అవకాశాల్నుబట్టి అనేక ధర్మాలుగా, మార్గాలుగా, పలు వాదాలుగా కూడా.

నా గురించి నాకు తెలియనపుడే అనుకున్నాను నేను నేను కాని వాణ్ణని. నా పుట్టుక గురించి ఇతరులు అనుకునేవరకు నేననుకోలేదు. ఇతరులు పిలిచేంతవరకూ నా పేరు నాకు తెలియదు. అందుకే అనుకున్నాను, అన్నాను నేను నేను కాని వాణ్ణని. నా పుట్టుకకు అందుకే సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, సర్వోపగతుడు కారకుడంటున్నారు. అలాంటివాడున్నప్పుడు వాడూ చైతన్యమే. పరిపూర్ణ చైతన్యం. అంటే నేనూ చైతన్యం నేను కానిది అయినపుడు తనూ చైతన్యం తనుకానిది కావాలి— అంటే అతనూ అతను కాడు. కాజాలడు—అంటే చైతన్యం పూర్ణరూపం దాల్చినపుడు నా మాదిరిగ, నేను నాకేసి చూసుకున్నట్లుగ తను తనకేసి చూసుకోవాల్సిన అవసరం లేదు. అంటే చూసుకోడు. రెండోవాళ్ళను చూస్తుంటాడు. అతనే మొదటివాడు.

నా ప్రయత్నం ఎప్పుడూ నేను కానిదానితోనే. నేను నమ్మిన దాన్ని, నాకు మంచిదని ఏది తోచితే వీలునుబట్టి అలా చేసుకుం

టాను. అది ఇదనీ ఇది అదనీ సూక్ష్మంగా నిర్ణయించి స్థూలంగా వివరించడానికి నే నిప్పు డే ప్రయత్నమూ చేయలేదు. వాటి జోలికి పోకూడదు.—అంటే భావార్థాలు, నిగూఢార్థాలు, విశేషార్థాలు చాలా వుంటాయి. విషయాలు వేరౌతాయి. పరిస్థితులు తారు మారౌతాయి. అది నా 'స్థితి' ని దాటుతుంది. ఆ 'స్థితి' ని చేరుకునేవరకు చేసే ప్రయత్నం మనది. మన ప్రయత్నాంతంలో ఆ 'స్థితి' ప్రారంభమవుతుంది. ఆ ప్రారంభంలో మన అంత ముంది. ఇది కాలాని కతీతంగా వుంటుంది.

అపుడు నాలో వెలితిలేదు. కొరత లేదు. తపనలేదు. ఎవరో యిస్తారనేది లేదు. రాసి పెట్టిందీ లేదు. నా బరువు నాదే. నా బాధ్యతలు నావే. అయినా ఏదో తృప్తి. ఏదో తెలియని నిండుదనం. కారణం... ప్రతిదీ వివరించి నిర్ణయించి రూపు రేఖలను దిద్దే మొదటి వాడొకడున్నాడా? వుంటే ఆదుకుంటాడు. మంచిని వివరించి మార్గాన్ని నిర్ణయించుకోమంటాడు. భ్రమ కాదు. బాధ్యత.

కొంత ఆగమ ఆదేశ వివరణ సవరణలతో.

దరిశన మీయగలడు వాడు
కర్మక్రమం తప్ప నపుడు.

# ఎత్తిపోతల రంగనాథస్వామి!

## శ్రీ పి. ఎస్. శాస్త్రి

ఇదంతా శిలలమయం
ప్రాచీన శిథిలాలమయం
చుట్టూ మూసుకు వస్తున్నట్టున్న కొండలూ,
ఎదురుగా కొద్దిగా తెరుచుకున్నట్టున్న రాళ్ళ రాక్షసినోళ్ళు!
ఆ రాళ్ళ నోళ్ళల్లోంచి ప్రవహించే
ఎత్తిపోతల జలపాతపు నీళ్ళు!
గుడి శిఖరం మీదుగా పగిలిన బండలు
గుడిచుట్టూ ఎండిన ముండ్ల మొక్కలు.
ఎలా వుంటున్నా విక్కడ ఒంటరి దేవుడూ?
ఎలా వుంటున్నావు?
చుట్టూ అంధకారమయమైన గుహలు,
అందులో అప్పుడప్పుడు కదిలే గుడ్లగూబలు,
కదిలికైతే రొదచేసే గబ్బిలాలు,
అంతు తెలియని బిలాలు!
భయంకరమైన ఏకాంతం,
బెదురు కలిగించే నిశ్శబ్దం!
ఎలావుంటున్నా విక్కడ ఒంటరి దేవుడూ?
ఎలా వుంటున్నావు?
ఉదయంతీసిన గుడితలుపులు
మూసుకుంటాయి సాయంత్రం.
రాత్రంతా, మళ్ళీ వుదయం సుప్రభాతం
పాడేవరకూ,
బిగించిన ఆ తలుపులమధ్య,
గత వైభవాల తలపులతో,
రెప్పపాటులేని చూపులతో,
ఒంటరిగా పాపం నువ్వు!
ఎలా వుంటున్నా విక్కడ ఒంటరి దేవుడూ!
ఎలా వుంటున్నావు?
అడవి పక్షుల సుప్రభాతాలే రక్షానీకు?
చుట్టూపూచే అడవిపూలే కవచాలా నీకు?
రోజూ పెట్టే మధ్యాహ్నపు నైవేద్యమే చాలా నీకు?
వారానికోసారివచ్చే విహారయాత్రికుల భక్తే తృప్తానీకు?
ఎలావుంటున్నావిక్కడ ఒంటరి దేవుడూ?
ఎలావుంటున్నావు?

# రైతు రాజులకు జేజేలు!

ఆహారధాన్యాలను అపారంగా పండించే ఆంధ్రప్రదేశ్ దక్షిణాది ధాన్యాగారంగా ప్రసిద్ధి చెందింది. చెఱకు, పొగాకు, నూనెగింజలు, మిరపవంటి పంటల ఉత్పత్తిలో మనది మిగులు రాష్ట్రం. ఇక ధాన్యం ఉత్పత్తిలో మన రాష్ట్రం దేశం అంతటికీ అగ్రభాగాన నిలిచింది. అనేక సంవత్సరాలుగా ఆహారోత్పత్తిని అధికతరం చేయడానికి ఆంధ్రప్రదేశ్‌లో ఆహారంగా కృషి జరుగుతున్నది. 20 సూత్రాల కార్యక్రమంలో 50 లక్షల హెక్టార్ల అదనపుసాగు లక్ష్యంగా నిర్ణయించారు. దీనికి మనవంతు చేయడానికి అవిరళంగా కృషి జరుగుతున్నది.

1965 లో అధిక దిగుబడినిచ్చే వరివంగడాలను చేపట్టడంద్వారా దేశం అంతటికి మన రాష్ట్రం మార్గదర్శకమయింది. మేలు రకం విత్తనాలను వినియోగించేటట్లు చూడడానికి నిరంతర నిర్విరామకృషి జరిగింది. 'జయ', 'సోనా', 'రత్న', 'జగన్నాథ్,' 'ఆర్. పి. 193 వంటి వరి రకాల పేర్లు ఇటీవల కాలంలో ఇంటింటా బహుళ ప్రచారంలోకి వచ్చాయి.

1950–51 లో 40.30 లక్షల టన్నులు ఉన్న ఆహారధాన్యాల ఉత్పత్తి 1964–65 నాటికి 77.04 లక్షల టన్నులకు, 74–75 సంవత్సరంలో 90.86 లక్షలకు చేరుకుంది. 1976–77 లో కోటి టన్నుల వరకు వుంటుందని అంచనా. అదే విధంగా సేద్యపు భూమి విస్తీర్ణం 1951 నుంచి 1974–75 వరకు రమారమి 12.4 శాతం పెరిగింది.

కార్యదీక్షతో కర్తవ్య పరాయణతతో ఆహార రంగంలో దిగుబడులను ద్విగుణీకృతం, త్రిగుణీకృతం చేస్తున్న రైతు రాజులకు జేజేలు! భారతజాతి వీరికి ఎంతో ఋణపడివుంది.

డైరెక్టర్,
సమాచార పౌరసంబంధశాఖ
ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్.

21/76–77

## కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

# బ్రౌన్ లేఖలు

ఆంధ్రసాహిత్య చరిత్రమున, ఆదియుగమున రాజరాజనరేంద్రుడు, మధ్యయుగమున శ్రీకృష్ణదేవరాయలువలె, ఆధునిక యుగమున నాంధ్రభాషోద్ధారకుడైన మహనీయుడు బ్రౌను. అట్టి బ్రౌనునకు సంబంధించినది ప్రస్తుత కృతి.

## బ్రౌన్ లేఖలు

ఈ లేఖలు సంశోధనచేసి సంకలనము చేసినది బంగోరె. పర్యవేక్షకుడు ప్రొఫెసరు జి. ఎన్. రెడ్డి. ఈ గ్రంథము తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము వారిచే ప్రకటితము. ఇది "ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర శకలాలు" అని పేర్కొనబడి గచ్ఛ ద్వ్యాఖ్యతో నున్నది. ప్రస్తావన ముందుమాటలు గలవు. ఇది గ్రంథ స్వరూపము. [1]

ఇది శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారు ముద్రించిన తెలుగు గ్రంథమేకాని, ఆ విశ్వవిద్యాలయమువారి తెలుగుశాఖా ప్రచురణముకాదు. అందు బ్రౌను పరిశోధక విభాగమునకు సంబంధించినది. దీని విషయమై 'ప్రస్తావన'లో జి. యన్. రెడ్డిగా రిట్లు చెప్పినారు :

"నేటి సామాజికావసరాలకు ఉపయోగపడే పరిశోధన సామగ్రి బ్రౌన్ సంపుటాల్లో ఎంతో నిక్షిప్తమై ఉంది............వీటి నన్నింటినీ వెలుగులోకి తీసుకురావాలనే ప్రయత్నానికి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఒక పరిశోధన విభాగాన్ని 1975 సెప్టెంబర్‌లో రూపొందించి దోహద మిచ్చింది". (పుట 7)

ఇందువలన నీ గ్రంథము ఆ విశ్వవిద్యాలయములో బ్రౌను పరిశోధక విభాగమునకు సంబంధించినది యనుట స్పష్టము—.

విశ్వవిద్యాలయ ప్రచురణలలో నొక ప్రత్యేక విభాగమునకు సంబంధించిన నా ప్రచురణలలో నా విషయము తెలుపుట పరిపాటి. కాని ప్రస్తుత గ్రంథమున నట్టి సూచనలేదు. ఈ గ్రంథమే గాక, "ఆంధ్రగీర్వాణఛందము" అను మఱియొక బ్రౌను గ్రంథమును నీ విశ్వవిద్యాలయమువారు ప్రకటించినారు. దానియందు నే సూచనయు లేదు. వాని ముఖపత్రముల నిట్లుండవలయును:

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము—
బ్రౌను పరిశోధన విభాగ ప్రచురణ— 1
బ్రౌన్ లేఖలు

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము
బ్రౌను పరిశోధన విభాగ ప్రచురణ—2
ఆంధ్రగీర్వాణ ఛందము.

ఇట్లే ఆంగ్లభాషలోకూడ నుండవలెను.

పై రెండు గ్రంథములు సమీక్షార్థమై నాకు పంపబడినవి. అందు మొదటిదియైన "బ్రౌన్ లేఖలు" అను గ్రంథము గూర్చినదే యీ సమీక్ష—దీని తరువాత రెండవ గ్రంథముచేయుదును.

అజ్ఞాతములై, అమూల్యములైన బ్రౌను ముద్రితాముద్రిత రచనలను వెలుగులోనికి దీసికొనివచ్చి, తెలుగువారి కందిచ్చుటకు, "బ్రౌను పరిశోధన విభాగము" అను ప్రత్యేక విభాగము నేర్పఱచి, కృషిచేయుచున్నందులకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారి నత్యంతము నభినందించుచున్నాను.

ఈ గ్రంథము విశ్వవిద్యాలయ ముద్రతో వెలువడిన పరిశోధన గ్రంథము కాబట్టి—విశ్వవిద్యాలయ పరిశోధనా పద్ధతుల స్థాయినే దీనిని సమీక్షించుచున్నాను—

## గ్రంథము పేరు

ఈ గ్రంథముపేరు "బ్రౌన్ లేఖలు" అని హలంతముగా నున్నది. బ్రౌను ఈనాడు కాదు. ఇప్పటి కరువది యేండ్లనుండి ఆంధ్రసాహిత్యలోకమునకు పరిచితుడు—గ్రంథములయందేమి, వ్యాసములయందేమి ఆతని ప్రసక్తి వచ్చినప్పుడు 'బ్రౌను' అనియేగాని, 'బ్రౌన్' అని కన్పట్టదు—బ్రౌనుగూర్చి ప్రథమముగా తెలుగువారికి పరిచయము చేసిన కీర్తిశేషులు ప్రభాకర శాస్త్రులు గారెప్పుడును, నెచ్చటను 'బ్రౌను' అనియే తప్ప వేఱు రూపము వాడలేదు. సూర్యరాయాంధ్ర నిఘంటువున— ప్రథమ సంపుటము సంకేత వివరణ పట్టికలో నిట్లున్నది :

101. బ్రౌ. బ్రౌణ్యనిఘంటువు. బ్రౌను దొర (పుట8)

## -బ్రౌను-భారతి-

బ్రౌనుగూర్చి తెలుగువారికి విశేషముగా తెలిపినది భారతియే—అందు 'బ్రౌను' అని తప్ప వేఱురూపము కానరాదు.

1. బ్రౌన్ లేఖలు—సంశోధన బంగోరె. పుటలు 166—వెల 12—50. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము తిరుపతివారిచే ప్రకటితము.

## వ్యాసములు

బ్రౌను జీవితము—నిడుదవోలు వేంకటరావు. అక్టోబరు 1929
బ్రౌనుదొర జీవిత—కొత్తపల్లి వీరభద్రరావు. ఫిబ్రవరి 1954
విశేషములు సేవ

బ్రౌను భాషాసేవ— ,, మార్చి 1954

బ్రౌను నిఘంటు— ,, ఏప్రియలు 1954
నిర్మాణము

బ్రౌను వ్యాకరణ— ,, ఆగస్టు 1954
రచన (ఒకరు)

బ్రౌను స్వీయచరిత్ర— నిడుదవోలు వేంకటరావు మే 1963

బ్రౌను ప్రశస్తి — ,, ,, 1963

ఒక్క బ్రౌన్ పేరే 'బ్రౌను' కాలేదు. పాశ్చాత్యుల నామము లన్నియు ప్రాయికముగా హలంతములుగానే యుండును. అవి తెలుగు భాషా సంప్రదాయము ననుసరించి అజంతములుగా మారును. అట్టి పాశ్చాత్యుల చరిత్రలు వ్రాసినపుడు వానిని అజంతములుగానే వ్యవహరింతురుగాని హలంతములుగా వ్యవహరింపరు. ఇట్టివాని కుదాహరణ లిచ్చుచున్నాను.

| | | | |
|---|---|---|---|
| జాన్ బనియన్ — | జాను బనియను | చరిత్ర | (1856) |
| కొలంబస్ — | కొలంబసు | ,, | (1857) |
| మాక్సు ముల్లర్— | మాక్సు ముల్లరు | ,, | (1900] |
| కాటన్— | కాటను | ,, | (1901) |
| అబ్రహామ్ లింకన్— | అబ్రహాము లింకను | ,, | |
| లివింగ్‌స్టన్— | లివింగ్స్టను | ,, | |
| స్టీవెన్సన్— | స్టీవెన్సను | ,, | |
| జార్జ్ వాషింగ్టన్— | జార్జి వాషింగ్టను | ,, | |

ఇవన్నియు ముద్రితములైనవే— (చూడుడు— ఆంధ్ర వాఙ్మయ సూచిక—ఆంధ్ర గ్రంథమాల ప్రచురణ 1927.)

ఇంత యెందులకు, క్రైస్తవ వేదమగు బైబిలునందు నామవాచకములన్నియు నాంగ్లమున హలంతములేయైనను తెలుగు బైబిలులో అజంతములుగా నున్నవి. విస్తరభీతిచే నుదాహృతులీయ లేదు. 'క్రైస్ట్'—అను పదమే తెలుగున 'క్రీస్తు' గా రూపొందినది. (క్రీస్తు చరిత్ర—జాషువా కవి)

ఈ గ్రంథమున పేరులోనే 'బ్రౌన్ లేఖలు' అని కాదు. గ్రంథమునగల 166 పుటలలోను 'బ్రౌన్' అని తప్ప వేఱు రూపము లేదు. ప్రస్తావనలోను 'బ్రౌన్' అనియే యుండుట చిత్రముగా నున్నది. ప్రస్తావనా రచయితలైన జి. యన్. రెడ్డి గారు భాషా శాస్త్రవేత్తలుగా ప్రసిద్ధి గన్నవారు. వారీ 'బ్రౌను' రూపమును నుట్టంకించి 'బ్రౌన్' అను రూపము వాడుకచేయుటకు గల కారణములను నిరూపించిన నెంతో సమంజసముగా నుండెడిది. కాని యట్లు జరుగలేదు. ఇది విశ్వవిద్యాలయ ప్రచురణ గావున నింతగా ప్రస్తావింపవలసి వచ్చినది.

'బ్రౌను లేఖలు' సరియగు రూపము—

బ్రౌన్ లేఖలు—సంపుటముల సంఖ్య—

బ్రౌన్ లేఖలు—అనగానే—బ్రౌను ఇతరులకు వ్రాసినలేఖలు అని పాఠకలోకమునకు స్ఫురింప వచ్చునుగాని ఆ లేఖలట్టివి కావు. బ్రౌను లేఖలలో ఆతడు స్వయముగా వ్రాసిన లేఖలు తక్కువ. వీని యందు హెచ్చు భాగము, తన సమకాలీన పండితులు, కవులు వ్రాసినవి. తదితర యుద్యోగులు వ్రాసినవి అయియున్నవి—బ్రౌను తనకు వ్రాసిన జాబుల నన్నింటిని జాగరూకతతో కొన్ని సంపుటములుగా సంతరించి భద్రపఱచినాడు. ప్రస్తుత గ్రంథములోని లేఖ లీ సంపుటములనుండి గ్రైకొనబడినవియే. ఈ విషయము సంకలనకర్తయైన బంగోరె తన "ముందుమాట"లులో తెలిపియే యున్నాడు.

అయితే బ్రౌను లేఖల సంపుటము లెన్నియను సంగతి యీ గ్రంథము మూలమున తెలియరాదు. పర్యవేక్షకులకు, గ్రంథ సంధాతలకుకూడ సందేహమే. చూడుడు—.

ప్రస్తావనలో శ్రీ జి. యన్. రెడ్డి—

"ఆ నాడు తెలుగుదేశంలో వివిధ ప్రాంతాల్లోని పండితులతో, విద్వాంసులతో తాను సాగించిన ఉత్తర ప్రత్యుత్తరాలిని, ఇంకా ఇతర రకాల జాబుల్ని 20 సంపుటాల్లో ఒక్కొక్క సంపుటంలో సుమారు 400 పుటలు కలవి భద్రపరచిపోయాడు" (పుట 6)

పై దానిని బట్టి పర్యవేక్షకుల యభిప్రాయము ననుసరించి బ్రౌను లేఖల సంపుటములు 20.

ముందు మాటలలో శ్రీ బంగోరె—

"బ్రౌన్ సేకరించి పెట్టిపోయిన దాదాపు 6—7 వేల పేజీల్లోవున్న ఈ జాబులు నేను ప్రత్యేకంగా అభిమానిస్తూన్న విభాగం.............................................
......దాదాపు పదేళ్ళక్రితం ఆం. ప్ర. సాహిత్య అకాడమీ వీటి ప్రాధాన్యం గుర్తించి ......... ఈ జాబుల్లో 16 సంపుటాలను మాత్రం కాపీ చేయించి భద్రపరచుకొని వుంది"

(పుటలు 13, 14)

---

1. ఈ వ్యాసమా సంవత్సరమున—'**Bombay Telugu-samachar**' అను పత్రికలో నాంగ్లభాషలోని కనువదింపబడి—ఆ పత్రికయందు ప్రకటింపబడినది.

పై వానినిబట్టి బ్రౌను లేఖల సంపుటముల వివరము లిట్లున్నవి :

| | | |
|---|---|---|
| పర్యవేక్షకుడు | సంపుటములు 20 | పుటలు 8 వేలు |
| సంశోధకుడు | ,, 16 | ,, 6–7వేలు |

సంశోధకుడు "ఈ జాబుల్లో 16 సంపుటాలు" అనడముచేత, ఆతనికి బ్రౌను జాబుల సంపుటములెన్నో తెలియవని స్పష్టమగుచున్నది. పర్యవేక్షకునిమాట యటుండనిచ్చి బ్రౌను గూర్చి ప్రత్యేక పరిశోధన చేయుచున్న గ్రంథకర్తకుకూడ ఆతని లేఖల సంపుటములను గూర్చి తెలియకపోవుట చిత్రము. ఆతడు బ్రౌను రచించిన గ్రంథములనుగూడ పరిశీలింప నట్లు పై వ్రాత వ్యక్తము చేయుచున్నది.

బ్రౌను తన తెలుగు, ఇంగ్లీషు నిఘంటువున తన లేఖల సంపుటములను గూర్చి యీ క్రింది విధమున తెలిపినాడు—

**Letters a Collection of Telugu Correspondence in ten volumes; quarto; many of these were addressed to me; a portion has been printed in the Telugu Reader, the volumes were bestowed by me on the college library.**

**On the names of books quoted in the Distionary** పుట **XVIII.**

**(Telugu-English Dictionary) (1852)**

ఇందువలన బ్రౌను లేఖల సంపుటములు పది.

ప్రస్తుత గ్రంథకర్త బ్రౌను తెలుగు, ఇంగ్లీషు నిఘంటువు చూడక పోవుటచేత, బ్రౌను జాబులను గూర్చిన పై ఆంగ్ల వివరము లీ గ్రంథమున నీయనేలేదు. ఈ గ్రంథములోనే కాదు—ఇప్పటికి రమారమి నాల్గేండ్ల క్రిందట— అనగా క్రీ. శ. 1973లో ఆతడే ప్రకటించిన "బ్రౌన్ జాబులు — తెలుగు జర్నలిజం చరిత్ర" అను గ్రంథములోకూడ పై బ్రౌను ఆంగ్ల వాక్యములు లేవు—

ఆ గ్రంథమున కూడ—"మొత్తం 16 సంపుటాలున్నాయి" అని వ్రాయబడినది (పుట. 8—ముందుమాట) ఇందువలన నాతడెన్నడు బ్రౌను తెలుగు, ఇంగ్లీషు నిఘంటువు విప్పి చూడలేదని స్పష్టమగుచున్నది.

గ్రంథకర్త బ్రౌను జాబులను గూర్చియే పరిశోధన చేయుచున్నప్పుడు—ఆ జాబుల సంపుటముల వివరములను తెలుపుట—యాతని ప్రథమ కర్తవ్యమై యున్నది. అసలు గ్రంథకర్తకు జాబుల సంపుటములెన్నో తెలిసిన కదా. వివరము లిచ్చుటకు? అందుచే, నీ గ్రంథమునలేవు. విశ్వవిద్యాలయ ప్రచురణమున నిట్టి పరిశోధనా ప్రధాన ధర్మము విస్మరింపబడుట కరము విచారకరము.

## విషయసూచిక

ఈ గ్రంథమునకు "బ్రౌన్ లేఖలు" అని పేరున్నందున విషయసూచికయందు లేఖల వివరములుండునని పాఠకు లూహింప వచ్చును. కాని యిందట్లు లేదు. విషయ సూచికకు, గ్రంథనామమునకు సంబంధములేదు—**చూ**డుడు—

## విషయసూచిక

1. విదేశీయులకు తెలుగు **బో**ధించిన తొలి ఉపాధ్యాయులు.
2. మహాభారత సంశోధిత ముద్రణకు అంకురార్పణ చేసింది బ్రౌనే.
3. పల్నాటి వీరచరిత్ర కావ్య పరిష్కరణ — బ్రౌను పరిశ్రమ.
4. వ్యాఖ్యాన సహిత వసుచరిత్ర మొదటి ముద్రణ.
5. వేమన పద్యాల పరిష్కరణకు బ్రౌనుపడ్డ తంటాలు.
6. తెలుగు నిఘంటు శాస్త్ర పారంగతుడుగా బ్రౌన్.

పై శీర్షికలలో లేఖల ప్రశంస లేకపోవుటచే కాబోలు గ్రంథనామము సార్థకము చేయుటకు ఒక అనుబంధములో "బ్రౌన్ రాసినవే మరి రెండు లేఖలు"—ప్రకటితములైనవి.

రెండవ అనుబంధమున "టూకీగా బ్రౌన్ జీవితకథ" అని "బ్రౌను జీవిత చరిత్ర" వ్రాయబడినది.

బ్రౌను జీవిత చరిత్ర వాస్తవముగా బ్రౌన్ లేఖలకు సంబంధించినదికాదు. బ్రౌను చరిత్ర అతి సంగ్రహముగా తెలుపవలెను. అందుచే నీ గ్రంథములో దానికి చోటు లేదు. ఇందది 34 పుట లాక్రమించినది—అది ప్రత్యేక గ్రంథముగా ప్రకటింపదగినది గాని 'టూకీగా' ఒక గ్రంథమున చేర్చదగినది కాదు.

## గ్రంథ రచన-అవ్యవస్థ

విషయ సూచికకు, గ్రంథనామమునకు సంబంధము లేదని ముందు తెలిపితినికాని గ్రంథకర్త విషయసూచికలోని ఆ యా శీర్షికలకు బ్రౌను లేఖలతో సంబంధము గల్పించి యున్నాడు. ఆతడే ముఖ పత్రమున "బ్రౌన్ లేఖలు" "గచ్ఛ ద్వ్యాఖ్య" తో కూడినవి అని తెలిపినాడు—అనగా, ఆ యా లేఖలపైని ఆతడు వ్యాఖ్యానము వ్రాసినాడని యర్థము—అట్లయినప్పుడు లేఖ మొదట యిచ్చి, ఆ వెనుక వ్యాఖ్యానము నిచ్చుట సరియైన పద్ధతి—కాని యిందట్లు లేదు—వ్యాఖ్యానములలో మధ్య లేఖలున్నవి. చూడుడు.

| శీర్షికలు | లేఖలు |
|---|---|
| విదేశీయులకు తెలుగు బోధించిన తొలి ఉపాధ్యాయులు | 1, 2, 3 |

| | |
|---|---|
| మహాభారత సంశోధిత ముద్రణ | 4 |
| పల్నాటి వీరచరిత్ర | 5, 6, 7, 8, 9 |
| వసుచరిత్ర | 10 |
| వేమన పద్యాలు | 11, 12 |
| తెలుగు నిఘంటువు | 13, 14, 15 |

వ్యాఖ్యానములుగల లేఖలు పైని 15 మాత్రమే—అనుబంధమున రెండింటికి వ్యాఖ్యలు లేవు. దీనినిబట్టి యీ గ్రంథమున గల బ్రౌను లేఖలు 17 అని గ్రహింపవలెను.

విషయసూచికలో గ్రంథకర్త వ్యాఖ్యాన శీర్షికలు మాని లేఖలను క్రమముగా నిచ్చియుండిన—పై అవ్యవస్థపోయి పాఠకులకు సుగమముగా నుండెడిది. అదియే సరియైన పద్ధతియైనను నిందు పాటింపబడలేదు.

గ్రంథకర్తకు 'లేఖలు' అను గ్రంథము నెట్లు సంధానించి సంపాదకత్వము వహింపవలెనో తెలియని కారణముచేత ప్రస్తుత గ్రంథము ఒక లేఖ—వ్యాఖ్యల 'కలగూర గంప' గా తయారైనది. లేఖలుఅను గ్రంథమున ప్రధానమైనవి లేఖలు—కనుక మొదట వాని వివరము లుండవలెను. ఆ వెనుకనే వ్యాఖ్య యుండవలెను. అట్లున్ననే, ఆ లేఖల విశిష్టత వ్యక్తమగును. ప్రస్తుత గ్రంథమున వ్యాఖ్య మొదలు, ఆ వెనుక లేఖలును నీయబడుటచేత—రచనా విధానము తల్లక్రిందులైనది. బ్రౌను జాబుల ప్రాముఖ్యమును మనము గ్రహింపలేని పరిస్థితి యేర్పడినది.

ఈ గ్రంథ విశిష్టతను మనము గ్రహింపవలెనన్న గ్రంథ రచనా విధాన మిట్లుండవలెను. ప్రతి జాబునందును వ్రాసినతేది యుండును గాన కాలక్రమమున వానిని సంతరింపవలెను.

## బ్రౌను లేఖలు

అవతారిక—బ్రౌను సంగ్రహ జీవితము.

1. లేఖల రచయితలు—కాలక్రమము—
2. లేఖలు—
3. లేఖాంశములు— వ్యాఖ్యానము బ్రౌను సాహిత్య వ్యక్తిత్వము—
4. లేఖలనుండి గ్రహింపదగిన—సాహిత్య విశేషములు—అకారాది.
5. లేఖా రచయితలగు కవిపండితుల వివరములు—
6. లేఖలయందుదాహృతములైన కావ్యములు గ్రంథములు వివరములు— అకారాది—
7. లేఖలయందు దాహృతులైన యితర వ్యక్తులు—అకారాది—

గ్రంథకర్త పై రీతిని నొక ప్రణాళిక మొదట నేర్పరుచుకొనలేదని ప్రస్తుత ముద్రణమే తెలుపుచున్నది—

## బ్రౌను లేఖలు వివరణ

ఇందు గ్రంథము తెరువగానే మనకు కావలసిన లేఖా వివరణము—అనగా లేఖాసూచిక లేకపోవుట ఒక పెద్దలోపము—లేఖా గ్రంథమునకు నిది చాలా ఆవశ్యకము. అందును బ్రౌను లేఖల విషయముననిది మరీ ఆవశ్యకము. ఏలననగా నేను ముందు చెప్పినట్లు బ్రౌను లేఖలలో కేవలము బ్రౌను వ్రాసినవేగాక—ఇతరులు ముఖ్యముగా కవిపండితులు వ్రాసిన లేఖలు చాలా గలవు. కాబట్టి బ్రౌను లేఖలు ప్రకటించినప్పుడీ విభాగము చాలా ప్రధానముగా పాటింపదగినదై యున్నది.

ప్రస్తుత గ్రంథమున 17 లేఖలున్నవి. లేఖాసూచిక లేకపోవుటవలన గ్రంథమునుండి యధామాతృకముగా వానినిచ్చుచున్నాను—

లేఖ :

1. జేతపూడి సుందరరాయుడు
2. రావిపాటి గురుమూర్తిశాస్త్రి
3. పాట్నూరి రామస్వామిశాస్త్రులు
4. పురాణం హయగ్రీవశాస్త్రి
5. గంజాం అప్పయ్య } ఇద్దరూ ఒకరే
6. గంజాం పెదప్పయ్యహరిదాసు }
7. అ. మ. వీరభద్రయ
8. చి. లక్ష్మిరాఘువప్ప
9. చి. లక్ష్మిరాఘువప్ప
10. బ్రౌను జాబు
11. ,,
12. పైడిపాటి వెంకటనరసయ్య
13. తిప్పాభట్ల వేంకటశివశాస్త్రులు
14. వఠ్యం అద్వైతబ్రహ్మశాస్త్రులు
15. రావిపాటి గురుమూర్తిశాస్త్రి

ఇంతవఱకు గ్రంథములో వ్యాఖ్యాన సహితముగా వున్నవి—ఇవియైన వెనుక—అనుబంధములో

## "బ్రౌను రాసినవే మరిరెండు లేఖలు"

అని 16, 17 లేఖలీయబడినవి—పై లేఖా క్రమము చూచిన, తాను ప్రకటించిన 17 లేఖలలోకూడ, గ్రంథకర్త, బ్రౌను వ్రాసినవి—ఇతరులు వ్రాసినవి వేఱు పఱచక అన్ని గుదిగుచ్చి

సంకలనము చేసినాడని విశదమగుచున్నది. తాను ప్రకటింపదలచు కొన్న 17 లేఖలనైన ఒక క్రమములోసంకలనము చేయలేదు. సంకలనము చేయుటయేకాదు—ఏవి బ్రౌనువో, ఏవి యితరులవో ఆతడు పరిశీలింపలేదు. మొదట 15 లేఖలకు వ్యాఖ్యానము వ్రాసి నాడు—అందు బ్రౌనువి రెండున్నవి. ఆ వెనుక రెండు మిగిలి పోయినవి. గ్రంథము పూర్తి కావలెనుగనుక— ఆ రెంటిని— అనగా 16, 17 లేఖలను— అనుబంధములో చేర్చినాడు — అన్నియు బ్రౌనుకు సంబంధించిన లేఖలేయైనప్పుడు రెండింటిని అనుబంధములో చేర్చుటయేల తటస్థించినది? గ్రంథకర్త తనవద్ద గల 17 జాబులనైన సరిగా పరిశీలింపక చేతికి వచ్చినట్లు నా జాబు లను దీసి వ్యాఖ్యానమును వ్రాసి ప్రకటించినాడు—అందుచేతనే—

| | |
|---|---|
| బ్రౌను జాబులు | 4 |
| ఇతరుల జాబులు[1] | 13 |

అని వివరింపలేకపోయినాడు— 15వ జాబు పూర్తియైన వెనుక మిగిలినవి రెండును జ్ఞాపకమువచ్చి, ఆ రెండింటిని నిర్వ్యాఖ్యాన ముగా ప్రకటించినాడు—

విశ్వవిద్యాలయ ప్రకటిత పరిశోధక గ్రంథమింత యస్త వ్యస్తముగా నుండుట, విశ్వవిద్యాలయ పరిశోధనా పద్ధతులకు సుతరాము విరుద్ధము.

## బ్రౌన్ లేఖలు పరిశోధన విశ్వవిద్యాలయ ప్రచురణ

విశ్వవిద్యాలయము ప్రకటించు, పరిశోధన గ్రంథముల యందలి విషయములంతకుముందులోకమునకు పరిచయము కానివై యుండవలెను. నూతన విషయములను వెల్లడించుటయే పరిశోధన గ్రంథముల ముఖ్యమైన, లేక ప్రధానమైన లక్షణము— ఈ దృష్టితో చూచిన, ప్రస్తుతము శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యా లయమువారు ప్రకటించిన గ్రంథము ప్రాతదియేగాని నూతనము కాదు.

సంశోధకుడు, గ్రంథ సంకలనకర్త అయిన బంగోరె, ఈ బ్రౌన్ లేఖల పరిశోధనయంతయు, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయముననే కావించినట్లుగా నిట్లు ముందుమాటలలో తెలిపి నాడు—

''ఈ నేపథ్యంలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు నెలకొల్పిన సి. పి. బ్రౌను రిసెర్చి ప్రాజెక్టులో తెలుగుశాఖాధ్యక్షులు ఆచార్య జి. యన్. రెడ్డిగారి పర్యవేక్షణక్రింద సీనియర్ రిసెర్చి ఆఫీసర్‌గా 1975 సెప్టెంబర్ తే 10దిని చేరాను—ఇది 1977 జనవరి 9 తేది. ఈ ఒక్క సంవత్సరం నాలుగు నెల్ల వ్యవధిలో నేను చేయవలసినదేమిటి? చేయగలిగిందేమిటి? చేసిందేమిటి? చేసిన దాని కంటే చేయవలసినది ఇంకా బోలెడున్నట్లు కనపడుతున్నది—చేసిన దానికి సాక్ష్యంగా ఇదిగో ఈ చిన్న సంపుటాన్ని—చాలా చిన్న సంపు టాన్నే ''నిస్సిగ్గు''గా మీ ముందుంచుతున్నాను—'' (పుట 10)

పై వాక్యములనుబట్టి ఈ గ్రంథము శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున సి. పి. బ్రౌను రిసెర్చి ప్రాజెక్టులో 10—9—1975 నుండి 9—1—77 వఱకు చేసిన పరిశోధనా ఫలితము అని స్పష్టము. అనగా ఆ కాలములో గ్రంథ కర్త బ్రౌను లేఖలను పరిశీలించి వానిలోనుండి ప్రస్తుత గ్రంథ మున నిచ్చిన లేఖలను గ్రహించి వానికి, క్రొత్తగా వ్యాఖ్యానము రచించి, గ్రంథముగా రూపొందించి విశ్వవిద్యాలయమునకు సమ ర్పించెనని మనము నిశ్చయింపవచ్చును.

పై రీతిని కంఠోక్తిగా గ్రంథకర్త తాను బ్రౌన్ రిసెర్చి ప్రాజెక్టులో 1975 లో చేరినతరువాతనే క్రొత్తగా బ్రౌను లేఖలను గూర్చిన పరిశోధన ప్రారంభించితిని అని చెప్పినను— ఆ వాక్యమెంత మాత్రమును వాస్తవము కాదు. గ్రంథకర్త క్రీ. శ. 1975కు రెండేండ్ల క్రిందటనే— బ్రౌను లేఖలను గూర్చి పరిశోధన చేసి, తన పరిశోధనా ఫలితమును లోకమునకు వెల్లడించినాడు—ఇదిగో నిదర్శనము.

ఈ గ్రంథకర్త తే 11—10—1973 నాడు ప్రకటిం చిన గ్రంథము ముఖపత్రము నిచ్చుచున్నాను—

### బ్రౌన్ జాబులు -
### తెలుగు జర్నలిజం చరిత్ర-
1832 నుంచి 1857 దాక

బంగోరె

సంకలనం

పై గ్రంథము ''ముందు మాటలు''లో ''ఈ రెండేళ్ళు సేక రించిన సమాచారం నాతోనే అంతరించి పోవలసిందేనా'' (పుట8) అన్న వాక్యమును బట్టి— బంగోరె బ్రౌను జాబుల పరిశోధన ఆతడు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకు రాకముందు— క్రీ. శ. 1971 నుండి ప్రారంభించినట్లు తెలియుచున్నది గదా. అప్పుడు ముందు నేనుదాహరించిన నాతని వాక్యములకు సమన్వయ మెట్లు?— ఆ విషయమట్లుండ నిండు.

విశ్వవిద్యాలయములో ప్రవేశించుటకు రెండేండ్లకు ముందే పై గ్రంథము ''బ్రౌన్ జాబులు'' ప్రకటింపబడినను అందలి

---

[1] బ్రౌన్ లేఖలు అని లేఖా శబ్దమున్నను—గ్రంథ మధ్య మున ''అక్షరాలా బ్రౌన్ జాబు—బ్రౌన్ మరొక జాబు'' అని గ్రంథకర్తయే— 'జాబు' శబ్దము వాడినాడు. అందఱికి సుగమ మగు ''బ్రౌను జాబులు'' అన్న పేరేల పెట్టలేదో దురూహ్యముగా నున్నది.

పరిశోధనా విషయము జర్నలిజం చరిత్ర—ప్రస్తుతము ప్రకటిత మైన గ్రంథమున విషయము—ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర— రెండును భిన్నవిషయములు—అందుచేత వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున చేసిన పరిశోధన క్రొత్తదియే యగును — అన్నభావమును ప్రచురణ కర్తలు వెల్లడింపవచ్చును. కాని అట్టి భావమున కాస్కారమేలేదు. గ్రంథకర్త పై గ్రంథము ప్రచురించు నాటికి— అనగా క్రీ. శ. 1973 నాటికే ప్రస్తుత గ్రంథము పూర్తి చేసినట్లుగా ఆ గ్రంథము వెనుకటి అట్టపైని గల యీ క్రింది ప్రకటనవలన స్పష్టమగుచున్నది.

''అచ్చులో

బ్రౌన్ జాబులు—2 తెలుగు చరిత్రకదంబం

— ఇందులో కొన్ని శీర్షికలు —

తెలుగు కావ్యోద్ధరణ—పల్నాటి వీరచరిత్ర—కథలుగాథలు పాశ్చాత్యులకు తెలుగు బోధించిన ఆది పండితులు కుల సంకుల సమరాలు—నిరుద్యోగం — లంచగొండి తనం— తదితర చరిత్ర శకలాలు—

'బ్రౌన్ జాబులు—2' అని సంఖ్యకూడ నిచ్చుటచే 1973 నాటికి రెండవ సంపుటి పూర్తియైనది — 'అచ్చులో' అని యుండుటవలన— అప్పటికే వ్రాతప్రతియంతయు అచ్చునకు సిద్ధముగా నున్నది అని అర్థము—

1973 నాటి పై గ్రంథమే — కొలది మార్పులతో నేటి గ్రంథముగా రూపొందినది.

| 1973 గ్రంథము<br>బ్రౌన్ జాబులు<br>శీర్షికలు | ప్రస్తుత గ్రంథము<br>బ్రౌన్ లేఖలు |
|---|---|
| పాశ్చాత్యులకు తెలుగు బోధించిన ఆది పండితులు } | 1. విదేశీయులకు తెలుగు బోధించిన తొలి ఉపాధ్యాయులు |
| పల్నాటి వీరచరిత్ర | 3. పల్నాటి వీరచరిత్ర కావ్య పరిష్కరణ బ్రౌను పరిశ్రమ |
| తెలుగు కావ్యోద్ధరణ | 2. మహాభారత సంశోధిత ముద్రణ |
| | 4. వ్యాఖ్యాన సహిత వసుచరిత్ర |
| | 5. వేమన పద్యాల పరిష్కరణ |

నేటి బ్రౌన్ లేఖలలోని—6 శీర్షికలలో, 5 శీర్షికలు 1973 నాటి గ్రంథములోని వేయని, చూపబడినవి—ఇక అందు లేని— 6వ శీర్షిక— తెలుగు నిఘంటు శాస్త్ర పారంగతుడుగా బ్రౌన్ అనునది మాత్రము క్రొత్తగా చేర్చబడినట్లు తోచు చున్నది. అయితే దానికి మూలము కలదేమో అని అనుకొనుటకు 1973 గ్రంథములోని—''తదితర చరిత్ర శకలాలు'' అన్న శీర్షిక ఆధారము కల్పించుచున్నది. 1973లో బ్రౌన్ జీవిత చక్రం— ప్రస్తుత గ్రంథమున ''బ్రౌను జీవిత కథగా''గా రూపొందినది.

గ్రంథకర్త పై 1973 బ్రౌన్‌జాబుల ప్రచురణ యీ గ్రంథములో నిట్లు తెలిపినాడు—

''మూడేళ్ళ క్రితం ఇదే జాబుల్ని ముడి సరుకుగా తీసికొని బ్రౌను జాబులు— తెలుగు జర్నలిజం చరిత్ర 1832—1857 దాకా అనే గ్రంథాన్ని ప్రకటించాను'' (ముందు మాటలు 13పుట)

ఇట్లు పై 1973 గ్రంథము తెలుపుచూ తానే స్వయముగా ఆ గ్రంథమున తాను ప్రకటించిన పై విషయమును విస్మరించి యిందు చెప్పక పోవుట పరిశోధనా పద్ధతులకు ప్రత్యక్షరము విరుద్ధము—పరిశోధన చేయు వ్యక్తి తాను చేయు పరిశోధన విషయమును గూర్చి తనకు ముందు జరిగిన పరిశోధన గూర్చి తెలిపి, ఆ వెనుక తన పరిశోధన ప్రారంభింపవలెను— ప్రస్తుత మొదటి గ్రంథకర్త తానే శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున చేసినపని మొదటిదిగా తెలుపుచు—ఆ వెనుక తానంతకు ముందు మూడేండ్ల క్రిందట ప్రకటించినది తెలుపక పోవుటచేత అతడి ''బ్రౌను జాబులు 2'' (బ్రౌన్ లేఖలు) మాత్ర మంతకు ముందు తాను చేసినవేయనియు, మూడేండ్లకు ముందు తాను చేసిన దానినే కొలది మార్పులతో విశ్వవిద్యాలయమునకు సమర్పించె ననియు మనము నిశ్చయింప వచ్చును.

## విరుద్ధాంశములు

పరిశోధన గ్రంథములలో విరుద్ధాంశములకు నేమాత్రము తావు లేదు. అందు నిర్దుష్టములు నిస్సందేహములునైన యంశములు తప్ప వానికి వ్యతిరిక్తములైన యంశము లుండవే యుండవు. అట్లు వ్యతిరిక్తాంశము లుండిన యెడల ఆ పరిశోధన అప్రామాణ్యమగును—ప్రస్తుత గ్రంథమగు ''బ్రౌన్ జాబులు'' పరిశీలించిన ఇందలి యంశములు కొన్ని యెంత ప్రామాదికముగా నున్నవో పాఠకలోకమునకు తెలియగలదు. పుట 13. ముందు మాటలు— గ్రంథకర్త బ్రౌను జాబుల ప్రాముఖ్యము దెలిపి, ఆ వెనుక నిట్లు వ్రాసియున్నాడు.

''దాదాపు పదేళ్ళ క్రితం ఆం. ప్ర. సాహిత్య అకాడమీ వీటి ప్రాధాన్యం గుర్తించి 4—5 వేల రూపాయలు ఖర్చుపెట్టి మదరాసు ఓరియంటల్ మేనుస్క్రిప్ట్స్ లైబ్రరీలో నుంచి ఈ జాబుల్లో

16 సంపుటాలను మాత్రం కాపీ చేయించి భద్రపరచుకొని ఉంది కాని దురదృష్టవశాత్తు వాటి ఆధారంతో ఒక్క ప్రచురణ అయినా తీసుకురాలేక పోయింది. (పుట 14)

ఈ వ్రాత శుద్ధముగా అసంబద్ధము — ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారు మదరాసు ఓరియంటల్ మేనుస్క్రిప్ట్సు లైబ్రరీనుండి కాపీ చేయించినవి—

# మెకంజీ సంపుటములు

గాని బ్రౌను జాబులు కానే కావు—వారు కాపీ వ్రాయించినవి 181 మెకంజీ సంపుటములు— వీని నన్నింటిని ఆ లైబ్రరీనుండి వ్రాయించిన పని యంతయు, ప్రస్తుత వ్యాసకర్త పర్యవేక్షణ క్రింద జరిగినది. దీనికి 4—5 వేల రూపాయలు ఖర్చు అయినవి అని వ్రాయుటయు తప్పే. దానికైన ఖర్చు 10 వేల రూపాయలు. అందువలన బ్రౌను జాబులకు— ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు వ్రాయించిన సంపుటములకు అణుమాత్రము సంబంధము లేదు.

మదరాసు లైబ్రరీలోగల వ్రాత ప్రతులన్నియు బ్రౌను జాబులే అని గ్రంథకర్త భావించుటచేత పై రీతిని వ్రాయుట జరిగినది. ఇట్టిదానినే బట్టతలకు మోకాటికి ముడిపెట్టుట యందురు. పుట 138 "మద్రాసు కాలేజీలోను, లండన్‌నుంచి వచ్చిన వ్రాత ప్రతుల్లోనూ వుండే "మెకంజీ కైఫీయతులను" ఏరి దుమ్ము గొట్టుకొని పురుగులవాతపడి శిథిలమైపోతూంటే మళ్లీ దళసరి కాగితాలమీద కరక్కాయ సీరాతో సొంత డబ్బు ఖర్చుపెట్టి కాపీ వ్రాయించి చరిత్రకు మూలాధారమైన ఈ వేలాది కైఫీయతులు కాలగర్భంలో కలిసిపోకుండా, పునరుద్ధరించి పెట్టాడు. ఇవే నేడు మద్రాసు ఓరియంటల్ మేనుస్క్రిప్ట్సు లైబ్రరీలో వున్న వందలాది లోకల్ రికార్డ్సు (కైఫీయత్తుల) వాల్యూములు" (పుట 139)

మద్రాసు ఓరియంటలు లైబ్రరీలో నున్న వ్రాత ప్రతులను గూర్చి గ్రంథ కర్తకుగల పరిజ్ఞానమునకు పై యుదాహృత భాగ మొక మచ్చుతునక! ఇంతకుముందే యీ గ్రంథ కర్తకు, బ్రౌను జాబులు—మెకంజీ సంపుటములు (కైఫీయత్తులు) వీని స్వరూపస్వభావములు తెలియలేదని నిరూపించియుంటిని—ఇప్పుడాతనికి— మెకంజీ సంపుటములు, లోకలు రికార్డులు—వీని స్వరూప స్వభావములు తెలియలేదని వెల్లడించుచున్నాను—

మెకంజీ వ్రాత ప్రతులు "పురుగుల వాతపడి శిథిలమై" పోలేదు—అవి దుమ్ము గొట్టుకొని పోలేదు—అవి మెకంజీ కాలము నాటివి చెక్కు చెదరకుండా నేటికి ఓరియంటలు లైబ్రరీలో నున్నవి— వానినుండి ఇప్పటికి నలభై యేడేండ్ల క్రింద— మదరాసు విశ్వవిద్యాలయమువారు—175 సంపుటములను ఆంగ్ల భాషలోని కనువదింప జేసినారు— క్రీ. శ. 1963లో ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీవారు 181 సంపుటములను వీనినుండియే తిరిగి వ్రాయించిరని యిదివఱకే తెలిపి యున్నాను—పరిశోధకులు పలు ప్రదేశములనుండి వచ్చి నేటికిని వానిని సంప్రతించుచునే యుందురు—ఈ కైఫీయతులలోని 500 కైఫీయతులను — మూడు సంపుటములుగా మద్రాసు ప్రభుత్వమువారు ప్రకటించి యున్నారు— చారిత్రక పరిశోధకుల కందఱకు సుపరిచితములైన ఈ మెకంజీ సంపుటములను గ్రంథకర్త మాత్ర మెన్నడు చూచి నట్లు లేదు. ఆతడు వానిని చూచియే యున్నయెడల పై రీతిని వ్రాసియుండడు.

అంతే కాదు—గ్రంథకర్తకు — మెకంజీ సంపుటములు లోకల్ రికార్డులు—వేర్వేఱు విభాగములన్న వివక్షణ లేకపోవుటచే కాబోలు, ఆతడు—మెకంజీ సంపుటములే బ్రౌను లోకల్ రికార్డులు గా భావించి పై రీతిని వ్రాసి యున్నాడు— అవి రెండును వేర్వేఱు విభాగములు. రెండింటికి వేర్వేఱుగా పుస్తక సూచిక లున్నవి.

అసలు మెకంజీ సంపుటములెన్నో, లోకలు రికార్డులెన్నో గ్రంథకర్తకు తెలియక పోవుటచేత

"లైబ్రరీలో వున్న వందలాది
లోకల్ రికార్డ్సు వాల్యూములు"

అని వ్రాసి యున్నాడు—లోకల్ రికార్డులు వందలాది వాల్యూములు లేవు–ఆ లోకల్ రికార్డ్సు వాల్యూములు–నలుబది యెనిమిది. చూడు డీ క్రింది బ్రౌను దొరగారి వాక్యములు—

**Loc. Local Records this refers to a serics Forty eight hitorical volumes prepared at my expense and chiefly transeribed out of the Mackanzie Mss along with which it is deposited in the college at Madras.**

బ్రౌణ్య–తెలుగు–ఇంగ్లీషు నిఘంటువు పుట **XVIII**
**On the names of books quoted in the Dictionary**

బ్రౌను పై రీతిని లోకల్ రికార్డులు—48 సంపుటములని స్పష్టముగా చెప్పుచుండగా— ప్రస్తుత గ్రంథకర్త 'వందలాది' అనునదెట్టిదో, పాఠకులే యూహింతురుగాక—

సంపుటముల సంఖ్యయేగాదు—స్వరూప విషయమున భేద మున్నది—ఇవి మెకంజీ వ్రాతలనుండి ఎత్తి వ్రాయబడినట్లు బ్రౌను **transeribed out of Mackenzie MSS** అని స్పష్టపఱచి నాడు— అనగా బ్రౌను వానినుండి వ్రాయించునాటికవి — "శిథిలమై దుమ్ము కొట్టుకొని పోలేదనియు చక్కగా నున్నవని" యర్థము. అవి వాస్తవముగా శిథిలములై యున్నయెడల బ్రౌను ఆ సంగతి స్పష్టము చెప్పి వానిని తిరిగి వ్రాయించితినని చెప్పి

యుండెడివాడే—అట్లాతడు చెప్పక, మెకంజీ సంపుటములనుండి అని చెప్పటచేత— ప్రస్తుత గ్రంథకర్తమాట నిరాధారమై, నిష్ప్రమాణ మైనది.

ఇంకొక విశేషము—బ్రౌను గూర్చియే ప్రత్యేక పరిశోధన చేయుచున్న గ్రంథకర్త బ్రౌను, ఇతర గ్రంథములు — అందుకు ముద్రితమై నేటికి గ్రంథ భాండారములలో లభించు — బ్రౌణ్య తెలుగు— ఇంగ్లీషు నిఘంటువునైనను చూడకపోవుట శోచనీయమై యుండుటయేగాక, పరిశోధన ప్రతిష్ఠకు భంగము కలిగించు చున్నది.

ఈ లోకల్ రికార్డులను—లైబ్రరీవారు "స్థానిక సంపుటములు" అని వాడుదురు— చారిత్రకులు, పరిశోధకులు — ఇవి మెకంజీనుండి వేఱగుటచేత — వారి పరిశోధనలలో — మెకంజీ సంపుటములనుండి గ్రహింపబడినది.

స్థానిక సంపుటములనుండి గ్రహింపబడినది అని తెలిపి— ఆ సంపుటముల సంఖ్యల నిచ్చెదరు—

పుట 31. "బ్రౌణ్యానికిముందు నిఘంటువు లనేవి లేవని కాదు. ఉన్నాయి. పద్య గద్యల్లోకూడా ఉన్నాయి. ఆంధ్రనామ సంగ్రహం, ఆంధ్రనామశేషం, ఆంధ్రభాషార్ణవం, ఆంధ్రరత్నాకరం శివాంధ్రం విష్ణ్వాంధ్రం ఇత్యాదయః, ఎన్నో వున్నాయి."

ఆంధ్రనామ సంగ్రహము—ఆంధ్రనామశేషము — ఆంధ్ర భాషార్ణవము, ఆంధ్రరత్నాకరము—ప్రసిద్ధ నిఘంటువులే—పద్య మయములు—కాని, "శివాంధ్రం—విష్ణ్వాంధ్రం"—అను నిఘంటువులనగా నెట్టివి? ఆ పేరులతో నింతవఱకు నిఘంటువులు తెలియరాలేదు—ఇంతవఱకు నెవ్వరును వీని నుదాహరింపలేదు— లభ్యములైన నిఘంటువులన్నింటిని సేకరించిన సూర్యరాయాంధ్ర నిఘంటువువారును వీనిని గూర్చి తెలుపలేదు—మఱి ఈ గ్రంథ కర్తకీ పేరులెట్లు తెలిసినవి—అని పరిశీలించగా—శివాంధ్రం, విష్ణ్వాంధ్రం అన్న పేరులు — బ్రౌనునుండి గ్రహించినవి— (చూ : పుట—107)

**List of Telugu works selected from Mr.Brown's Collection—**

**On Etymology and Rhetoric**

**6. The Sivandhram—Rs 28.**

**7. The Vishnu Andhram.**

**or Venkates Andhram Rs. 21**

పై దానినిబట్టి — ఈ గ్రంథకర్తకు, "శివాంధ్రం — విష్ణ్వాంధ్రం" అనే నిఘంటువులేవో తెలియవనుట స్పష్టము— బ్రౌను చమత్కారముగా, ప్రసిద్ధమైన సాంబ నిఘంటువునకు శివాంధ్రమని, వేంకటేశాంధ్రమునకు — విష్ణ్వాంధ్రమని పేర్లు పెట్టినాడు—గ్రంథకర్తయు వానినట్లే అనువదించినాడు. అంతే.

## బిబ్లియాగ్రఫీ

పుట 152. "రాజమండ్రి సరస్వతి మాసపత్రిక (1923—24) కొంతకాలం కాకినాడనుంచి కూడావచ్చింది. ఎడిటర్‌పోలవరం జమీందారు కె. ఆర్. వి. కృష్ణారావు"—

పై ఆరోపములోని వన్నియు నసంబద్ధములే—తొలుత—రాజమండ్రి సరస్వతీ పత్రిక—(1923—24)లో లేనేలేదు—అది 1898లో ప్రారంభమై 1912లో ఆగిపోయినది. "అది కొంత కాలం కాకినాడనుంచికూడా వచ్చింది" అనేదిఅంతకంటే దోషము—అది రాజమండ్రిలో ప్రారంభమైనను—కొలది నెలలలోనే—కాకినాడ మాఱి—14 ఏండ్లు—కాకినాడనుండియే వెలువడినది—ఈ సరస్వతి సంపుటములు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ, ప్రాచ్య పరిశోధనాసంస్థ భాండాగారమునను్నవి—ఇంతకు ఈ సరస్వతి పత్రికకు, బ్రౌనుకు సంబంధములేదే—మఱి గ్రంథకర్త యెందు కుదాహరించినాడో దురూహ్యము—ఈ పరిశోధన గ్రంథము లందిట్టివి బ్రౌనుగూర్చి పరిశోధనము చేయువారి నపమార్గమున ద్రొక్కించును—

పరిశోధన గ్రంథములలో గ్రంథసూచికలు (బిబ్లియాగ్రఫీ) బహుజాగరూకతతో నీయవలెను—ఒక గ్రంథమునకు మరియొక గ్రంథము నిచ్చిననది భావి పరిశోధకులకు క్లేశము గలిగించును— ఇక్కడ జరిగినది అంతే—

సరస్వతి పత్రిక 1923—24లో నున్నది. అది కృష్ణా జిల్లా ముక్త్యాలనుండి వెలువడినది. ఆ పత్రికయందు బ్రౌను జాబులను ప్రప్రథమముగా కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు ప్రకటించిరి. గ్రంథకర్త ఈ సరస్వతి పత్రికకు బదులు పై రాజమండ్రి సరస్వతి పత్రికను నుదాహరించినాడు. ఇట్టివి పరిశోధన గ్రంథములయందు నిషిద్ధములు.

## వ్యాఖ్యలు-విమర్శన

వ్యాఖ్యలు జాబులలోని విషయములకేగాక బ్రౌనుకు సంబంధించి యుండవలెను. అందలి ప్రసక్తమైన యంశములు క్రొత్తవియై యుండవలెను. ఈదృష్టితో వ్యాఖ్యలను సమీక్షించుచున్నాను.

### 1. విదేశీయులకు తెలుగు బోధించిన తొలి ఉపాధ్యాయులు

ఇది 28 పుటలలో నున్నది. ఇందు బ్రౌను సమకాలికులగు పండితులను గూర్చియే యున్నదిగాని సాహిత్యమునుగూర్చి లేదు. బ్రౌనుకు సంబంధించినది అల్పభాగముగాన నిది శీర్షిక 28పుటలు అనావశ్యకములు.

### 2. మహాభారత సంశోధిత ముద్రణ

తొలిసారిగా మహాభారత ముద్రణకే గాక, సంశోధిత ముద్రణకు బ్రౌను ప్రారంభకుడని యీ శీర్షిక తెలుపు చున్నది.

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు బ్రౌను సంశోధిత ప్రతిని నుపయోగించినారు. 3 పుటలలో చెప్ప దగినది 8 పుటలైనది—

## 3. పల్నాటి వీరచరిత్ర కావ్యపరిష్కరణ

భారతమునేగాక పల్నాటి భారతమును (పల్నాటి వీర చరిత్ర) తొలుత పరిష్కరించిన కీర్తి బ్రౌనుదే— ఆతడు పలు ప్రతులు సేకరించి, సంశోధిత ప్రతిని ముద్రణకు నిప్పటికి నూట నలుబది యేండ్ల క్రిందటనే సిద్ధముచేసిన విషయమిందు విశదీకరింపబడినది. కాని ఆ పరిష్కరణ ప్రతి వివరములు లేవు—

## 4. వసుచరిత్ర మొదటి ముద్రణ

ఇందలి విషయములన్నియు నీవఱకే పరిచితములైనవి— చూడుడు. వావిళ్ళవారి వసుచరిత్రము చతుర్థ ముద్రణము—1954. ఈ చతుర్థ ముద్రణ పీఠికలో నిందలి విషయములన్నింటిని నే నిచ్చి యున్నాను. బ్రౌనుకు కృతియైన ములుపాక బుచ్చయశాస్త్రి వసు చరిత్ర వ్యాఖ్య[1] మున్నగు క్రొత్త విషయములు తెలిపితిని — బ్రౌను ముద్రణ 1844 వసుచరిత్ర నా వద్దనున్నదానిని ఇతర ప్రాచీన ముద్రణ గ్రంథములతోపాటు ఆంధ్రప్రదేశ్ స్టేటు— ఆర్కివ్సువారి కిచ్చివేసితిని—

## 5. వేమన పద్యాలు

18 పుటల ఈ శీర్షికలో బ్రౌను ఆంగ్లభాషలోని కనువదించిన వేమన పద్యముల సంఖ్యగాని ఆ విషయమును గూర్చిగాని లేదు. బ్రౌను 3238 వేమన పద్యములను నింగ్లీషు భాషలోని కనువాదము చేసినాడు. అవి 5 సంపుటములలో మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునందున్నవి. వివరములకు చూడుడు (భారతి—జాన్యువరి 1963. సి. పి. బ్రౌన్ గ్రంథ విమర్శనము)

## 6. తెలుగు నిఘంటుశాస్త్ర పారంగతుడు

ఇది యిందలి శీర్షికలలో నెల్ల పెద్దది. 76 నుండి 110 వఱకు 34 పుటలలో నున్నది. ఇందులో శ. ర. ప్రస్తావన— 80—81 పుటలు— "కాలేజీ వారుకోరిన 500 రూపాయిల పుస్తకాల వివరం"—104—110 పుటలు. బ్రౌను నిఘంటువునకు సంబంధించినవి కావు—అనవసరముగా చేర్చబడినవి—బ్రౌను నిఘంటువును సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాతలే ప్రామాణికముగా గ్రహించినపు డిన్ని పుటలు దానిని గూర్చి వ్రాయ నావశ్యకత లేదు. దీనికి సంబంధించిన లేఖలు రెండింటిని ప్రకటించి—ఆతడెట్లు దానిని సమకూర్చినది 5, 6 పుటలలో వివరించిన సరిగా నుండెడిది—

పై వివరణమువలన వ్యాఖ్యానమున 110 పుటలలో 30 పుటలు జాబులు పోగా, మిగిలిన 80 పుటలు వ్యాఖ్యానములని అందును. 60 పుటల నావశ్యక విషయములలో నున్నవని స్పష్టమగుచున్నది. ఇందువలన జాబులకన్న వ్యాఖ్య మూడు రెట్లు పెరిగినదనియు అందునన్నైన— విషయములుగాక— విమర్శనయే ప్రధానముగా నున్నందున—అవి గ్రంథమునకు సంబంధించినవి గావని గ్రహింప నగును. పరిశోధన గ్రంథములలో— ప్రసక్తము కాని విషయములకు అప్రస్తుత ప్రసంగములకు ఆస్కారము ఎంత మాత్రము లేదు—

అసలు గ్రంథము 150 పుటలలో—116 పుటలు మాత్రమే బ్రౌను జాబులకు సంబంధించినది—తక్కిన 30 పుటలు బ్రౌను జీవిత కథ జాబులతో సంబంధించినదిగాదని యీవఱకే తెలుపబడినది. పై 116 పుటలలో 60 పుటలకు పైగా అనావశ్యకవిషయము లుండుటచేత—వానిని పరిహరించిన— ఈ జాబుల గ్రంథములో నింకను బ్రౌను జాబులను మఱి 30 చేర్చుట కవకాశమున్నది. అనగా వ్యాఖ్యానములు నూటిగా గ్రంథ విషయమునకు సంబంధించిన యెడల నిందు— 30+17—47 లేక 50 జాబులు ప్రకటించుటకు వీలున్నది — కాని గ్రంథకర్త అట్లు చేయలేదు—పాఠక లోకమునకు సాహిత్యలోకమునకు బ్రౌను 30 జాబులలోని అమూల్య విషయములను గ్రహించుట కవకాశము లేకపోయినది—

# లేఖలు-సాహిత్యము

ఈ గ్రంథము ముఖపత్రమున — "ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర శకలాలు" అని యుండుటవలన ఇందు ఆంధ్రసాహిత్య చరిత్రకు సంబంధించిన విషయము లుండునని లేదా సాహిత్య చరిత్ర యుండునని మనము గ్రహింపవచ్చును. ముందు నేను చేసిన— శీర్షికల విమర్శనమునుబట్టి యిందు సాహిత్య చరిత్రకు సంబంధించిన వివరణములేవి లేనట్లు స్పష్టమైనదిగదా.

ఇందలి 17 జాబులలో బ్రౌను జాబులు 4 మినహాయింపగా మిగిలిన 13 జాబులలో 10 జాబులు కవిపండితులు బ్రౌనుకు వ్రాసినవి—వానియందును, బ్రౌను వ్రాసిన వానియందును కావ్యములను గూర్చిన ప్రస్తావన విశేషముగా గలదు—విశేషముగా నననేల? అవి యన్నియు తెలుగు సాహిత్యమునకు సంబంధించినవే— కాని వ్యాఖ్యలలో సాహిత్య విషయ మేమాత్రము లేదని యింతకుపూర్వమే నిరూపించియుంటిని—

---

[1] ఈ వ్యాఖ్య పేరు ప్రతిపదార్థ ప్రకాశిక — ఇందు కృత్యాదిలో పూర్వకావ్యములవలె, అవతారికయున్నది. అందలి పద్యమే "మూర్ఖులు లెక్కసేయక" అనునది ప్రస్తావన 7వ పుటలో నున్నది. ఇది బ్రౌను కంకితమై ప్రతి ఆశ్వాసాద్యంత పద్య గద్యములతో నున్నది. అముద్రితము. ఈ బుచ్చయశాస్త్రి బ్రౌనుకు వ్రాసిన లేఖ నేను నా ఆంధ్ర వచన వాఙ్మయమున నిచ్చి యున్నాను.

(పుట 132 ద్వితీయ ముద్రణము 1977)

## కవి పండితుల వివరము - కావ్యములు

ఈ గ్రంథమున ప్రసక్తులైన కవిపండితులు— 'నామ సూచి'లో అకారాదిగా నేర్పరుపబడిన వారేగాని వారిని గూర్చి వివరములు లేనేలేవు—ఇది సాహిత్య చరిత్రయే యైనయెడల అకారాదిగా, ప్రత్యేకముగా—

## బ్రౌనుకాలమునాటి కవులు, పండితులు

అని, వారిని గూర్చిన వివరములు గ్రంథకర్త యీయవలసి యుండెను—కాని యాతడట్లు చేయలేదు—పోనీ—కవి పండితుల నామములనైన అకారాది సూచికలో నిచ్చినట్లు కావ్యముల పేళ్లనైన—అకారాది క్రమమున నిచ్చినాడా యన్న యదియు చేయలేదు. అపైగా వానిని పట్టుబట్టి విడిచిపెట్టి యున్నాడు — చూడుడు నామసూచి—

## నా మ సూ చి

''వ్యక్తుల, స్థలాలపేర్లకు మాత్రమే ఈ జాబితా. పుస్తకాలు తదితరాలపేర్లు ఇందులో చేర్చలేదు. గ్రంథవిస్తర భీతిచేత.''

పై దానిలో— ''పుస్తకములపేర్లు'' అనగా కావ్యముల పేళ్లు—ఇవి గ్రంథకర్త—''గ్రంథవిస్తరభీతిచేత'' — చేర్చలేదట! ఎంతమాట! ఆతడే ముఖపత్రమున ''ఆంధ్రసాహిత్య చరిత్ర శకలాలు'' అని యీ గ్రంథవిశిష్టతను ప్రకటించినాడే! అట్టి సందర్భమున—గ్రంథమధ్యముననేగాక — గ్రంథాంతమున నామసూచిలోనైనను వాటిని చేర్చకపోవుటచేత—గ్రంథకర్త ఆంధ్ర సాహిత్య చారిత్రక పరిజ్ఞానమును మనము శంకింపవలసి వచ్చుచున్నది—ఇందుల కుపబలముగా–నాతడనుబంధములో చేర్చిన బ్రౌను లేఖలు రెండింటిని చూపవచ్చును. ఆ రెండు లేఖలును కావ్య సాహిత్యమునకు సంబంధించినవే—వానిలోని వివరముల నిచ్చుచున్నాను.

16 లేఖ—పుటలు 113, 114—

భాను మద్విజయము—
చంద్రాంగద చరిత్ర
ప్రభులింగ లీల
బసవపురాణము.
బసవకాల జ్ఞానము.
సూర్యతనయా పరిణయము
చారుచంద్రోదయము
పండితారాధ్య చరిత్ర—
రత్నావళీ పరిణయము—

17 లేఖ—పుటలు 115—116

## నవనాథ చరిత్ర

ఈ రెండు లేఖలకు అసలు వ్యాఖ్యయేలేదు—అంతకుముందు 15 లేఖలకు వ్యాఖ్య వ్రాసిన గ్రంథకర్త యీ రెండు లేఖలకు వ్యాఖ్య వ్రాయక విడిచిపెట్టినాడు. దీనినిబట్టి చూడగా, నాతనికా కావ్యములనుగూర్చిన పరిజ్ఞానమా కాశకుసుమమని మనము భావింపవచ్చును—

ఈ రెండులేఖలేగాదు వ్యాఖ్యానించిన లేఖలలోగూడ కావ్యములను గూర్చిన ప్రసక్తియే కన్పట్టదు.

## మహాభారత సంశోధిత ముద్రణ

పురాణం హయగ్రీవ శాస్త్రి లేఖ — 33వ పుటలోనున్న గ్రంథములు చూడుడు—

తారాశశాంకము
కుచేలోపాఖ్యానము
సారంగధర చరిత్రము
మైరావణ చరిత్ర
సుభద్రా పరిణయము
రాధికా సాంత్వనము
రాఘవ పాండవీయము సవ్యాఖ్యానము
మనుచరిత్ర సవ్యాఖ్యానము
కర్ణామృతములు తెలుగు పద్యములు
3 శతకములు
భారతము యుద్ధపంచకము
రంగనాథ రామాయణము
భాగవతము
హరిశ్చంద్రనలోపాఖ్యానము సవ్యాఖ్యానము

పై వానిలో కర్ణామృతములు 2, 3 శతకములు కలిపి 17 గ్రంథములున్నవి. వీనిలో 14 కావ్యములు—3 శతకములు—

ఇన్ని కావ్య గ్రంథములున్న పై లేఖ వ్యాఖ్యానములో నీ కావ్యములనుగూర్చి పల్లెత్తుమాట యైనను లేదు—

పై లేఖలోని 17 ముందు లేఖలలోనివి 10 మొత్తముపై 27 కావ్యములు—వ్యాఖ్యలతో నున్న 4 కావ్యములు కలిపిమొత్తము 31. కాగా వీనిని గూర్చి వ్రాయకపోవుట సరికదా అకారాది క్రమ పట్టికలోగూడ వీనిని చేర్చక పోవుట పరిశోధనా పద్ధతులకు సుతరాము విరుద్ధ మగుటయేగాక—గ్రంథమునకు న్యూనత నాపాదించుచున్నది.

గ్రంథమునం దే మాత్రము సాహిత్య కావ్యములనుగూర్చి—వాని చరిత్ర గూర్చిగాని లేకపోయినను గ్రంథ ముఖ పత్రమున 'ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర శకలాలు' అని గ్రంథకర్త ఎట్లు ప్రకటించినాడో దురూహ్యము—

ఇప్పటికే యీ సమీక్ష పెరిగినది. ఇక ముగింతును. ప్రస్తుత గ్రంథము బ్రౌన్ లేఖలు మూలమున బ్రౌను చేసిన అసామాన్య సాహిత్యసేవ యెట్లు వెల్లడించినదో విశ్వవిద్యాలయము వారే తెలుపుదురుగాక—

చర్చ:

# రొమాంటిసిజం

— డా. గంటి శ్రీరామమూర్తి

కృష్ణశాస్త్రిగారి కవిత్వాన్ని గురించి శ్రీ ఇస్మాయిల్ వ్రాసిన వ్యాసాన్ని పురస్కరించుకుని ఫిబ్రవరి, 1977, 'భారతి'లో శ్రీ సర్దేశాయ్ తిరుమలరావుగారు కొంతచర్చించారు. ఆంగ్లసాహిత్యంలో 'రొమాంటిసిజం'కు సంబంధించిన కొన్ని లక్షణాలను ఉట్టంకించి, వాటిని కృష్ణశాస్త్రి కవిత్వంలో చూడాలని ప్రయత్నించారు శ్రీ ఇస్మాయిల్. అవి 'రొమాంటిసిజం'కు సంబంధించిన ప్రధాన లక్షణాలు కావని త్రోసిపుచ్చారు తిరుమలరావుగారు. అంతతో ఆగక తమదృష్టిలో 'రొమాంటిసిజం' లక్షణాలేమిటో సోదాహరణంగా వివరించి, ఒకానొక లక్షణాన్ని సర్వప్రధానమైనదానిగా ప్రవచించారు. వారు చెప్పిన లక్షణాలు కృష్ణశాస్త్రి కవిత్వానికి అన్వయించవు. కనుక కృష్ణశాస్త్రివారి దృష్టిలో 'రొమాంటిసిస్టు' కాదు. కృష్ణశాస్త్రి కవిత్వాన్ని అర్థం చేసుకోవాలంటే 'హౌస్‌మన్'కవిత్వం చదవాలి. అప్పుడు మనకు కనువిప్పు కలుగుతుంది. కృష్ణశాస్త్రి గొప్పతనానికి కారణం అతనిపై ఏ. ఇ. హౌస్‌మన్ ప్రభావం అని సూచించి విరమించారు తిరుమలరావుగారు. శ్రీ ఇస్మాయిల్ ఉట్టంకించిన లక్షణాలు 'రొమాంటిసిజం'కు సంబంధించిన ప్రధాన లక్షణాలు కావన్నంతవరకు మనం వారితో ఏకీభవించవచ్చు. వారి ఇతర అభిప్రాయాలతో ఏకీభవించడం సాధ్యంకాదు.

తిరుమలరావుగారి అభిప్రాయాలను పరామర్శించే ముందు వారి వ్యాసాన్ని గురించి ఒకటి రెండుమాటలు మనవి చెయ్యాలి. ఈ వ్యాసంలో ఆమూలాగ్రం అస్పష్టత, తొందరపాటుతనం కనిపిస్తున్నాయి. రచన పటిష్ఠంగా, తర్కసహితంగా సాగలేదు. కొన్ని చోట్ల వాక్యాలకు పూర్వాపర సంబంధం లేకపోవడం, 'పేరాగ్రాఫ్'లో భావైక్యత లోపించడం గమనిస్తాం. కేవల వైయక్తికాభిప్రాయాలను సిద్ధాంతీకరించడం కూడా కనిపిస్తోంది. అందుచేత ఈ వ్యాసానికి ప్రామాణికత లోపిస్తోంది.

"ఈ రొమాంటిక్ లక్షణాలు కృష్ణశాస్త్రి కవిత్వంలో ఎంతవరకున్నాయో సహృదయులు ఆలోచించండి"—ఇక్కడితో వ్యాసం పూర్తిచేస్తే అందంగా ఉండేది. కాని అనవసరంగా పొడిగించి ఆభాస పాలైయ్యారు తిరుమలరావుగారు. ఈ వ్యాసం ముగింపు చూడండి :

"రాజకీయాల్లో పాల్గొనే కృష్ణశాస్త్రులు (ఇది కేవలం బహువచనం ఏకవచనానికి గౌరవచిహ్నం కాదు) కంటె, కవిత్వం వ్రాసే కృష్ణశాస్త్రి మనకు కావలె."

ఈ ఉపసంహార వ్యాసానికి అసలు వ్యాసానికి ఎలాంటి సంబంధం లేదు. ఈ వైయక్తికాభిప్రాయ ప్రకటన వల్ల వ్యాసకర్త సాధించిన ప్రయోజనం మృగ్యం. దీనిని ఆంగ్లాలంకార భాషలో చెప్పాలంటే 'Anti-climax' అనాలి.

పూర్వాపరాలుగాని ఐక్యతగాని లేని ఈ 'పేరాగ్రాఫ్' ను చూడండి. ఈ రొమాంటిసిజం లక్షణాలు కృష్ణశాస్త్రి కవిత్వంలో ఎంతవరకున్నాయో సహృదయులు ఆలోచించండి. కృష్ణశాస్త్రి గొప్పకవి అగుటకు 'రొమాంటిసిస్టే'కానక్కరలేదు. కృష్ణశాస్త్రిపై **A. E. Housman** ప్రభావం ఉన్నదేమో ఆలోచించామా?... కృష్ణశాస్త్రి కవిత్వం (కృష్ణ పక్షం) చదివితే కొంత తెలివిడి **(new sensibility)** కలుగుతుంది. అందుకే కృష్ణశాస్త్రి గొప్ప కవి.

తొందరపాటు తనానికి ఒక ఉదాహరణ.

"ఈ భావ వీచికలు రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాలను కోరే కవులు వ్రాసేవి కాని రొమాంటిస్టులవి కాలేవు. ప్రపంచాన్నంతా వలసలుగా మార్చుకొన్న రవి అస్తమించని సామ్రాజ్యమునకు కేంద్రమయిన ఇంగ్లాండులోని 'రొమాంటిసిస్టు' కవులెందుకు వ్రాస్తారు." ఆంగ్లదేశ చరిత్రగాని, ఆంగ్ల సాహిత్య చరిత్రగాని, 'రొమాంటిసిజం' అంటే సదవగాహన ఉన్నవారుగాని ఎవరూ ఇలా వ్రాయ సాహసించరు. ఆంగ్లదేశంలో పుట్టిన ప్రతికవి, రచయిత సామ్రాజ్యవాది అనడం ఎంత సాహసం! ఆంగ్లదేశపు 'రొమాంటిసిస్టు'లు రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాలను ఆకాంక్షించలేదా? అవిచార మూలకమైన ఇట్టి వ్రాతలు విమర్శ అనిపించుకోవు.

ఇక వీరు 'రొమాంటిసిజం' ను గురించి వ్రాసిన అభిప్రాయాలను పరిశీలిద్దాం. ఇస్మాయిల్‌గారి వ్యాసంకన్న తిరుమలరావుగారి వ్యాసం మెరుగైనదే. కాని రెండింటిలోను మౌలికమైన భావన దెబ్బతింది. ఇస్మాయిల్‌గారు 'రొమాంటిసిజం' అంటే ఇంగ్లండుదేశంలో పందొమ్మిదవ శతాబ్ద ప్రథమ భాగంలో విలసిల్లిన కవిత్వోద్యమ లక్షణంగా మాత్రమే అర్థం చేసుకొన్నారు. తిరుమలరావుగారు వారిని ఖండిస్తూ, ఐరోపా ఖండంలోని 'రొమాంటిసిజం' కు గీటు రాళ్ళనదగిన కవులతో కృష్ణశాస్త్రిగారిని పోలుస్తామని ప్రతిజ్ఞ చేశారు. కాని వ్యాసం అంతా ఇంగ్లండు దేశంలో పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభంలో వచ్చిన

ఉద్యమానికే వినియోగించారు. వారి వ్యాసం చివరి భాగంలో 'రొమాంటిక్' కవితా లక్షణాలుగ పేర్కొన్నవి ఆంగ్లదేశపు ఉద్యమానికి సంబంధించినవే. ఎక్కడా మరోమాట లేదు. నిజానికి వీరిద్దరూ ఒకే రకం పొరపాటు చేశారు. 'రొమాంటిసిజం' అంటే వీరుల్లేఖించినది సార్వత్రికము, సార్వకాలికముకాదు. ఆంగ్ల సాహిత్య చరిత్రలో వీరు చెప్పిన 'రొమాంటిసిజా'న్ని 'రొమాంటిక్ రివైవల్' అంటారు. అంతకు పూర్వం మొదటి ఎలిజబెత్తు కాలంలో 'రొమాంటిక్' కవిత్వం వచ్చింది. తరువాత కాలంలో దీనికి ప్రచారం తగ్గింది. మళ్ళీ వర్డ్స్‌వర్త్, కోల్‌రిజ్‌లు దాన్ని ప్రచారంలోకి తెచ్చారు. అయితే ఈ పునరుద్ధరణకు తక్షణ కారణం మాత్రం ఇంగ్లండులో లేదు. ఫ్రాన్సులో ఉంది. ఫ్రెంచి విప్లవం వీరిని ఉత్తేజపరిచింది. ఫ్రాన్సులో జరిగిన రాజకీయ విప్లవం ఇంగ్లండులో భావ విప్లవంగా పరిణమించింది. కవిత్వంలో వచ్చిన ఈ భావ విప్లవాన్నే ఆ కాలపు 'రొమాంటిసిజం' గా పేర్కొన్నారు విమర్శకులు. ఇది కేవలం సంప్రదాయంపై తిరుగుబాటు కాదు. ఎలిజబెత్తు యుగంనుంచి వచ్చిన పరిణామాలను జీర్ణించుకొని, ఫ్రాన్సులోని రాజకీయ విప్లవంచేత నూతన చైతన్యం పొంది, జర్మన్ దేశ ప్రభావాల నాకళించుకొని అతి సహజంగా ఆవిర్భవించిన ఉద్యమం ఇది. కనుకనే రొమాంటిక్ కవులలో మొదటి తరంవారికి సమకాలీన సమాజానికి ఎట్టి సంఘర్షణ ఏర్పడలేదు. 1820 సం॥ తర్వాత ఒక అవాంతరదశ ఏర్పడింది. యూరోపా ఖండంలో జరిగిన రాజకీయ సంఘటనలు, ఈ కాలంలో విశేష ప్రభావాన్ని కనబరచాయి. ఈ తరం కవులకు సమకాలీన సమాజంతో సంఘర్షణ ఏర్పడింది. ఎవరు ఎవరిని బహిష్కరించారన్నది ప్రధానం కాదు. గమనించవలసింది 'రొమాంటిక్' కవి ప్రజలకు దూరమయ్యాడని. దూరమవడం అంటే విదేశావాసం కల్పించుకోవడమే కాదు. మానసికంగా దూరమయ్యారు. ఏకాకితనం **(isolation)** రొమాంటిక్ కవుల్లో కనిపించే సాధారణ లక్షణం, 'రొమాంటిక్' కవితోద్యమం ప్రజలకు సన్నిహితం కాలేకపోయింది. తరువాత కాలంలో పూర్తిగా దూరమైంది. 'సింబలిస్టు' ఉద్యమం 'రొమాంటిసిజం' చరిత్రలో మరొక మజిలీ. 'సింబలిస్టు' కవులలో 'రొమాంటిసిజం' లక్షణాలు కనిపించడం సహజమే. మనం ముఖ్యంగా గుర్తించవలసింది 'రొమాంటిసిజం' కు విశాలమైన పరిధి, చరిత్ర ఉన్నాయని. దాని లక్షణాలు ఆ యా దేశాల సంస్కృతి, రాజకీయ వాతావరణం ఆ యా కవుల మనః ప్రవృత్తి మొదలైన వాటి మీద ఆధారపడి ఉంటాయి. ఇంగ్లండులోని 'రొమాంటిసిజా'నికి ఫ్రాన్సులోని 'రొమాంటిసిజా'నికి కొంత వ్యత్యాసం కనిపిస్తుంది; అలాగే జర్మనీదేశపు 'రొమాంటిసిజం' ఇటలీదేశపు 'రొమాంటిసిజం' తో అన్నివిధాల సంవదించదు. ఒక్క ఇంగ్లండులోనే అనేక అవాంతరభేదాలను గుర్తించవలసి వస్తోంది. అలాంటప్పుడు ఇంగ్లండులో ఒకకాలంలో ప్రవర్తిల్లిన కొన్ని కవితా లక్షణాలను భారతదేశంలోని ఆంధ్రకవిత్వాని కన్వయించి అది 'రొమాంటిక్' కవిత్వం ఔను కాదనడం భావ్యమా? ఇంగ్లండులోని 'రొమాంటిక్ రివైవల్' కు ఫ్రాన్సు ఎలా తోడ్పడ్డదో, అలాగే మన దేశంలోని నవ్య కవితోద్యమానికి ఇంగ్లండు తోడ్పడ్డది. అంతే. మనం మన సాహిత్యాన్ని విమర్శించే సందర్భంలో మన సంప్రదాయాన్ని తక్కువ అంచనా వేయకూడదు. వైష్ణవమతంకాని, ఇతర భక్తి సంప్రదాయాలుకాని 'రొమాంటిసిజా'నికి విరుద్ధమైనవి కావు. కృష్ణశాస్త్రి వైష్ణవం మోజులో పడ్డాక అంతా తారుమారైందనడం సబబు కాదు. వైష్ణవ ప్రభావం విశేషంగా ఉన్న టాగోర్ కవిత్వాన్ని 'రొమాంటిక్' కవితగానే గుర్తిస్తున్నామని కూడా మనవి చేస్తున్నా.

ఇంకో ముఖ్యవిషయం. 'రొమాంటిసిజం' 'క్లాసిసిజం' పరస్పర వ్యతిరేకాలని భావించడం సరికాదు. అవి విభిన్నమైనవేకాని, విరోధమైనవికావు. అవి రెండూ ఒక మనస్సుకు చెందిన రెండు ప్రవృత్తులు. ఒకటి బొమ్మ, ఒకటి బొరుసు. మానవుని మనః ప్రవృత్తి వ్యక్తి, జాతిపరిణామ, వికాసాలతో ముడిపడి ఉంది. కనుక ఈ రెండు సంప్రదాయాలమధ్య అడ్డుగోడలు నిర్మించడం సాధ్యంకాదు. వాంఛనీయం కూడాకాదు. కీట్సు, షెల్లీ, బైరన్ ప్రభృతులు గ్రీకు రోమన్ శిథిలాలచేత, శిల్పాలచేత, నాగరికతచేత ఆ కృష్టులైతే అందులో విప్రతిపత్తి ఏమాత్రంలేదు.

విస్తృతమైన 'రొమాంటిసిజం'ను ఒక సూత్రంలో నిబంధించాలని చేసిన ఏ ప్రయత్నం ఇంతవరకు సఫలం కాలేదు. దీన్ని ఒక సాహిత్య విభాగంగా **(category)** గుర్తించడం అసాధ్యమని తేలింది. దానిని కాలపరంగా గాని, దేశంపరంగాగాని భావించినప్పుడే ఒకవిధమైన నిర్వచనం సాధ్యమౌతుంది. తిరుమలరావుగారు ప్రధాన లక్షణం అని చెప్పింది ప్రధానం కాదనడానికి దూరం పోనక్కరలేదు. వారి వ్యాసంలోనే అది బుజువైంది. పాశ్చాత్యకవులు యాంత్రిక నాగరికతను నిరసించి ఊరుకోలేదని సోదాహరణంగా నిరూపించారు. 'బేక్ టు నేచర్' అని వాచ్యంగాను, వ్యంగ్యంగాను, క్రియాత్మకంగాను 'రొమాంటిసిస్టు'లు గత్యంతరం చెప్పారు. అలాంటప్పుడు ''ఆలోచనా సరణిలో ప్రతిదాంట్లోను అనంగీకారం **(dissnt)** చూపిస్తూ గత్యంతరంమాత్రం చెప్పక తప్పించుక తిరుగుట'' ప్రధానలక్షణమని ఎలా అంగీకరించగలం?

ఆత్మాశ్రయత్వం 'రొమాంటిక్' కవితా లక్షణం కాదన్నారు తిరుమలరావుగారు. దానికి వారు చెప్పిన కారణం విచిత్రంగాఉంది. ఆత్మాశ్రయ కవిత్వం ఉత్తమ పురుషలో ఉండాలట! ఆత్మాశ్రయతను మనం ఇంగ్లీషులో 'సబ్జక్టివ్' అన్నమాటకు పర్యాయపదంగా వాడుతున్నాం. కవిత్వం వ్యక్తినిష్ఠమని నమ్ముతుంది 'రొమాంటిసిజం'. ఈ వ్యక్తి నిష్ఠతను ఆత్మపరంగా కోల్‌రిజ్ ప్రభృతులు వ్యాఖ్యానించారు. అంతర్దృష్టి **(inwardness)**కి రొమాంటిసిజంలో ప్రాచుర్యం ఉంది. కాని రచన ఉత్తమ పురుషలోనే సాగాలని ఎక్కడా నియమం లేదు. షెల్లీ ప్రభృతుల కవితలో ఉత్తమ

[ మిగతా 63వ పేజీలో ]

డాక్టర్ ఎస్. గంగప్ప

# తెలుగు ఏకాంకికలు - సామాజికస్పృహ

"సాహిత్యానికీ సమాజానికీగల సంబంధం పూర్వంనుంచీ బహుధా గుర్తింపబడింది. సాహిత్యంలో సామాజిక చైతన్యం ప్రతిఫలిస్తుంది. సమాజం పరిణామశీలమై, ఉద్యమాలద్వారా మారుతూ ఉంటుంది. ఈ ఉద్యమాలు నడిచే విధానంలో నాటికీ నేటికీ భేదం ఉండవచ్చు. కానీ ఉద్యమాలనేవి సమాజంయొక్క జీవ లక్షణం. "సాహిత్యంయొక్క సముచిత కర్తవ్యం, సామాజిక చైతన్య స్వరూపాన్ని ఎప్పటికప్పుడు స్వచ్ఛందంగా ప్రతిబింబిస్తూ ఉండటమే."[1] కాబట్టి తెలుగులోని ఏకాంకికల్లోను సామాజిక స్పృహ లేదా చైతన్యం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. వాస్తవానికి తెలుగులో ఏకాంకికా రచన ఆరంభమయ్యేసరికి తెలుగు సాహిత్యంలో నవచైతన్యం వికాసం చెందుతూంది. తెలుగు సాహిత్యంలోని ఈ నవచైతన్యం ఆంగ్లసాహిత్య ప్రభావంతోనే కలిగిందనడంలో అత్యుక్తిలేదు.[2] అద్యతనయుగంలో తెలుగులో ఆరంభమైన ఏకాంకికల లక్షణాలను, ఆరంభవికాసాలను, వాటిలో ప్రతిఫలించిన సామాజిక చైతన్యాన్ని సంగ్రహంగా వివరించడమే ఈ వ్యాసోద్దేశం.

నిర్వచనం:— ఒకే అంకం గలది ఏకాంకిక. ఒకే అంకం గల రూపకాలు సంస్కృతంలో ఉన్నాయి. దశరూపకాల్లో వ్యాయోగ, ఉత్సృష్టికాంక, ప్రహసన, భాణ, వీధులు అనే ఐదు రూపకాలూ; పదునాలుగు ఉపరూపకాలూ ఏకాంక పరిమితాలు.[3] వీటితో సంబంధంలేనివి తెలుగులోని ఏకాంకికలు. ఇవి వాస్తవానికి ఆంగ్లంలోని 'One Act plays' ప్రభావంతో ఆధునికయుగంలో ప్రబలినట్లు స్పష్టమవుతుంది. ఈ One Act plays సైతం పాశ్చాత్య దేశాల్లోను నవీనమైనవే. ఖండకావ్యానికి కావ్యానికీ, కథానికకు నవలకూగల సంబంధంలాంటిదే ఏకాంకిక నాటకాలకూగల సంబంధమనడం స్పష్టం. ఒకటిమాత్రం మనం గుర్తుంచుకోవడం అవసరం. నాటకాన్ని సంక్షిప్తం చేసిన రూపంమాత్రం ఏకాంకిక కాదు.దేని శిల్పం దానిదే. ఏకాంకికా లక్షణాల్ని ఈవిధంగా చెప్పవచ్చు. చాలావరకు రచన క్లుప్తమై, ప్రదర్శనలో ఒక గంటకాలపరిమితిని మించనిదై, వస్తువు ఏకనాయికమూ, ఏక దివస ప్రయోజ్యమూ అయి ఉండాలి. వస్తువేదైనా జీవితానికి దగ్గరగా ఉండడం అవసరం. ఇందులో సంఘర్షం (conflict) అద్భుతం, ఔత్సుక్యం అన్న లక్షణాలు ఉండడం ముఖ్యమే. రచనా శిల్పం ప్రముఖ పాత్ర వహిస్తుంది. అన్నిట సంక్షిప్తత (Brevity) అవసరం. ఏదో ఒక సందేశమో, జీవిత వ్యాఖ్యానమో శిల్పానుగుణంగా ఉండడం ముఖ్యమే. ఏకాంకిక ఏకరంగంగా ఉండడం ప్రధానం. అయినా రెండు రంగాలున్నా స్థలాంతరాలు అతిసమీపం కావడం ముఖ్యం.[4] కథానికా లక్షణాలే ఏకాంకికకు కుదురుతాయి. Graham Balfour పండితుడు కథానికా రచనకు కారణాలు త్రివిధమని చెప్పాడు. "There are, so far as I know, three ways and three ways only, of writing a story. You may take a plot and fit characters to it, or you may take a character and choose incidents and sitnations to develop it, or you may take certain atmosphere, and get actions and persons to realise it."[5]. అంటే వస్తువున కనుగుణంగా పాత్రలనూ, లేదా పాత్రల కనుగుణంగా సన్నివేశ సంఘటనలనూ లేదా, ఒక సందేశానుగుణంగా పాత్రలను, సన్నివేశాలనూ కథానికా రచనలో కల్పించడం జరుగుతుందని అర్థం. ఇది ఏకాంకికకు సర్వవిధాలా సరిపోతుంది. ఇక్కడే ఏకాంకికకు, నాటికకుగల భేద సాదృశ్యాల్నిసైతం తెలుసుకోవడం అవసరం. నాటిక ఏకాంకికకంటే పరిమితిలో పెద్దది; నాటకంకంటే కొంచెం చిన్నది. తెలుగులోని నాటికకు సంస్కృత నాటికకు సంబంధంలేదు, పేరులో తప్ప. కాగా, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారూ, డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారూ, శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారూ ఏకాంకిక, నాటికలను అభేదంగానే వ్యవహరించడం గమనించదగ్గది[6] . ఏమైనా ఏకాంకికా నాటికలకు రెంటికి సంబంధించింది నా యీ వ్యాసం.

పుట్టు పూర్వోత్తరాలు : ఏకాంకికలు అద్యతన యుగంలోనే తెలుగులో ఆరంభమయ్యా యన్నది పూర్వోక్తం. అద్యతన యుగంలో పాశ్చాత్య సాహిత్యాల మూలకంగా తెలుగులో అనేక సాహిత్య ప్రక్రియలు వెలిశాయి. ఖండకావ్యం, నవల, కథానిక, నాటకం మొదలైన ప్రక్రియలు పేర్కొన దగ్గవి. ఇలాగే ఏకాంకిక రూపొందింది. వాస్తవానికి ముందే పేర్కొన్నట్లు పాశ్చాత్య భాషల్లోను ఆధునిక యుగంలో మాత్రమే ఈ ఏకాంకికలు (one Act plays) వెలువడ్డాయి. తదనుసారంగా అనేక విధాలుగా ఏకాంకికలు తెలుగులో సైతం వెలువడి కళాఖండాలుగా రూపొందాయి. 1920 తరువాత ఒకపక్క పాశ్చాత్య సాహిత్య ప్రభావమూ, మరోపక్క జాతీయోద్యమావశ్యకమూ ప్రజల్లో అధికం కావడంతో

తెలుగులోనూ అనేక నూతన ప్రక్రియలు తలెత్తాయి. వ్యావహారిక భాష ప్రాధాన్యం వహించింది. కేవలం వచన నాటకాలకు ఆధిక్యం కలిగింది. ఇంకా జాతీయ భావాలు వెల్లి విరిశాయి. సాంఘిక జీవిత విశేషాలను వ్యక్తం చేయగల నాటకాలు వచ్చాయి. అలాంటివాటిలో 1930 ప్రథమ ప్రదర్శనతోనే ఆంధ్రులను అమితంగా ఆకర్షించింది రాజమన్నారుగారి 'తప్పెవరిది' నాటకం. క్రమంగా సంఘంలో పలుమార్పులు రాసాగాయి. మానవజీవితం యాంత్రికంగా మారింది. మానవునిలో ఎట్టి క్లేశమూలేక సుఖ సంతోషాలు పొందాలన్న ఆసక్తి అధికమైంది. కనుకనే చిన్న చిన్న రచనలు ఆవశ్యకమయ్యాయి. అందువల్లనే ఖండకావ్యాలు, కథానికలు, నవలికలు లాగానే నాటికలు, ఏకాంకికలు రచించబడుతూ వచ్చాయి. పైగా సంఘ దురాచారాల్ని దుయ్యబట్టడానికి చిన్న రచనలైన ఏకాంకికలు చాలా ఉపకరించాయి. తెలుగు నాటకారంభ దశలో కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు సంస్కృతంలో ఏకాంకమైన 'నరకాసుర విజయ వ్యాయోగా'న్ని అనువదించి ఉండడం గమనించదగ్గ విషయం. అయినా తెలుగులో ఏకాంకికల పూర్వరూపాలు ప్రహసనాలే. ఈ ప్రహసన రచనలోను అన్ని ఇతర సాహిత్య ప్రక్రియలకు లాగానే కందుకూరి వీరేశలింగం పంతులుగారే ప్రథములు. కానీ ఇవి చాలావరకు శిల్పదృష్టిలో పరిణతాలు కావు. కనుక ఆ తరువాత వెలసిన ఏకాంకికలకు ప్రాధాన్యం వచ్చింది శిల్పంలో. "ఆ రచనల (ఏకాంకికల) కు ఇంచుమించుగా 1925 ప్రాంతములో బయలుదేరిన సాహితి, సఖి, జయంతి, ఉదయిని, కళ, జ్వాల, వీణ, శారద, ప్రతిభ, భారతి మొదలైన పత్రికలు విశేష ప్రచారము నొసగినవి. 'సాహితీ పత్రికతో ప్రారంభమై, సఖిలో ప్రవృద్ధమై, ప్రతిభలో పరాకాష్ఠకు వెళ్ళింది ఏకాంకిక' అన్నారు స్వామీశివశంకరులు. (ఏకాంకికలు—పీఠిక—పుట 21)" 7

ప్రసిద్ధులైన ఏకాంకికా రచయితలు :— కళాత్మకమైన ఏకాంకికా రచయితల్లో రాజమన్నారు, చింతా దీక్షితులు, చలం, నార్ల, ఆత్రేయ ప్రముఖులు. వీరి పూర్వులూ, సమకాలికులూ అయినవారిలో పేర్కొనదగ్గవారు విశ్వనాథ కవిరాజు, భమిడిపాటి కామేశ్వరరావు, తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి, ముద్దుకృష్ణ, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి ప్రభృతులు. కానీ వీరి రచనల్లో ఏకాంకికలతో పాటు నాటికలు గూడా ఉన్నాయి. రాజమన్నారు, నార్ల, ఆత్రేయ మొదలైన ప్రముఖ ఏకాంకికా రచయితల జాడల్లో అనేకులు ఏకాంకికలు, నాటికలు పుంఖాను పుంఖంగా రచించ నారంభించారు. వీరిలో మల్లాది అవధాని, మల్లాది వేంకటకృష్ణ

శర్మ, నోరి, జి. వి. కృష్ణారావు, బుచ్చిబాబు, పాలగుమ్మి, గోరా, కొప్పరపు సుబ్బారావు ముఖ్యులు. నేటి రచయితల్లో కొర్రపాటి, అనిసెట్టి, పినిసెట్టి, సుంకర, భమిడిపాటి రాధాకృష్ణ, నాగభూషణ్, పోతుకూచి, గొల్లపూడి, రావూరి భరద్వాజ, ఆది విష్ణువు, గణేష్ పాత్రో ప్రభృతులు ఎన్నదగినవారు.

ఉద్దేశాలూ, లక్ష్యాలూను : ఇందరు రచయితల చేతు లలో తీర్చి దిద్ద బడిన ఏకాంకికలు పలురకాలు. ''ఇతి వృత్తమును బట్టి సాంఘిక, చరిత్రాత్మక, మనస్తత్వ చిత్రణాత్మక, పౌరాణికాది భేదములను కల్పించుకొనవచ్చును. రచనా శిల్పము ననుసరించి, వాస్తవిక, కాల్పనిక, సాంకేతికాది భేదములును కలవు ... రచన యొక్క ఉపాధిభేదము ననుసరించి స్థూలముగా ఏకాంకికలను పద్య గద్యములుగా విభజింప వచ్చును.'' [8] వీటికి డా. శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు చెప్పిన వ్యాఖ్యాన దృష్టిగలవీ, జీవిత సన్నివేశ చిత్రణ గలవీ, ఉపదేశాత్మకాలైనవీ, అన్న ఏకాంకికా భేదాలను అనుబంధంగా పేర్కోవటం సముచితమే. [9]

ఈ పైని పేర్కొన్న అన్ని రకాల ఏకాంకికల్లోనూ కాలాను గుణంగా సామాజిక చైతన్యం ప్రాముఖ్యం వహించిందనడంలో సందేహం లేదు. యువకుల్లో నవచైతన్యం వెల్లివిరిసింది. అభ్యుదయ బావపరంపర ప్రజల్లో నెలకొంది. సంఘ సంస్కర ణంతోపాటు కుల, మత, వర్గ, వ్యక్తుల మధ్య సంఘర్షణను తొలగించాలన్న ఆదర్శం ప్రబలింది. ఆర్థికమైన అసమానతల్ని తొలగించాలన్న ఆకాంక్ష ఆదిక్యం వహించింది. మూఢ విశ్వాసాల నుంచీ, అనవసరమైన ఆచారాల పేర జరిగే అనాచారాలనుంచీ, ప్రజలను తప్పించాలన్న తపన, తాపత్రయం అధికమయ్యాయి. స్త్రీల సమస్యలకు పరిష్కారం చేకూర్చాలన్న అభిలాష తీవ్రతర మైంది. ఈ భావాలు, ఉద్దేశాలు ఏకాంకికా, నాటికా రచయితల్లో ప్రాముఖ్యం వహించాయి. తన్మూలంగా ఏకాంకికా, నాటికలు రచిత మయ్యాయి. ఇవన్నీ సమస్యాపూరితాలు. సమస్యలకు కొన్నింట పరిష్కారాలు సూచితం. ఇంకకొన్ని సందేశాత్మకాలు. సామాన్యంగా ఈ ఉద్దేశాల్ని ప్రతిబింబించడానికి పూనుకొన్న రచయితలందరికి సాంఘికేతివృత్తాలే శరణ్యం. అయినా పురాణేతివృత్తాల్ని గ్రహించి అందులో సామాజిక స్పృహతో రచించడంగూడా కొన్నింట జరిగింది. ఇదే విధంగా చారిత్రకేతి వృత్తాల్ని గ్రహించి, అపూర్వ పరిశోధన గావించి చక్కటి నవీన భావాలతో, అభ్యుదయ పథంలో రచించిన వారూ ఉన్నారు. మన దేశ ప్రజల్ని, సంఘాన్ని పీడిస్తున్న అనేక సమస్యలను ఇతివృత్తాలుగా స్వీకరించి చక్కటి శిల్పంతో, ప్రయోగ దృష్టితో, సముచితమైన సంభాషణ, సన్నివేశ కల్పనలతో, ప్రాణ మైన పాత్రచిత్రణ చణత్వంతో తెలుగులో ఏకాంకికలు ఎంతో వైవిధ్యంతో రచితమయ్యాయి. కొన్ని నగరజీవితాన్ని చిత్రిస్తే, కొన్ని పల్లె జీవితాన్ని వర్ణిస్తాయి. మధ్యతరగతి జనం పడేపాట్లను వివరించేవి కొన్ని గలవు. సగటు మనిషి సంసారయాత్రలు, సంపాదన, జీవిత యాత్రలను వివరించేవి ఉన్నాయికొన్ని.

సమన్వయం :— పూర్వోక్తమైనట్లు సంఘ సంస్కరణో ద్యమ ప్రభావంతోను, అభ్యుదయ భావాలతోను హేతువాదం, సామ్యవాదం, స్వభావవాదం మొదలైనవాటితో ఏకాంకికా నాటికలు రచిత మయ్యాయి. స్త్రీల సమస్యలు వస్తువులుగా స్వీకరించి నాటికలు రచించిన వారు రాజమన్నారు, చలం మొదలైనవారు. రాజమన్నారుగారు ఆ నాడు స్త్రీలకు జరుగుతున్న అన్యాయాల్ని తమ నాటికల్లో ఖండించారు. మగవాళ్ళు స్వార్థ పరులై స్త్రీలకు చేసే అన్యాయాల్ని కన్నులకు కట్టినట్లు వర్ణించి ఖండించారు. ఇందుకు వారి 'ఏమి మగవాళ్లు, నిష్ఫలం' మొదలైనవి గ్రహించ వచ్చు. సెక్స్ జీవితం, దానివల్ల కలిగే కష్టనష్టాలకు ప్రాధాన్య మిచ్చి తదుచితంగా రచనలు చేసినవారు చలంగారు. ప్రేమ, త్యాగం, వివాహవిధిపై తిరుగుబాటు వీరి నాటికల్లో మనం చూడ గలం. ఇంక స్త్రీ పురుష సంబంధాలకు విలువగట్టే ప్రమాణాల ద్వైవిధ్యాన్ని ఖండించడం చలంగారి నాటికల్లో ప్రాధాన్యం వహి స్తుంది. స్త్రీల సమస్య అనేకం—చలం, రాజమన్నారు, ముద్దు కృష్ణ గార్లలో మనం చూడగలం. ముద్దు కృష్ణగారి 'రాధాకృష్ణుడు' నాటికలో సమాజంలో భార్యా భర్తలకు ఉండవలసిన సమానత, తద్వారా చక్కటి సాంసారిక జీవితం ప్రతిబింబించారు.

ఆధునిక యుగంలో హేతువాదానికి విశిష్టత, ప్రాధాన్యము వచ్చాయి. తన్మూలంగా హేతుబద్ధమైనప్పుడే విశ్వసించడానికి ప్రయత్నించే మానసిక స్థితిలోనికి వచ్చారు ప్రజలు. 'ఇది ఇంతే, ఇదే ఆచారం, పెద్దలు చెప్పారు' — అంటే నమ్మే స్థితిలో లేరు ప్రజలు. కనుకనే ప్రతి విషయానికీ హేతువును వెదకడం ఈనాడు సంఘంలో మనం చూస్తున్నాము. మూఢాచారాలు, అంధవిశ్వా సాలు మొదలైనవాటిని ఖండిస్తూ చక్కగా హేతుబద్ధంగా చెప్ప డానికి యత్నించారు రచయితలు. అలాంటివారిలో జి. వి. కృష్ణ రావుగారిని గ్రహించవలసి వుంది. వారి 'ఆదర్శ శిఖరాలు' నాటికల సంపుటిలో ముఖ్యంగా 'యాదవ ప్రళయం, ధమ్మిలం, దానధార' మొదలైన నాటికల్ని పేర్కోవచ్చు. ఇవి పౌరాణికాలే అయినా ఈ నాటి సామాజిక స్పృహతో, చక్కటి హేతువాదంతో, శిల్ప రమణీయంగా రచితమైన నాటికలు. ఇక్కడే చలం, రాజమన్నారు, బుచ్చిబాబు మొదలైనవారిని పేర్కోవడం అవసరం. పౌరాణికేతి వృత్తాల్ని గ్రహించి, ఆధునిక భావస్ఫోరకంగా రచించినవారు ముద్దుకృష్ణ, చలం మొదలైనవారు. మూఢ నైతిక తత్వాలను నమ్మి, దాని మూలంగా పెంచుకొన్న డంబాచారాలపై దెబ్బ తీయడం రాజమన్నారు, చలంగార్ల నాటికల్లో ప్రాముఖ్యం వహిస్తుంది.

హేతువాదంతోపాటు సామ్యవాదంసైతం ఏకాంకికల్లో ప్రాధాన్యం వహించడం గమనించవచ్చు. ఆర్థికమైన అసమానతల్ని తొలగించి చక్కటి సామ్యవాదం నెలకొల్పాలన్న ఆశా, ఆకాంక్ష ఉన్న ఏకాంకికా రచయితలూ ఉన్నారు. జి. వి. కృష్ణారావుగారి 'భిక్షాపాత్ర' ఇందుకు చక్కటి ఉదాహరణ. ముద్దుకృష్ణగారి 'అనార్కలి'లో ఆర్థిక వ్యవస్థకు, ప్రేమకు మధ్య ఏర్పడిన సంఘ

ర్షణ అభివ్యక్తం చేయబడింది ఎంతోమనోజ్ఞంగా. ఉన్నవారు, లేని వారు ఒకటిఅయ్యే అవకాశంలేని దుస్థితి వర్ణితం. ఒకటి కావా లన్నది మనకోరిక.

ఆధునికయుగంలో స్వభావవాదానికి **(Realism)** ఒక ప్రాముఖ్యం ఉంది. ఈ స్వభావవాదం రెండువిధాలు. ఒకటి నగర జీవితానికి సంబంధించిరది. మరొకటి పల్లి జీవితానికి సంబంధించింది. నగరాల్లో, పట్టణాల్లో నివసించే కార్మికులు, మధ్యతరగతి వాళ్ల సంపాదన చాలక పడేపాట్లను చక్కగా చిత్రించారు ఎంతో స్వాభావికంగా. అలాంటి వాళ్లలో ఆత్రేయ ప్రప్రథమంగా పేర్కొన దగ్గవారు. మధ్యతరగతి ప్రజల కడగండ్లను కన్నులకు గట్టినట్లు చిత్రిస్తూ చక్కటి రచనలు చేసినవారు ఆత్రేయగారు. సుంకర గారినిసైతం ఇక్కడే పేర్కొనడం అవసరం. రాజమన్నారుగారు కూడా పట్టణవాసులకు సంబంధించిన ప్రజలనే గ్రహించారు. ఇంక పల్లి జీవిత ప్రతిబింబం నార్లవారి నాటికలు. జానపదులలోని స్పర్థలు, ఈర్ష్యలు, అసూయలు, మూర్ఖత్వాలు, సంకుచిత భావాలు మొదలైనవాటిని సహజంగా చిత్రించి, వారిలోని సహజమైన మంచితనాన్ని, నిష్కపటతను చక్కగా ప్రతిబింబించారు నార్లవారు తమ 'కొత్తగడ్డ' నాటికల సంపుటిలోని నాటికల్లో. ఇంతటి ఇతివృత్త వైవిధ్యమూ, తన్మూలంగా అనల్ప శిల్పకల్పనతో గూడిన నాటికలు లేవంటే అత్యుక్తి కాదు.

ఆధునిక యుగంలో పాశ్చాత్య సాహిత్య పఠనంవల్ల మనలో అనేకరీతులు వచ్చిచేరాయి. మనస్తత్వ శాస్త్రాధ్యయనంతోపాటు విభిన్న పాశ్చాత్య సిద్ధాంతాలతో పరిచయాన్ని తమ రచనల్లో ప్రవేశపెట్టి చక్కటి శిల్పంతో నాటికలు రచించినవారు బుచ్చిబాబు, గోపీచంద్ మొదలైనవారు.

ఇంకా రచనా పాటవంతో, వ్యంగ్యం, శిల్పం, సన్నివేశకల్పన, పాత్రచిత్రణ మొదలైన లక్షణాలతో ఎంతోచక్కగా నాటికలు, రచించిన వారెందరో ఉన్నారు. వర్గభేదాలు, సంఘర్షణ, ప్రేమ, దాని వివిధ రూపాలు, గతులు, ఆర్థికమైన అసమానతలు, 'సగటు మనిషి' సాంసారిక జీవితయాత్ర, కులవ్యవస్థ, వరకట్నం మొదలైన విషయాలను గ్రహించి, యథార్థవాదం, ప్రతీకవాదం మొదలైనవాటి ప్రాధాన్యంతో చక్కగా ఈనాడు అనేకులు రచనచేస్తూ ఉన్నారు. కానీ నాటకరంగానికి తగిన ప్రోత్సాహం లేదనే చెప్పాలి. నాటికలు మరింతగా ఉత్తమమైనవిగా రావలసి ఉంది.

ఉపసంహారం : ఇంత చెప్పాక ఏకాంకిక, నాటికల్లో రావలసిన ఉత్తమమైన మార్పులను డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు చెప్పిన మాటలను ఉట్టంకిస్తూ, అవి అత్యవసరమని నొక్కి చెప్పడమే ఈ వ్యాసానికి పరిసమాప్తి. "తెలుగు ఏకాంకిక పత్రికా భూమివదలి, రంగభూమిలోకి రావాలి. శ్రీ రాజమన్నారుకి నిశితమైన భాష, శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రికి లోతులు చూడగలదృష్టి అలవడాలి. నార్ల సందేశానికి బరువూ, బుచ్చిబాబు వాక్యాలికి వక్తృత్వమూ అలవడాలి. శ్రీ కృష్ణశాస్త్రి కవితాకన్యకి ఇహలోకయాత్రా, శివశంకరశాస్త్రి పాండిత్యానికి కార్యదీక్షా అలవాటవాలి. అయితే ఏకాంకికాలకి రంగాభిషేకం, విశ్వసాహిత్యంలో ప్రవేశించిన తెలుగు ఏకాంకికలకి అప్పుడూ విభాతమహోత్సవం". **10** ఈ హెచ్చరికలు ఇందు పేర్కొన్న ఆయా రచయితలకి కాదు; ఈనాడు, తరువాత రాస్తున్న, రాయబోయే వారికి చక్కటి మార్గదర్శకాలు కావలసిఉంది. ఆనాడు తెలుగు ఏకాంకికకు కూడా, తదితర సాహిత్య ప్రక్రియాల్లాగే ప్రాముఖ్యమూ, ప్రాచుర్యమూ రాగలవని ఆశించవచ్చు!

## అథోజ్ఞాపికలు

1. శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు :— తెలుగు సాహిత్యంలో సామాజిక చైతన్యం—ఆంధ్ర పత్రిక—సౌమ్య సంవత్సరాది సంచిక—1969—70. పు 124, 130.
2. పైదే పు : 125
3. డా. పి. ఎస్. ఆర్. అప్పారావు :- తెలుగు నాటక వికాసము: పు 74—77.
4. పై మూడో సూచికలోనిదే—పు 491
5. **W. H. Hudson :- The study of the short story— 'An introduction to the study of Literature'-P342**
6. (i) పై మూడో సూచికలోనిదే—పు 488
   (ii) డా. శ్రీపాద : ఉపోద్ఘాతం—రాజమన్నారు నాటికలు.
   (iii) శ్రీ కూర్మా : తొలివలుకు ప్రసిద్ధ నాటికలు.
7. (i) పై మూడో సూచిక లోనిదే—పు. 492
   (ii) శ్రీ కూర్మా: తొలిపలుకు—ప్రసిద్ధ నాటికలు—పు xiii
8. డా. కొత్తపల్లి వీరభద్రరావు : ఏకాంకిక—తెలుగు విజ్ఞాన సర్వస్వము—సంపుటము—3. పు 738.
9. తెలుగు ఏకాంకిక—భారతి: విరోధి పుష్యము—పు 43_46
10. భారతి—విరోధి పుష్యము—పుట 46

---

# రొమాంటిసిజం

[ 59 వ పేజీ తరువాయి ]

పురుష లేదనడం కూడా సాహసమే. ఒక్క **'Ode to the west wind'** చదివినా తెలుస్తుంది. తిరుమలరావు చెప్పింది తప్పని. **'Myth'** రొమాంటిక్ కవిత్వంలో ఎంత పాత్ర వహించిందో, లాక్షణిక కవిత్వంలో కూడా అంతేపాత్ర ధరించింది. దానికి విశేష ప్రాధాన్యాన్ని, ప్రాచుర్యాన్ని కల్పించింది 'రొమాంటిసిస్టు'లే అనడంలో సందేహంలేదు. కాని దాన్ని ప్రత్యేక లక్షణంగా చెప్పడం సమంజసంగా కనిపించదు. ఇంతకూ **'Myth'** ను ఏ అర్థంలో వాడారో మనకు తెలియదు.

ఏవిధంగా చూసినా తిరుమలరావుగారి వ్యాసం అసంతృప్తికరంగా ఉంది. తెలుగు సాహిత్యంలో 'రొమాంటిసిజం' గురించి ఇంకా లోతుగా పరిశీలన జరగాలి.

# కలగూరగంప

## తెనుగు మఱుగులు

నన్నెచోడుని కుమార సంభవములోని షష్ఠాశ్వాసమునందు పార్వతి పరమేశ్వరునిగూర్చి తపస్సు చేయుటకై యరణ్య ప్రవేశము చేయు సందర్భమునం దీ క్రింది పద్యము కలదు.

చ. వరతరుకోట రాహిఫణవర్గము దేనులుసావి తద్వనే
చరియలు రాఁగ బోవుచు భుజంగఫణావళిగా నెఱింగి చె
చ్చెరఁ బెడఁబాసి పోవునెడఁ జెల్వుగఁ బూచిన కాఁదపువ్వు ల
య్యెఱుఁగమి దాయ నోడుదు రహివ్రజశంకవిభీతచిత్తలై.
కుమా 6—44

ఈ పద్యమునందలి పాఠవిచార చర్చయు, నర్థసమన్వయ విధానమును తెనుగుమఱుగులను నీ వ్యాసపరంపరయం దిదివఱకొకమాఱు చేయబడినది. వాని నెల్ల నిట పునరుక్తము చేయక యందు పేర్కొనబడిన కాఁదపువ్వులనుగూర్చి మాత్రమిపుడు కొంత చర్చింతము. స్థూలముగా నీ పద్యార్థము నిట్లు చెప్పకొనదగును.

ఆ యరణ్యమునందలి వృక్షకోటరములలో సర్పములు నివసించుచుండెను. అందలి చెంచెతలు ఆ సర్పములనుగాంచి తేనెతెట్టెలని భ్రమించి వాని నొడియ బోయిరి. కాని వెంటనే యవి తేనెతెట్టెలు గావనియు, పాము పడగల మొత్తమనియు నిజ మెఱిగి యటనుండి వెడలిపోవుచుండిరి. అట్లు పోవుచుండగా వారికి మఱొకచో కాద పువ్వు లగపడెను. వానిని జూచి పూర్వానుభవజ్ఞానమువలన నవి పాముల మొత్తమేమో యను సందేహము కలుగ మిక్కిలి భీతి చెందిన హృదయములు గలవారై వారు వానిని సమీపించుటకు భయపడుచుండిరి.

ఇట తొలుత వారు నిజము పాములను తేనెతెట్టెలని భ్రమించిరి. పిదప యథార్థ మెఱిగి వానికి దూరము చనిరి. అట్లు చనుచుండగా వారికి తమ యెదుట విరియబూచిన కాఁదపువ్వు లగపడెను. అవి పాములవలె దృగ్గోచరము కాగా నవి పాము లేమో యనుసందేహము కలుగ వానిని సమీపింప వెనుకాడిరి —అనుటవలన తొలుత నొక భ్రమ, దాని యపనోదనము, మఱల పూర్వానుభవజ్ఞానముచే నేర్పడిన శంక, తదనుసారియైన ప్రవర్తనము ననునవి మిక్కిలి మనోహరముగా నభివర్ణింపబడి యీ కల్పనము కడుంగడు మనోజ్ఞముగా నున్నది. ఇట గమనింపవలసిన ముఖ్యాంశము కాఁద పువ్వులకును, పాములకునుగల సామ్యము. ఆ సామ్యముమీద నాధారపడినదే యీ వర్ణనము. ఇట్టి సామ్యము మనకు పరిచితము కాదు: సంస్కృత సాహిత్యమునందుగాని, తెలుగు సాహిత్యమునందుగాని యీ యౌపమ్య మెచటను ప్రస్తావింపబడలేదు. అందుచే నీ సంప్రదాయమునకు మన మితరభాషా సాహిత్యముల నాశ్రయింపవలసి యున్నది. అసలు 'కాఁదపువ్వులు' ఎట్టివో మనకు తెలియని విషయము. ఒక్క నన్నెచోడుడు తప్ప మఱి యెవ్వరును తెలుగున నీ పూవులను ప్రస్తావించినట్లు కానరాదు. నన్నెచోడుని ప్రయోగము ననుసరించియైనను మన నిఘంటుకారులు తమ నిఘంటువులందీపదమును గ్రహించినట్లు కానబడదు. నన్నెచోడుని కుమార సంభవ మప్పటికి ప్రకటింపబడకపోవుటచే శబ్దరత్నాకరమునందది గ్రహింపబడక పోవుట న్యాయమే. మఱి, తత్ప్రకటనానంతరము వెలువడిన సూర్యారాయాంధ్ర నిఘంటువునందును, వావిళ్ల నిఘంటువునందును గూడ నీ పదము గ్రహింపబడకపోవుట మిక్కిలి విచార్యము. మదరాసు విశ్వవిద్యాలయమువారు 1948లో ప్రచురించిన కుమార సంభవముయొక్క పరిష్కృత ముద్రణమునందు చివర పదములపట్టిక—అర్థాదులు అను శీర్షికక్రింద అకారాది క్రమమున కూర్చి యొసగిన యపూర్వపదములలో నీ పదము గ్రహింపబడి యున్నది. కాని యందు దానికి ఆశ్వాస పద్య సంఖ్యలను సూచించుటతోబాటు 'వనపుష్పములు' అని యర్థము గూడ నొసగబడియున్నది. ఇది పుష్పవిశేష మనుటవలెనే యున్నది. కాని యా వస్తుస్వరూపము నెఱుగుట కేమాత్రము నుపకరించుటలేదు. ఆ పరిష్కరణమునకు సమకూర్చిన లఘు వ్యాఖ్యలో నీ పద్యము విషయము అసలు ఊసులోనికిగూడ రాలేదు. మఱియు దానికి శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు సంతరించిన పీఠికలో మాత్రము 36వ పుటలో—

'ఆంధ్ర సాహిత్యమునకు గ్రొత్త యగు పదజాలము —పదబంధములు అనేకములు కల' వనుచు, కన్నడ సాహిత్య సంపర్కము వలన గలిగిన వనదగినవానిలోఁ గొన్ని—యను శీర్షికక్రింద నొసగిన పదములలో 'కాఁద పూవులు' కలదు. కాని దానికి ఆధారములు వివరములను వారు పేర్కొన లేదు. అందుచే నది కన్నడ సాహిత్య సంపర్కమువలన గలిగిన దనుట యెట్లో మనకు తెలియరాకున్నది.

కన్నడ సాహిత్య సంపర్కము విషయ మేమోకాని యిది ప్రాచీన తమిళ సాహిత్యమున మిక్కిలి ప్రసిద్ధి చెందిన పుష్పముగా కానవచ్చును. అందు దాని పేరు 'కాంద'. ప్రాచీన తమిళ సాహిత్యమున పెక్కు స్థలములలో నీ పుష్పము పేర్కొనబడి యున్నది. 'కపిలర్' అను ప్రాచీన తమిళ కవీశ్వరుడు రచించిన 'కురింజి ప్పాట్టు' (శైల గీతము) అను కవితయం దీ పుష్ప ప్రస్తానము కలదు. 'కురింజిప్పాట్టు' ప్రాచీన సంఘ సాహిత్యమునకు చెందిన రచనముగా భావింపబడుచున్నది. అందు నాయిక తన చెలికత్తెలతో కలసి జలక్రీడ లాడిన పిదప నా వనమునందలి వివిధజాతుల పుష్పములను [కోసి] యొక శిలపై రాశిగా పోసెనని వర్ణించు సందర్భమున తొంబది తొమ్మిది పుష్ప జాతుల పేరులు ఒక పట్టికగా నొసగబడి యున్నవి. అందు పేర్కొనబడిన పుష్పనామములు ప్రాయికముగా తమిళ భాషా పదములు. చంపకము, పలాశము అను రెండు సంస్కృత నామములు మాత్ర మందు కానుపించును. అందు ఆ పట్టికలో తొలుత పేర్కొనబడిన పూవు 'కాంద'. అందలి ప్రయోగ మిట్లు కలదు.

'వళ్ ఇదష్ ఒణ్ శెజ్ కాన్దళ్'

—కురిం జిప్పాట్టు

ఇందు పూవు మాత్రమే పేర్కొనబడినది. కాని దాని గూర్చిన యితర వివరములు కానరావు.

ప్రాచీన తమిళసాహిత్యమునం దితరత్ర యీ పుష్పము ప్రస్తావింప బడిన స్థలము లీ దిగువ తదర్థ పురస్సరముగా నొసగ బడుచున్నవి. వీని మూలమున నా పుష్ప స్వరూప స్వభావములు కొంత గోచరించును.

1. నెడువరై మిసైయ కాందళ్
(పొరున రాట్రుప్పడై—209వ పంక్తి)
సుదీర్ఘమయిన కొండలోని కాందళ్.

2. అరువి ఆర్కుం పెరువళై అడుక్కత్తు
కురుతి ఒప్పిళ్ కమళ్ పూం కాందళ్
(నట్రినై—399వ పంక్తి)
సెలయేఱులు శబ్దించుచుండు పెద్ద పెద్ద కొండవరుసల యందు నెత్తురును బోలిన వాసన మిగులు అందమయిన కాందళ్.

3. ... ... ... కాందళ్
మెల్ ఇసై కుషైయ ముయంగళుం
(కుఱుందొనై—361 పంక్తి)

కాందళ్ పుష్పముయొక్క మృదు దళములు వాడునట్లు కౌగిలించుటయు—(నాయకునితోడి సంబంధము కలిగినవను కారణ మున నాయిక యా దళములను కౌగిలించుకొనినది)— దీనిబట్టి యీ పుష్పముయొక్క దళములు మిక్కిలి మృదువులుగా నుండు నని తెలియుచున్నది.

4. ... ... కాందళ్ అంగొషు ముగై
(కుఱుందొగై— 265 పంక్తి)
కాందళ్ యొక్క అందమయిన క్రొవ్విన మొగ్గ.

5. సెంబుడై క్కొషుముగై అవిఴ్న్ద కాందళ్
(నట్రినై—294 పంక్తి)
ఎఱ్ఱ నయిన, క్రొవ్విన మొగ్గలు విరిసిన కాందళ్.

6. కాందళ్ అంగొషు ముగై పోన్రన్న సివందే
(నట్రినై—379 పంక్తి)

కాందళ్ యొక్క అందమయిన, క్రొవ్విన మొగ్గలనుబోలి యెఱ్ఱగా నుండినవి (వ్రేళ్లు)

4, 5, 6 ప్రయోగముల సహాయమున నీ పుష్పము యొక్క మొగ్గలు క్రొవ్వి యుండునని తెలియును.

7. మ్రామడల్ అవిఴ్న్ద కాందళ్
(నట్రినై—14 పంక్తి)



కాందళ్—గ్లోరియోసా సుపర్బా

పెద్ద దళములు వికసించిన కాందళ్.

8. ... ... ... కాందళ్
నీ డిదష్ ...
(అగనానూఱు 78—8)
కాందళ్ పుష్పముయొక్క సుదీర్ఘములయిన దళములు.

7, 8 ప్రయోగములనుబట్టి వీని దళములు పెద్దవిగాను, దీర్ఘములుగాను నుండునని తెలియును.

9. నాఱు కులై క్కాందళ్
(ఐంగురునూఱు—226)
వాసన కలిగిన, గుత్తులుగా నున్న కాందళ్.

10. సిలమ్బు కషష్ కాందళ్ నఱుంగులైయన్న

నలమ్బెలు క్కైయిన్ కన్ పుదైత్తోమే
(ఐంగుఱునూఱు—293)

కొండ నంతను పరిమళభరితము చేయు కాందళ్ పుష్పముల వాసన కలిగిన, **పూగుత్తివోలె** నున్న, మంచి కలుగు చేతులతో కన్నులు మూసినదానా!

11. సిలమ్బుడన్ కమఱుం అలఙ్గు కుల్లై క్కాందళ్
(కుఱుందొగై—239)

కొండ మొత్తము వాసనకలిగిన, గుత్తులు గుత్తులుగా నున్న కాందళ్.

12. ... ... ... కాందళ్
సిలమ్బుడన్ కమఱుం సారల్
(నట్రిణై—294)

అంతటను కాందళ్ పూల వాసన కలిగిన పర్వతసాను ప్రదేశము.

9, 10, 11, 12 ప్రయోగములను బట్టి యీ పూవులు మిక్కిలి వాసన కలిగి యుండుననియు, గుత్తులు గుత్తులుగా పూయుననియు తెలియును.

ప్రాచీన తమిళ సాహిత్యమున స్త్రీల వ్రేళ్లు కాందళ్ పూలతో నుపమింపబడుట పదింబదిగా కానవచ్చును. అవి యెఱుపు, తెలుపు, కలిసిన వర్ణము కలిగియుండుట కారణము కావచ్చును. దాని పరిమళము నాయిక నుదురుయొక్కయు, శరీరముయొక్కయు వాసనతో నుపమింప బడుట కూడ కానవచ్చును.

ప్రాచీన తమిళ సాహిత్యములోని పయి ప్రయోగములు 'కాందళ్' పుష్పము యొక్క స్వరూప స్వభావములను తెలియ జేయుచు నది పర్వత ప్రాంతములందు సెలయేళ్ల ప్రక్క పెరుగు లతా పుష్పమని తెలియుచున్నది. కాని యీ కాందళ్ పుష్పమునకు ఫణముతో సామ్యము కల్పింపబడి ప్రస్తుతమునకు పనికివచ్చు ప్రయోగ మొకటి మనకు 'అగనానూఱు' అను సంకలన గ్రంథము నందు కాన వచ్చును. ఆ సందర్భమిట్లు కలదు.

'విరవు ప్పొలి మఞ్ఞై వెరీఇ అరవిన్
అణంగుడై యరుందలై పై విరిప్పవై పోల్
కాయా మెన్మినై తోయ నీడి
పల్తుడు ప్పెడుత్త అలంగు కుల్లై క్కాందళ్'
అగనానూఱు—108 ప.

'కలసిన వారి బాధలు తీర్చి కనికరించుట విజ్ఞులగువారి కుచితముకదా! అట్లుండ, నేల చెలీ! యీ కొండలఱేడు మనపై కొంచెమేని కనికరము పూనక, రాత్రులందు వానలు కురిసిన నడిరేయిలో, భయంకరము లగు మృగములు వాసము చేయు మార్గమున నొంటరిగా వచ్చుచున్నాడు'— అని చెలి నాయకుడు విను నట్లుగా నాయికతో పలుకుచున్నది. రాత్రిరారా దనియు, వివాహము చేసికొన వలసిన దనియు చెలి నాయకునికి పరోక్షముగా బోధించుచున్నది. కొండలఱేడు కదా! అత డెట్టివాడో కవి తెల్పుచునిట్లు వర్ణించును. ఆ వర్ణనయే పయి నుదాహరింపబడిన పద్యభాగము.

'నెమలికి వెఱచి పాము తన భయంకరమయిన పడగను విప్పినట్లుగా, 'కాయా' యను వృక్షముయొక్క మృదుశాఖలయందు చేరి సుదీర్ఘములయిన పెక్కు దళములు కలిగి యల్లల నాడుచున్న గుత్తులుగా నున్న కాందళ్ పుష్పములందు వాసన మిగులు మరందము గ్రోలెడి తుమ్మెదలు, మొయిలు లాడుచుండగా చదరంగపు పలకమీది కాయలవలె నుండు శిఖరములు కలిగిన కొండలకు ఱేడు' —

ఇచట 'కాందళ్' పూగుత్తి నెమలికి వెఱచిన పాము విప్పిన పడగవలె నుండెనని యభివర్ణితము. దీనిబట్టి కాందళ్ పూవులకు పాము పడగతో నౌపమ్యము ప్రాచీన తమిళసాహిత్యమునం దున్నట్టు తెలు చున్నది. ఈ యౌపమ్య సంప్రదాయమునే నన్నెచోడుడు 'అగనానూఱు' పరిచయముతో తన కుమార సంభవమునందు గ్రహించి యుండు నన వచ్చును. నన్నెచోడునికి తమిళసాహిత్య సంప్రదాయములతో పరిచయ ముండుట యితర సందర్భములను బట్టి కూడ నిరూపిత మగుచుండుటవలన నిదియు నా సంప్రదాయాను సరణ ఫలమే యని గ్రహించుటలో తప్పు లేదు. కుమార సంభవమునందలి పద్యములో 'కాంద పువ్వులు' అను పదము అర్ధానుస్వారసహితముగా నుండుట గమనింప దగియున్నది. అది తమిళములోని 'కాందళ్' పదముయొక్క వికారమే యనుట దాని మూలమున నిర్ధారిత మగుచున్నది. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తమ పీఠికలో తెలిపినట్లు ఈ ప్రయోగము కన్నడ సాహిత్య సంపర్కఫలమేమో యింకను పరిశీలింపవలసి యున్నది. అంతదనుక నిది తమిళ సాహిత్యానుసరణ ఫలమని భావించుటయే యుక్తమనిపించును.

శ్రీ జె. యం. సోమసుందరం పిళ్లై అను తమిళ విద్వాంసుడు రచించిన **"A History of Tamil Literature with Texts and Translations"** అను గ్రంథమున (1967 లో ప్రకటితము) ఈ కాందళ్ పుష్పమునకు ఆధునిక వృక్షశాస్త్రము నందు ప్రసిద్ధ మగు నామ ముట్టంకింపబడినది. అది **Gloriosa Superba** అని యందు పిలువబడును. అందే వారు కాందళ్ పుష్పముయొక్క చిత్రమునుకూడ సాహిత్య విద్యార్థుల యవబోధమునకై ముద్రింపజేసి యున్నారు. పాఠకుల సౌకర్యార్థమది యిట పునర్ముద్రింపబడు చున్నది.*

(చూ. ప్రక్క పుట) తమిళ నిఘంటువులలో నీ పదమునకు

---

* కాందళ్ పుష్పమునకు సంబంధించి ప్రాచీన తమిళ సాహిత్యమునందలి యాకరముల నొసగి సహాయము చేసిన బహుభాషా విద్వాంసులు, రాజపాళయము వాస్తవ్యులు శ్రీ ముదునూరు జగన్నాథ రాజుగారికి నా కృతజ్ఞతలు.

'కార్తికైప్పూ' అనికూడ నర్థ మొసగబడి యున్నది. కార్తిక మాసమునందు విశేషముగా పూచు పుష్పమని యీ పదము తెలియ చేయుచున్నది.*

—డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్య

# కవిత్వమంటే ఏమిటి ?

మార్చి 'భారతి' సంచికలో ఇస్మాయిల్‌గారి 'కవిత్వమంటే ఏమిటి?' అన్నే వ్యాసం చదివి ఆశ్చర్యపోయాను. భావకవిత్వం ముమ్మరంగా వచ్చేరోజుల్లో వస్తే కొద్దో గొప్పో న్యాయం చేకూరేది అనిపించే ఈ వ్యాసాన్ని 1977లో చూడటమే నా ఆశ్చర్యానికి కారణం. ఇస్మాయిల్‌గారికి చరిత్ర తెలియదా? భావకవిత్వం తర్వాత అభ్యుదయ కవిత్వోద్యమ మొకటి వచ్చిందనీ, భావకవిత్వ యుగంలోనూ, ఆ తర్వాతా కవిత్వ నిర్వచనాల గురించీ, ప్రయోజనం గురించీ ఎన్నో తర్జన భర్జనలు జరిగాయని తెలియదా? తెలిసినా పట్టించుకోలేదా? తెలిస్తే చర్విత చర్వణంగా, ఇంత అస్పష్టంగా కవిత్వ చర్చ చేస్తారా అనిపిస్తుంది. సరే, ఇస్మాయిల్‌గారు తమ చర్చలో చేసిన వ్యాఖ్యానాలన్నింటినీ ఒక్కొక్కటే పరిశీలిద్దాం.

"రెండోక్లాసు వాచకంలో ఆవుగురించి పాఠముంటుంది. ముందు ఆవుబొమ్మ ఇచ్చి కింద దాన్ని వర్ణిస్తాడు. 'ఆవంటే ఏమిటి?' అనే ప్రశ్నకి ఇది సరైన సమాధానమనుకుంటాను. ఆవుని చూడని పిల్లలుంటారనుకోను. కాని కవిత్వమంటే తెలీనివాళ్లు కొంతమంది ఉండొచ్చు. వేరే మృగాన్ని దేన్నో చూసి కవిత్వమని భ్రమపడుతున్నవాళ్లు ఉండొచ్చు."

దేన్నోచూసి కవిత్వమని భ్రమపడుతున్నవాళ్ల భ్రమని పటాపంచలు చేయడంకోసం నిర్దేశింపబడిందీ వ్యాసం అని తెలుస్తుంది. దానికోసం పై ఉదాహరణ నిచ్చారు. చిన్న పిల్లలకు ఆయనే అన్నట్టు ఆవు అంటే ఏమిటో తెలుసు. మరి తెలియని దేమిటి? ఆవుని గురించిన సమాచారం తాలూకు "భాష" మాత్రమే. పిల్లల వాచకాల్లో బొమ్మలకూ వాటికి సంబంధించిన భాషకు associationను సాధించటమే ప్రధాన ప్రయోజనం. పిల్లలు జంతువుల మధ్యవుండే తేడాని బయటి ప్రపంచంలో నేర్చుకుంటారే తప్ప, పుస్తకాల్లో నేర్చుకున్నాకకాని బయట గుర్తిస్తారు అని కాదు గదా! అయితే 'ఆవంటే ఏమిటి?' అనే దానికి సమాధానంగా బొమ్మకింద 'వర్ణిస్తారు' అనటం ఎంతటి అవాస్తవికమైన తర్కమో ఆలోచించాలి. పైగా దానికీ కవిత్వానికీ ముడిపెట్టడం.

సరే, ప్రబంధాల్లో శబ్దాల గోలలో కవిత్వపుగొంతు విన పడదు అనే ఉద్దేశంతో ఓ జానపద గేయాన్నీ, ఆధునిక కవిత్వం లోంచి ఓ మూడు కవితల్నీ విశ్లేషణకు ఎన్నుకున్నారు. చిత్తగించండి.

తొలకరి ఒకమబ్బు తొంగిచూసింది
మబ్బులో ఒక మెరుపు మెరిసి పోయింది,
పెరిటిలో ఒకజల్లు కురిసి వెలిసింది—
జల్లులో నా మనసు జారిపోయింది.

ఏ కొమ్మమీదనో ఎండతాకిన పిట్ట
ఏటి తోవలపట్టి ఎగిరిపోయింది
ఏరువాకనాటి కేడాది దాటింది
ఎదురు చూసినగుండె చెదిరిపోయింది

దీనికి ఇస్మాయిల్‌గారి వ్యాఖ్యానమిది!

ఇందులో ఉన్నవి—తొలకరి మబ్బూ, మెరుపూ, వానజల్లూ, ఎండతాకినపిట్టా, ప్రియునికోసం ఎదురుచూసే మనసూ, వివిధమైన ఈ వస్తుసామగ్రి ఒకచోట ఒకక్రమంలో పేర్చేటప్పటికి వీటిని అధిగమించిన ఒక తెలివిడి, ఒక అనుభవం భాసించింది. ఈ తెలివిడి మనహేతుబుద్ధికి పట్టుపడేది కాదు. బుద్ధికాక మరో జ్ఞానేంద్రియమేదో వుంది మనలో. అనుభూతీ, ఉద్రేకానికి సంబంధించింది. హృదయమంటాం దాన్ని. ఈ జ్ఞానం దాన్ని సూటిగా తాకుతుంది."

కవిత్వాన్ని విశ్లేషించటానికి అనేక పద్ధతులున్నాయి. అందులో Formal approach ఒకటి. ఆ పద్ధతిలోనే ప్రయత్నం జరిగింది, పై గేయంలో. కేవలం గుడ్డి అనుభూతివాదంతో బుద్ధిని నిర్లక్ష్యం చేయడం ఇందులో కన్పిస్తుంది. కవిత్వంలోవుండే సామగ్రి అంతా ఒకానొక నిష్పత్తిలో కలిసినప్పుడు కలిగేదే అనుభూతి. ఇదిమొత్తంగా కలుగుతుందే కాని వేరువేరుగా కలగదు. ఇక్కడ హేతుబుద్ధి ప్రసక్తి అసలే లేదంటారు ఇస్మాయిల్‌గారు. పై గేయంలో "నా మనసు జారిపోయింది" అనే పంక్తి అనుభూతియొక్క స్థితి. ఆ స్థితికి కారణం పై మూడు పంక్తుల్లో వున్న 'మబ్బు తొంగిచూడటం, మెరుపు మెరవటం, జల్లు కురవటమే'

"ఎదురు చూసినగుండె చెదిరిపోయింది" అనే స్థితి కలగడానికి కూడ పై పంక్తులే హేతువు. హేతుప్రసక్తిలేని 'కేవల' అనుభూతివాదం అస్పష్టతకూ, అయోమయత్వానికీ నిదర్శనం. ఏ కల్పనాశక్తిగాని, ఎట్లాంటి జ్ఞానంకాని హేతువు కతీతంగా వుండవు. బుద్ధికాక మరో జ్ఞానేంద్రియమేదో వుందన్న ఇస్మాయిల్‌గారు అదేమిటనే ప్రశ్నవస్తుందని "ఆ జ్ఞానేంద్రియం హృదయం" అంటారు. హృదయం జ్ఞానేంద్రియం అనేది ఎట్లా అర్థం చేసుకోవాలో తెలియదు. Reason is attached to imagination and understanding is to knowledge—coleridge.

ఇక ఏల ప్రేమింతును? అనే కృష్ణశాస్త్రిగారి గేయం. 'ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?' అనేదానికి సమాధానంగా ప్రశ్నారూపమైన జవాబులతో ఈ ఖండిక సాగుతుంది. పువ్వు ఎందుకు వాసనలు చిమ్ముతుందో, చంద్రుడెందుకు వెన్నెల వెదజల్లుతాడో, నీళ్లెందుకు పారుతాయో, గాడ్పెందుకు వీస్తుందో

అదేవిధంగా నేను నిన్ను ప్రేమిస్తున్నాను అనే అర్థంలో సాగుతుంది.

''...ఐతే, పదశబ్దాలూ, విశిష్టలయా కలిగిన ఈ సంవిధానానికీ, ఈ కావ్యం అర్థానికి సంబంధం ఉందంటారా? కొంత ఉండొచ్చు. కాని కార్య కారణ సంబంధం మాత్రంలేదు'' అని అంటారు ఇస్మాయిల్ గారు.

**Content expression** లకు మధ్య ఎక్కడా స్పష్టమైన రేఖని గీయలేము. హృదయం భావ శబలితమైనప్పుడు తదనుగుణమైన శబ్దాలను అదే తొడుక్కుంటుంది. భావావేశ తీవ్రతను బట్టి తన నడకను అదే నిర్ణయించుకుంటుంది. సంబంధం కొంత ఉండొచ్చు అనే అనుమానం కూడ ఇస్మాయిల్ గారికి అక్కర్లేదు. వాటికి తప్పకుండా కార్య కారణ సంబంధం ఉంటుంది. ఉండదనుకోవటం అస్పష్ట భావవాదానికి చిహ్నమే. ఇస్మాయిల్ గారు ''పద శబ్దాలు''అనే సమాసం వాడారు.దాని అర్థంఏమిటో ఆయనవివరిస్తే బాగుండును. కొందరు కవులు పదాలచేత వ్యభిచరింపజేయటానికి ప్రయత్నాలు చేశారని బాధపడ్డారు. పదాలతో వ్యభిచరించినా, 'ధర్మ'బద్ధంగా సంసారం చేసినా శబ్దసిద్ధిలేని కవి మంచి కవిత్వం రాయలేదు.

కృష్ణశాస్త్రిగారి గేయంలో ''ప్రేమించటానికీ, గాలి విసరటానికి సంబంధం బుద్ధికి లబ్ధమయేదికాదు'' అంటారు ఇస్మాయిల్ గారు. కృష్ణశాస్త్రిగారు ''ఏల ప్రేమిస్తావు?'' అని ప్రశ్నించిన వారిని మళ్లీ ప్రశ్నలు వేయలేదు. గాలివీచటం ఎంత సహజమో నేను ప్రేమించటం అంత స్వాభావికం అని ఆయన వుద్దేశం. ఇంత స్పష్టంగా అర్థమవుతున్నా ఇది బుద్ధికి లబ్ధం కాదంటారు. అసలీ గేయంలో వున్నవి ప్రశ్నలు అనుకోవటంలోనే వుంది పొరపాటంతా. అవి కేవలం దృష్టాంతాలు. అందులో తర్కం కూడాలేదు.

ఇక హనుమయ్యగారి కవిత చూడండి.

''జీవులంటే జీవితానికి
ప్రయోజనాతీతమైన ఇష్టగోష్టి.
పసిపిల్లలకు పాలివ్వాలని
రసలుబ్ధులకు పానకం పోయాలని
భయస్తులకు బ్రాందీ తాపాలని
సోక్రటీసును మాత్రమే
విషపాత్రికతో సవాలు చేయాలని
దానికి తెలుసు''

''జీవులంటే జీవితానికి ప్రయోజనాతీతమైన ఇష్టగోష్టి ఔనో కాదో సామాన్య బుద్ధికి తర్కనీయాంశమేమో కాని, ఈ కావ్యంలో పరమసత్యం'' అంటారు ఇస్మాయిల్ గారు. అసలు ''జీవులంటే జీవితానికి ప్రయోజనాతీతమైన ఇష్టగోష్టి'' అంటే ఏమిటో ఇస్మాయిల్ గారు చెప్పలేదు. 'జీవులు', అంటే ఎవరోకూడ అన్వయం చెప్తే బాగుండును. పైగా ''జీవితం అందరిచేతా విషం తాగించదు. ఒక్క సోక్రటీసునే ఎన్నుకుంటుంది ఈ పనికి. ఇక్కడ తర్కానికి చోటులేదు'' అని వ్యాఖ్యానించారు. సోక్రటీసుతో విషం తాగించింది జీవితం కాదు సమాజం. ఆయన్నే ఎందుకు ఎన్నుకుందో అందరికీ తెలుసు. అనేకులైన మహా వ్యక్తులను సమాజం ఎందుకు హతమార్చిందో ఆ కారణాలు ఎవరికీ కొత్తకాదు. కాని ఇస్మాయిల్ గారు మాత్రం కారణం ఇంతస్పష్టంగా తెలిసినా తర్కానికి చోటులేదు అంటారు. ఇక్కడే ఇస్మాయిల్ గారి ఆలోచనా ధోరణి మనకు అర్థమవుతుంది. ఇక్కడ కారణం ఇస్మాయిల్ గారికి తెలియకకాదు. కాని అవి ఉన్నాయని ఒప్పుకోవటం ఇష్టంలేదు. ప్రతిదాన్నీ అనుభూతి పేరుతో అస్పష్టతను సృష్టించటం వీరికి ఇష్టం. ఏనాడో కాలదోషం పట్టినవ్యక్తి వాదానికీ, ఆత్మాశ్రయ ధోరణికి ప్రతీకగా ఇస్మాయిల్ గారు కవితా సిద్ధాంతాలు ప్రతిపాదిస్తున్నారు.

పైగా ''వచన కవిత్వం అనే పదం అర్థహీన మనుకుంటున్నాను. నిజమైన కవిత్వానికి ఒక అర్థసంవిధానమూ, ఒక ఆకృతీ వుంటాయి. ఈ లక్షణాలే కవిత్వాన్ని వచనాన్నించి వేరుచేస్తాయి'' అంటారు.

ప్రాచీనుల్లోగాని, ఆధునికుల్లోగాని ఎంతో కవిత్వం ఛందోబద్ధమైనది మనకుంది. దానినుంచి దీనిని గుర్తించటానికే సౌకర్యం కోసం మాత్రమే 'వచన కవిత్వం' అనిపించుకుంటున్నాం. ఛందోబద్ధమైన గతి లేకపోవడమే దీని ప్రధాన లక్షణంగా గుర్తిస్తున్నాము. ఇది కేవలం నడకకు సంబంధించింది మాత్రమే. ''నిజమైన కవిత్వానికి ఒక అర్థసంవిధానమూ, ఒక ఆకృతీ వుంటాయి.'' ఇస్మాయిల్ గారు సంవిధానం అనే పదం ఏ అర్థంలో వాడుతున్నారో గాని సంవిధానం అంటే కూర్పు (Treatment). కవిత్వానికి ఆకృతి వుంటుంది అంటే అది Formకి అనువాదమేనా? కవిత్వానికి వుండేది ''ప్రక్రియే'' కాని ఆకారంకాదు. పుస్తకాల్లో రాసే లిఖిత సంప్రదాయాన్నిబట్టి అది కనిపిస్తుందనుకుంటున్నారేమో కాని

---

## సవరణ

మే నెల 'భారతి'లో ప్రకటితమైన సుబ్రహ్మణ్యకవి వ్యాసంలో 10 వ పేజీలో ''1730 సం॥ర ప్రాంతంలో చిత్తూరు జిల్లాలో జన్మించి'' బదులు ''1780 సం॥ర ప్రాంతంలో చిత్తూరు జిల్లాలో'' అనియు, అదే పేజీలో ''బహులాశ్వ చరిత్ర రచించిన'' పిమ్మట ''గ్రంథకర్త సవితి తమ్ముడు'' అనియు 13 వ పేజీలో ''బహులాశ్వచరిత్ర గ్రంథకర్త'' పిమ్మట ''సవితి తమ్ముడు'' అని చేర్చియు చదువుకొన ప్రార్థితులు.

వ్యాస రచయిత
*ముక్తేవి శ్రీరంగాచార్యులు.*

అది కవిత్వ పరిధిని పరిమితం చెయ్యటమే.

ఇస్మాయిల్‌గారి వ్యాసంలోని ప్రధాన లక్షణం అస్పష్టత. కవి అంటే సమాజంతో సంబంధంలేని ఓ ''ప్రత్యేక వ్యక్తి'' అనే అభిప్రాయం వీరికుంది. సమాజం అనగానే రాజకీయాలు అనే భయము కూడ వుంది. ఏమైనా కవిత్వాన్ని గురించి కవిత్వ భాషలో చెప్తే వచ్చే చిక్కులు ఇస్మాయిల్‌గారి వ్యాసంలో వున్నాయి.

—శ్రీ ఎన్ గోపి

## లేఖ

# విమర్శకుల హక్కులు-బాధ్యతలు

భారతి—ఫిబ్రవరి 77—లేఖలు— డా. మురళీధర్‌గారికి, సూక్ష్మంగా సమాధాన నివేదన.

నా విమర్శ పడిన 'భారతి' సంచిక (76) అక్టోబర్ నెలది కాదు, నవంబరుది.

ఈ పదం బదులు మరోపదం వాడివుంటే కవిత మరింత సొగసుగా వుండేదనో, ఈ పదంవల్ల కవిత్వం (కవిత్వానికి—అని వుండాలి) తగిన గాంభీర్యం రాలేదనో చెప్పే 'హక్కు' విమర్శకుని కుంది—అన్నారు మురళీధర్‌గారు. ''తోటివారి కన్నీరు'' అనే మాట ఎల్లోరా తన పుస్తకానికి వ్రాసుకొన్న మున్నుడి (వచన కవితా ప్రక్రియ)లో వాడారు.'కవిత' లో వాడిందని డా. మురళీధర్ పొరపడుతున్నారు. ఎల్లోరా పుస్తకం, మరుపూరు సమీక్ష చూడ కుండా లేఖ వ్రాశారా మురళీధర్ గారు?

ఒక మాట బదులు మరొక మాట వాడితే బాగుండుననే సూచన చేసే 'హక్కు' విమర్శకునికుండ వచ్చుగాని, ఆ హక్కును దుర్వినియోగపర్చి కవి మనసు గాయపరచకుండా జాగ్రత్తపడటం గూడా విమర్శకుని 'బాధ్యత' గదా? ఒక పదం బాగుంది, ఒక పదం బాగ లేదు అనే అభిరుచి వ్యక్తి నిష్ఠమేగాని సార్వజనీనం కాదు. ఒక్కొక్కరికి ఒక్కొక్కటి అభిరుచికరం. పైగా మరుపూరు 'తోటి' అన్నది నింద్యగ్రామ్యం, 'తప్పు' అన్నారు. కాదు ఒప్పు అని నేను సూచించాను. ఇప్పటికీ ఆయన వాడకూడదంటున్నారు. ఆయన వాడకపోవచ్చు. వాడినవారిది తప్పనడం వ్యవహార జ్ఞానం లేకపోవడం అవుతుంది. కొబ్బరిచెట్టు అనకూడదు, టెంకాయ చెట్టు అనవలెను—అనటం గొప్ప విజ్ఞత గలసూచనా? ఆయన 'పొరటలు' అంటారు; పుటలు అంటే బాగుండదా? పేజీలు అంటే తప్పా? ఎవరు నిర్ణయించ గలరు వీటి చక్కదనాలు? స్త్రైణత్వాన్ని, మనోసింహాసనం, చమట్బొడ్చి వంటి మాటలు వాడుతూ (స్త్రైణాన్ని, మనస్సింహాసనం, చెమటోడ్చి—అని వుండాలి మరి) వ్యాకరణాల ఇనుప పెట్టెలను నిరసించడం నేడు తెలుగుకు బట్టిన తెగులని వాపోవడం మరుపూరువారి చిత్తశుద్ధి యేమో నాకు తెలియదు.

'కడుపునిండా...పొట్టనిండా' వంటి ప్రయోగాలు అర్థశూన్యమని, అవి కవి భావశూన్యతకు దర్పణం వంటివని అందరకూ గోచరమవుతుంది. (గోచర మవుతాయి — అనాలి)— అన్నారు డా. మురళీధర్. ఈ ప్రయోగాల అర్థశూన్యత, భావశూన్యత ఎలాంటివో ఎల్లోరా పంక్తులు ఉదాహరించి వివరించకుండా, నేను లౌక్యంగా తప్పుకొన్నానని నా చిత్తశుద్ధిని వారు శంకిస్తున్నారు. చర్చ విస్తరిస్తుందేమోనని క్లుప్త పరిచాను. ముఖ్య దోషాలనే చర్చించాను.

ఎల్లోరా తాను వచన కవితా ప్రక్రియలో సుప్రసిద్ధులైన మరికొందరు కవుల బంతిలో తానై తన పేరు చేర్చుకొనడమే 'స్వకుచ మర్దన' మైనప్పుడు, 'నా పొట్ట సామెతల పుట్ట' అని చెప్పుకోవడం స్వకుచ మర్దనం కాదా? ఎల్లోరాగూడా తాను వచన కవితా ప్రక్రియలో చాలెంజి రాడీనని చెప్పుకోలేదు గద?

కవి అహంకారి అయితే తప్పులేదు. విమర్శకుడికే సహనం వుండాలి. రజోగుణ ప్రధానుడైన కవి అహంకృతి కలిగివుంటే అది అందమే. సత్వ సంపన్నుడు కావలసిన విమర్శకుడు రసజ్ఞత లేని వాడైతే తన 'తీర్పు'కు విలువవుండదు. అజ్ఞుడైతే చెప్పేదేముంది?

నా విమర్శగాని, శ్రీ మరుపూరు విమర్శగాని డా. మురళీధర్ అన్నట్టు ''తగినస్థాయి'' లో లేకపోతే ఎవరూ ఖాతర్ చెయ్యరని నేను స్పష్టంగా ఎరుగుదును.

—శ్రీ బండి నాగరాజు



# గ్రంథ విమర్శలు

## ఆంధ్రధాతు కథాసాగరము

[పరిచయపత్రము. స్వామి వివేకానంద విద్యాసమితి: డెమ్మీ 16 పుటలు; విద్యానగరం; హైదరాబాదు—44.

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం నాయకత్వాన ఈ విద్యాసమితివారు ధాతు కథాసాగర నిర్మాణ ప్రయత్నానికి పూనుకొనుట మెచ్చదగిన పని; ఇది బాధ్యతగల పెద్ద పని. కథాసాగరమనుటలో ప్రతి ధాతువు చరిత్ర చెప్పదలచుకొన్నట్లున్నది. ఇదే ఇప్పుడు మన దేశీయ భాషలకు గావలసిన ముఖ్యవ్యాసంగము.

ఇప్పటికి తెనుగులో చాలా నిఘంటువులు—చాలినన్ని పుట్టే ఉన్నవి. అమరం ఆంధ్రనామ సంగ్రహాదులవలెగాక, పరమట్టిదొరల పుణ్యాన అకారాది నిఘంటువులు కూర్పబడి ఉన్నవి. ఇవి—విలియం బ్రౌన్ (1817) క్యాంబెల్ (1818) మారిస్ (1835—39) మామిడి వెంకయ్య (1848) సంకలనంచేసి ప్రచురించినవి. ఇటీవలవి చాలా గలవుగదా!

ధాతువుల విషయంలో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ "ఆంధ్రక్రియా స్వరూప మణిమంజరి" రూపాన కొంత పనిచేసి ఉన్నది. అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తి ఇందు శాస్త్రీయ పద్ధతిని చూపి ఉన్నారు; దానిప్రకారం సాహిత్య అకాడమీయే కొన్ని వృత్తి పదకోశాల్ను మాండలిక పద కోశాన్ని ప్రకటించి ఉన్నారు. ఈ సంకలన కర్తలకు ఇవి అంతగా మది కెక్కినట్లులేదు; అవే జీవభాషకు పంచప్రాణాలు. ఇప్పటికి వెలువడిన డిక్షనరీలతోబాటు ఈ పనికి పూనుకొన్న పండిత ప్రకాండులు గ్రంథస్థ ధాతువులనే ఏరి వివరించగలరు. కాని, అప్పటమైన తెనుగు ధాతువులు పల్లెలలో—ముఖ్యంగా, రాయలసీమ నెల్లూరు రాయలసీమ గ్రామంలో ఇంకా ప్రాణంతో ఉన్నవి. ఈ ధాతువులను ఏరి కూర్చను వట్టి పుస్తక పాండిత్యమే చాలదు; చదువుకొన్న పల్లెటూరు వారినే ఈ పనికి ఏరి పట్టాల. "ఎడపెయ్య పైరైనది" (=ఎద్దైనది) లేక, "కందికి ఎదబెట్టాలనా? అక్కెడ బెట్టాలనా?" అంటే పట్టణ వాసులకు తలాతోక తెలియదు. వాడుక భాషను గ్రామ్యమంటే లోకం దెలియనిమాట. అధర్వణాదు కొందరు కొన్ని సందర్భాలలోనే వాడుకమాటను స్వీకరించమనడం, వారి మడిగట్టుకొన్న మానసికతత్వాన్నే తెలుపుతుంది. ఇట్టి గ్రామీణ భాషను తిక్కన, పోతన, శ్రీనాథాది మహాకవులు వాడి, ఆంధ్రావళికి మోదం గూర్చిఉన్నారు; ఇక మనకేల అరకొరల ఆంక్షలు ?

ఈ గ్రామీణ పదస్వీకారావసారాన్ని గురించి డా. బెజవాడ గోపాలరెడ్డిగారు మంచి సూచనే చేసినారు. దానిని వీరు చేపట్టవలసి ఉంటుంది. ఇంగ్లీషు మొదలగు భాషలు సర్వప్రయోగాలను స్వీకరించి, పురోగమనంలో ఎదుగుతూ మహా వాహినులవుతున్నవి.

వీరు గూడ ఇట్టి ఉదార ఆశయంతో పనికి పూనుకొనబోతున్నారని, వారి యీ పరిచయపత్రంవల్ల తెలుస్తున్నది. ఇందు వారు వేసుకొన్న ప్రశ్నలు — వారిచ్చిన సమాధానాలు సక్రమ మార్గాననే పడి ఉన్నవి. ఈ కృషి సమగ్ర ఆంధ్రధాతు మణిమాలను ఆంధ్రభారతికి అందివ్వగలదు. ఇక ధన సహాయమా? ప్రభుత్వము, విద్యాభిమాన శ్రీమంతులు ధర్మసంస్థలు చేయదగిన పని.

## కవితాలోకనం

[ సాహిత్య విమర్శక వ్యాసావళి. టి. ఎల్. కాంతారావు; డెమ్మీ— 180 పేజీలు, ధర రు 10/—; ప్రతులకు:—తెలుగు విద్యార్థి ప్రచురణలు; పోస్టు బాక్సు నెం. 1; మచిలీపట్నం ]

ఇది సాహిత్య విమర్శక వ్యాస సంపుటి. ఆధునిక కవితా రీతులను, తిలక్—శ్రీ శ్రీ—కుందుర్తి నారాయణబాబువంటి, లోక ప్రియతను గాంచిన నేటి కవుల రచనల సమీక్ష — ఇందలి ముఖ్యాంశాలు.

కాంతారావు నేటి వాఙ్మయాన్ని బాగా ఆచమించి, ఆంగ్లేయ సాహిత్యాన్ని గూడ చదివి, పోల్చిచూపి విషయ పరిశీలనం చేయగలిగి ఉన్నారు. భాషలో భావంలో స్పష్టతయే ఈ వ్రాతకు వన్నె దెచ్చే గుణము. విషయం భిన్న రుచులవారి కందరికీ నచ్చవలసిన అగత్య లేదు గదా. అయినా రచయిత తమ దృష్టి ప్రకారం గూడ నమ్మించి ఒప్పించదలచుకొన్న ప్రయత్నంలోనే ఈ గ్రంథ మున్నది.

కవితారీతుల పరిణామం భిన్నత్వం కాలానుగుణమైనవని, అప్పటి వారి అభిరుచికి తగినట్లు ఏర్పడుతుంటవి— అనినది నిందునిజము. ఈ శతాబ్దిలో భావకవిత్వం,దానిచోట అభ్యుదయ కవిత్వము, ఆ తర్వాత వచన కవిత్వం, దిగంబరకవిత్వాలు వచ్చిన వన్నారు. మార్పు చైతన్యానికి ప్రథమ లక్షణం గదా! దిగంబర కవుల ఉత్సాహాన్ని కొనియాడి, వారి మితిమీరిన ఉద్రేకాన్ని బాగానే మందలించినారు. దిగంబరకవులు నేటి స్థితిని తిట్టడమేగాని భవిష్యత్తులో అభ్యుదయ మార్గ సూచనలు చేయలేదని ఉన్నమాట అంటున్నారు.

భావకవిత్వానికి కులపతి దేవులపల్లి కృష్ణశాస్త్రి అంటారు. ఇది అపచారం. ఈ పీఠం రాయప్రోలు సుబ్బారావుగారిదే! శ్రీ శ్రీ స్థానాన్ని కాదనేవారు లేరు.

విమర్శ—దాని తత్వం, అన్న వ్యాసంలో, తెనుగులోసాహిత్య విమర్శను గూర్చిన వర్ణన బాగున్నది. ఈ దారి చూపిన కట్టె మంచి, రాళ్లవళ్లివారికి తగిన స్థానమే ఇచ్చి ఉన్నారు. కవిత్వము—ప్రయోజనము, అనే వ్యాసంలో వివిధ నిర్వచనాలు వ్రాతగాని చదువరితనానికి గుర్తుగా ఉన్నవి. "కవిత్వం చదవడంవల్ల అలౌకిక రసానుభూతి కలగడంకంటె మరొక ప్రయోజనం లేదు" అన్న భావమే అధిక సంఖ్యాకుల ఆమోదాన్ని పొందదగి ఉన్నది.

అనుకొన్నమాట జంకులేకుండా చెప్పివేయగలిగిన రచయిత **కాంతా**రావు.

## ఐదు పుస్తకాలు

## 1. స్వామీ వివేకానంద

[ స్వాములవారి జీవిత చరిత్ర—పద్య కావ్యము. శనగపల్లి సుబ్బారావు; డెమ్మీ 32 పేజీలు; వెల రు 4/— ప్రతులకు :— గ్రంథకర్త, ఆర్గనైజింగ్ సెక్రటరి, ప్రకాశం జిల్లా గ్రంథాలయ సంస్థ; రుద్రవరం; 523225. ]

భూస్థాపితమై యుండిన హిందూ ధర్మ మణులను బయటికి దీసి సానలుబెట్టి, ఆర్యవేదాంత జ్యోతికాంతులతో ప్రపంచాన్ని వెలిగించిన—హిందూమత వన పునర్వికసన వసంతుడు వివేకానంద స్వాములవారి సంక్షిప్త జీవిత చరిత్ర ఈ చిన్న పద్య కావ్యం (127 పద్యాలు) కవిత్వసాధనకు గుంట ఓనమాలుగా వ్రాసినదైనా, శైలి రీతి—భాష మంచి అచ్చులోనే పోతబోయబడి ఉన్నవి. రచన ముమ్ముందు మంచి స్థితికి రావచ్చునని తోపింప జేస్తున్నది.

ఈ కవి, స్వామిజీవితాన్ని ఇంకా విపులంగా వ్రాస్తే బాగుంటుంది.

## 2. వీణాపాణి

[ భావపురి (బాపట్ల) యువ సాహితీ సమాఖ్య సమాచార కిరణము. డెమ్మీ 12 పేజీల కరపత్రంవంటి ప్రచురణ. ప్రారంభ సంచిక జనవరి (77) ది— మూల్యం 30 పైసలు. ప్రతులకు : సమాఖ్యవారి కార్యాలయం, బాపట్ల—522101.]

"కొత్త సాహితీ కుసుమాలను కవికులవనంలో విరియింప జేయటానికి" ప్రచురింపబడుతున్న సాహిత్య పత్రిక ఇది. కవితా లహరిలో కొన్ని మంచి ఖండికలున్నవి. ఒక వ్యాసం, ఒక కథగూడ ఉన్నవి. సంచికల సంఖ్య తగ్గించి అయినా, పేజీలు పెంచి, ఎక్కువ రచనలు ప్రచురిస్తే ప్రచురించినవారికి, చదివేవారికి లాభదాయకం. ఈ ఉత్సాహం ప్రోత్సహింపవలసినదే.

## 3. నాస్తిక మార్గం

[మాసపత్రిక—ప్రథమ సంచిక. క్రౌన్ 1/4—50 పేజీలు; సాలు చందా రు 12/— విడి సంచిక రూపాయ; సంపాదకులు:— మైత్రి, హేమలతా లవణం; ప్రాప్తి స్థానం—పటమట; విజయ వాడ, 520006 ]

ఆస్తికవాదము నాస్తిక వాదము కవలబిడ్డలు; ఎప్పుడో పుట్టినవి, కొత్తలు గావు; ప్రతిదేశంలో అనాదిగా వస్తూనే ఉన్నవి. దేవుడు ఉన్నాడన్న మతాలు శాఖోపశాఖలైనవి; మానవ మేధస్సు ఎదిగేకొంది వీటి పరిధి ఎదిగిపోతూనే ఉన్నది; అనుభవమూ ఎదిగిపోతూనే ఉన్నది; గ్రంథాలు వ్రాయబడుతూనే సాధకుల అనుభూతులు వివరింపబడుతున్నవి. కాని దేవుడు లేదన్నమతం ఎదుగదు. కొత్తవాదం కొత్త అనుభూతి లేనందున ఈ మతంలో పెరుగుదలకు ఆస్కారం లేదు. తత్త్వజిజ్ఞాసను అరికట్టడం మానవ బుద్ధి వికాసాన్ని ఎదుగకుండా కత్తిరించి వేస్తుండడమే అవుతుంది. అభివృద్ధి చైతన్య స్వరూపం గదా, ప్రాణం లేనిది ఎదగడం ఎట్లా ? కాబట్టే మతచింతలేని మనసు చిన్నతనంలోనే గిటకబారి పురోగమనాన్ని నిలిపివేసుకొంటున్నదని ఒక శాఖ పండితులు అంటున్నారు.

దైవ సాక్షాత్కార మనుభవించినా మనేవారు ఎంతో పరిశ్రమించి చూచి అనుభవించిన పరిణత మనస్కులు ఎందరో ఉన్నారు. వీరిని కల్లబొల్లివారనలేము. కఠిన సాధనలేనివారు దేవుని **చూ**పమంటే సాధ్యమయ్యేదికాదు. సాధనే అనుభూతి. దైవదర్శనం వెలకు దొరికే అంగడి దినుసుగాదు. కాని **చూ**డనిదే తృప్తిపడని నాస్తికుని తృప్తి పరచగలిగినవారెవరు ?

మతం పేరిట పేరుకొనిపోయిన అజ్ఞానాంధకారాన్ని **మూఢ** విశ్వాసాలను పారద్రోలే ప్రయత్నం జాతి అభివృద్ధికి అత్యంత అవసరం; అదే సంస్కారమనిపించుకొనేది; వీరు నాస్తికులు గారు. నాస్తికులది **మొం**డిపట్టుదల. జగత్తును నడిపేది ఒక మూల శక్తి అన్నా, దేవుడన్నా మాటలలోనే భేదం.

ఈ సంఘం వారు, నీతిని నెలకొల్పి మూఢ నమ్మకాలు పోగొట్టను చేసే ప్రయత్నం సంఘ శ్రేయానికే అనక తప్పదు. నాస్తికతగూడ ఒక మతమేగదా. "వినదగు నెవ్వరు చెప్పిన" మన ఆదర్శం.

## 4. రాగమయి

[ భావగీతాలు. **శ్రీ** కేదార్; క్రౌన్—38 పుటలు. ధర—ఒకటిన్నర రూపాయ; ప్రాప్తి స్థానం :— ఎం. జి. రావు; C/o ఎం. రామశేషు; సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా; విజయవాడ—1.]

రాగమయి—రసమయి—కరుణమయీ అన్న **మూ**డు భాగా

లుగా నున్న భావగీతాల గ్రంథమిది. మొదటిది మేలుకొలుపులు; రెండవదానిలో అలుకమాని రమ్మంటాడు; చివరన కరుణమయిని సేవిస్తాడు. ఈ భావకవి సృష్టించిన ఈ మయి రూపులేని దేవ కన్య కాదు; రూపున్న మానవ కన్యగాగూడ లేదు. అ యి నా ప్రేమోన్మాదపు వెలువరింతలు బాగున్నవి. భాష ఇప్పుడిప్పుడే గూడుకట్టు కొంటున్నది. నడక సరళంగా సాగిపోతున్నది.

"వాడి వసివారి నలిగి పగిలిన హృదయాలతో జీవితాలు గడుపుటకంటె, పూవులార, కుసుమమాలలో జేరి పరమాత్మ నలంకరించుటే మేలు" అన్నగీతం పుష్పవిలాపంకంటె మంచి ధోరణిలో పడినది.

## 5. సుమసరాలు

[ మధురకవి గౌరాబత్తుని వెంకటేశ్వరరావు. ఖండికల పద్యకావ్యం; డెమ్మీ 1/8— 30 పేజీలు; వెల రు. 1—50; ప్రతులకు :— గ్రంథకర్త; సీనియర్ తెనుగు పండితుడు; B. V.+B. N. హైస్కూల్; జాంగ్రపేట.

ఈ కవి, రచన అలవరచుకొంటున్న ధోరణిలోనే ఈ పుస్తకం ఉన్నది. నడక మెరుగెక్కి ఊహాలతలు ఎగ్రబాకి మంచి పూలు పూయగలవని పాఠకునికి ఆశ గలుగుతున్నది. అక్కడక్కడా మంచి మెరుములు మెరుస్తున్నవి. ద్విరేఫాన్ని గాలి యోడపై రమ్మంటున్నాడు; మంచి భావన. తోటమాలి నిస్స్వార్థ ఆనంద మయ జీవితం బాగా వర్ణింపబడినది. "ఈ వనంబు నీ రెక్కల కష్టము" అనుట సొంపు. పెరిగినతోట ఇచ్చే ఆనందం తోట మాలి జీవితానికి ఒక తొడవు. కమ్మతెమ్మెరలో— "కూలికి మేను వంచి తనకుంగల రక్తము పిండుకొంచు గష్టాల గలంగువాని చెమటంగని యోర్వ లేక చల్లగా వ్రాలెదవా?" అన్న పరోపకార భావం హృదయంగమంగా ఉన్నది. కోయిల—బోటివి మామూలు సరుకు, పాంచాలి, అభిమన్యుడు పౌరాణికుల పాతపాట.

అభిమన్యుడు బాలకుడు అనడం తెనుగుభారతంలో వీరుల వయసులు గమనించనిమాట. ఈ మాణవకునికి యుద్ధం నాటికి 45 ఏండ్లని లెక్క. పెండ్లాము—ఉత్తర నీళ్ళు పోసుకొని ఉన్నది. ఇట్లే గీతోపదేశం పొందేనాటికి అర్జునునికి 70 దాటి ఉన్నవి. తిక్కన ఈయనకు నరసిన వెంగ్రుకలనే వర్ణించును. 'గీత (తా) పద్యాలు (8) చప్పగా ఉన్నవి.

ఈ ఉపాధ్యాయుని లేఖినినుండి, ఇంకా మంచి రచనలు వెలువడగలవని ఆంధ్ర పాఠకలోకం కనిపెట్టుకొని ఉన్నది.

## ఖడ్గనారాయణము

[పద్యకావ్యము. కోటగిరి విశ్వనాథరావు; క్రౌన్ 64 పేజీలు; వెల రు. 3/—ప్రతులకు:—గ్రంథకర్త, జిదగమువారివీధి; సూర్యా రావుపేట, విజయవాడ—2].

ఆంధ్రపౌరుషమును, వీరసంప్రదాయమును, సాహిత్యశోభను నాలుగు మూలలకు వ్యాపింపజేసే ఒక రమణీయక విచిత్ర దౌత్య గాథే ఈ చిన్న రసవత్తర కావ్యం. ఈ రాయబారి శ్రీనాథ కవి సార్వభౌముడు. కోరినది ఒక పట్టాకత్తిని. (రాయబారమనే పార సీక పదాన్ని మొదట తెనుగులోకి దింపినది శ్రీనాథుడే.)

1323లో, కాకతీయ సామ్రాజ్య పతనానంతరం రేచర్ల పద్మనాయక వీరులు—అనపోతుడు రాచకొండను, మాదానాయుడు దేవరకొండను (నల్లగొండజిల్లా) రాజ్యాలుగా స్థాపించి, తమ బాహుబల వీరభోగ్యమైన ఆంధ్రకీర్తిని పెంపొందింపజేస్తుండి నారు. రాచకొండ నాయకులలో రెండవ సింగమనాయకుడు ప్రసి ద్ధుడు (1384—1399) యుద్ధాలతో రాజ్యాన్నిపెంచి, సాహి త్యానికి చలువ పందిళ్లు బెట్టించినాడు. అనపోతనాయుడు స్వయంగా కవియై, "అభిరామరాఘవము"ను రచించి, ఆంధ్ర విష్ణుపురాణమును, సంస్కృత మదన విలాస భాణమును రచించిన నాగనాథ కవిని పోషించినాడు. ఆంధ్ర కవిత పితామహ అన్న బిరుదం వహించిన కొరవి సత్యనారనకవి రాచకొండవాడు. దేవరకొండ మాదానాయకుని ఆస్థానంలో పోతరాజు అను ఒక మహా పండితుడు, ద్విపద హరిశ్చంద్రను వ్రాసిన గౌరన, ఆయన కొడుకు భైరవకవి ఉండినారు.

రాజకొండ రెండవ సింగమనాయుడు, అనేక రణవిజయా లతో ఆంధ్రసామ్రాజ్యాన్ని విస్తరింపజేసినాడు; కవులను పోషించి నాడు. చమత్కార చంద్రిక వ్రాసిన విశ్వేశ్వరకవి, అమరకోశానికి వ్యాఖ్యానం వ్రాసిన బొమ్మకంటి అప్పయామాత్యుడు, అనర్ఘ రాఘవ వ్యాఖ్య వ్రాసిన హరిహరుడు మొదలగువారు ఈ ఆస్థానంలో వెలసిన వారు. ఈ రెండవ సింగమనాయకుడు సర్వజ్ఞ బిరుదాంకితుడు— రసార్ణవ సుధాకరము, సంగీత సుధాకరము, కువలయావళి (నాటకం) సంస్కృతమున వ్రాసిన పండితకవి.

ఈ సర్వజ్ఞుని తర్వాత, ఈయన పెదకొడుకు—రెండవ అన పోతుడు రాచకొండ గద్దెనెక్కి, సంస్కృత వ్యాఖ్యాతృ చక్రవర్తి మల్లినాథ సూరిని విశ్వవిఖ్యాతుని జేసినాడు.

తర్వాత, అనపోతరాజు తమ్ముడు— సింగయమాధవేంద్రుడు రాజ్యానికి వచ్చినాడు. ఇతడు, తండ్రి—సింగభూపతివలెనే మహా విద్వాంసుడు; రామాయణానికి (వాల్మీకి) రాఘవీయమనే వ్యాఖ్య వ్రాసినాడు. ఈ సింగభూపాలుని తర్వాత, ఇమ్మడి అనపోతుని కొడుకు—ముమ్మడి సింగభూపతి రాచకొండ రాజైనాడు. (1430—75) ఈయనకు గూడ సర్వజ్ఞ బిరుదమున్నది. బమ్మెర పోతనామాత్యుడు, మొదట భోగినీ దండకం వ్రాసినది ఈయన ప్రోత్సాహం వల్లనే.

ఇట్టి సాహిత్య రాజ్యకీర్తులతోనే, కృష్ణానదికి దక్షిణాన రెడ్డిరాజుల రాజ్యం వెలసినది. అద్దంకి కొండవీడు, ఆవల రాజ మహేంద్రవరం సంస్థానాలలో కుమారగిరి, కాటయవేమ, పెద కోమటవేమారెడ్లు; వేమ, వీరభద్రారెడ్లు ప్రఖ్యాతిగాంచి, రణ పండితులు సాహిత్య పండితులు అయినారు. ఎఱ్ఱాప్రెగడ, వామన భట్టు, శ్రీనాథమహాకవి మొదలగువారిని పోషించి తెనుగువాణిని రాణింపజేసినారు.

కాని, రెడ్లకు వెలమలకు రాజ్యానికి పోరు జరుగుచునే

# సావిత్రి

[ నాటకము. రచన : శ్రీ కొత్త రామకోటయ్య. ప్రచురణ : మాస్టర్ యోగమిత్ర మండలి, గుంటూరు—2. డెమ్మీ సైజు, 157 పుటలు. వెల 8 రూ. ప్రతులకు— (1) తెలుగు శాఖ, శ్రీ అరవిందాశ్రమం, పాండిచేరి—2. (2) శ్రీ అరవింద సొసైటీ, బోస్ రోడ్, తెనాలి. (3) శ్రీ ఎ. వి. శర్మ, మాస్టర్ యోగ మిత్రమండలి, 4/5 ఆరండల్‌పేట, గుంటూరు—2. ]

మహా ప్రజ్ఞాశాలి శ్రీ అరవింద యోగీంద్రులు పాశ్చాత్య సంస్కృతిని సమగ్రంగా అవగాహన చేసికొని, మన వేద సంప్రదాయాలను, భారతీయ సంస్కృతిని చక్కగా అధ్యయనంచేసి భారతీయ మహర్షుల ఉత్కృష్టతను నిర్ణయించిన మహనీయులు. పుదుచ్చేరిలో యోగాశ్రమాన్ని స్థాపించి, లోనున్న చీకటిని జ్ఞాన దీప్తిచేత తొలగించి మానవజాతిలో దివ్యత్వాన్ని సంక్రమింపజేసిన మహనీయులు. జ్ఞానదృష్టితో ఎన్నో రచనలు సాగించారు. ఆయన మహాభారతంలోని సావిత్ర్యుపాఖ్యానం తీసుకుని, దాన్ని జ్ఞాన మార్గంలో సమన్వయ పరుస్తూ 'సావిత్రి' అనే నాటకాన్ని రచించారు. వారి యందును, దేవమాత (హోలీమదర్) యందును అపారమైన భక్తి, శ్రద్ధలు కల యోగ మిత్రులు కొత్త రామకోటయ్య గారు ఆ నాటకాన్ని తెలిగించి ఆంధ్రుల కందిస్తున్నారు. వారి యోగ గురువులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సారస్వతాంశం యొక్క లవలేశం, శ్రీ దేవమాతగారి దివ్య ప్రబోధం యొక్క ప్రోత్సాహం లభించినందున ఈ రచన ఆయనకు సాధ్యమైనట్లు వారి 'సూచన' వల్ల తెలుస్తున్నది.

రచయిత భుక్త రహిత రాజయోగ సాధకులలో ముఖ్యులు. ఆ యోగ మార్గాన్ని కనిపెట్టి ఎందరో ఉత్తమ యోగమిత్రులను తయారుచేసిన మాస్టర్ సి. వి. వి. గారి ప్రత్యక్ష శిష్యులలో ప్రధానులైన వేటూరి ప్రభాకర శాస్త్రిగారి శిష్యులు! ఆ యోగ మార్గంతోపాటు సాహితీ మార్గంలోనూ సాధనచేసి, యోగమార్గానుయాయులకు అసాధ్యమైన యీ రచనను సాధించారు.

తనకు సంస్కృతాంగ్రాలు రావనీ, స్నేహితులతో యోగ విషయాలు మాట్లాడుకొనుటకు కావలసిన పరిచయం మాత్రం ఆ భాషాద్వయంతో ఉన్నదనీ, స్నేహితులతో యోగ విషయాలు మాట్లాడేతీరుననే యీ రచన సాగిందనీ రచయిత అంటున్నారు. వీరు చక్కని వచన రచననేకాకుండా ఇంపుగా పద్యాలుకూడా వ్రాయగలరని యీ నాటకాన్నిబట్టి తెలుస్తున్నది. తనకు సంస్కృతాంగ్రాలు రావని చెప్పకోవడం వారి వినయభావాన్నీ, నిరాడంబరతనూ తెలియజేస్తున్నది.

ఇది నాటకమయినా ప్రదర్శనయోగ్యం మాత్రం కాదు. ఇలాటివాటిని ప్రదర్శించినా జన సామాన్యాన్ని ఆకర్షింపలేవు. ప్రబోధ చంద్రోదయం, సంకల్ప సూర్యోదయం మున్నగు వేదాంత నాటకాలవంటిదిది. విషయం సుబోధంగా ఉండడానికి సంభాషణ రూపంలో రచించడమే వీని ప్రధానోద్దేశం. ఇందులో సంభాషణలు చాలా దీర్ఘాలు. అక్కడక్కడ ఉన్న పద్యభాగాలుకూడా చాలా దీర్ఘాలే! ఆ యా సందర్భాలలో విషయ వివరణకోసం శ్రీ అరవిందులు ఆ విధంగా రచించి ఉండవచ్చును. ఇందులో వివిధ మానవ ప్రకృతుల స్వభావాలూ, వానికి అతీతాలైన శక్తులూ వివరించబడినవి. భారతంలోని సావిత్రీచరిత్ర అప్రధానంగాను, యోగ వేదాంత విషయాలు ప్రధానంగానూ కానవస్తాయి. ఇందలి ప్రధాన పాత్ర సావిత్రీదేవి మూర్తీభవించిన వాత్సల్యం. 'లోకమాత'.

> "బాధల నన్నింటి పారంగద్రోలి
> కట్టినకట్టులు గాయముల్ మాన్పి
> తల్లినై సాతంగదలతునో వత్స!
> దుర్గయు కాళియు భర్గయు నగుట
> అక్కరలేదది యొక్కటేమాట.
> తల్లిగానేయుండి తల్లిగానడతు
> తల్లిగా నందర దయను కాపాడి
> ఆనందపుత్రుల నందరచేసి
> ఆనందమాతగా నైపోదు నేను"

అని ఆ దేవి పీడితలోకానికి అభయహస్తం ఇస్తున్నది. ఆ వాత్సల్యాన్ని అందరూ చూరగొనడానికి అవకాశం కల్పించి, దీనిని ఆంధ్రీకరించిన రామకోటయ్యగారి ప్రయత్నం సర్వథా కొనియాడదగినది.

*— శ్రీ బులుసు వేంకటరమణయ్య*

# జమీన్ రైతు

[పింగళ ఉగాది సంచిక 1977. స్థాపకులు : నెల్లూరు వెంకట రామానాయుడు. సంపాదకుడు : శ్రీ నెల్లూరు శ్రీ రామమూర్తి. ప్రచురణ : "జమీన్‌రైతు", నెల్లూరు.]

డాక్టర్ నేలటూరు వెంకటరమణయ్య వ్రాసిన "తిక్కన—జక్కన రచనలలోని చారిత్రకాంశాలు", డాక్టర్ సి. వి. రామచంద్రరావు వ్రాసిన "శాసనాలలో కావ్యాలలో నిదురించిన నెల్లూరు చరిత్ర" వంటి నెల్లూరు జిల్లా గురించిన వ్యాసాలు ఈ సంచికలో ఉన్నాయ్. ప్రాంతీయ పత్రికలలో "జమీన్‌రైతుకు" ప్రత్యేకస్థానం ఉన్నది. ప్రాంతీయాలను ఉపయోగించడం, జిల్లా వార్తలకు ప్రాముఖ్యం ఇవ్వడం ఆ ప్రత్యేకత ఈ ప్రత్యేక సంచికలో కూడా ఆ ప్రాముఖ్యత స్పష్టమవుతుంది.

నెల్లూరు జిల్లా సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల పుట్టుపూర్వోత్తరాలను పరిచయంచేసే ప్రయత్నం ఈ సంచికలో జరిగింది. ఇందులోని వ్యాసాలన్నీ ప్రయోజనకరమైనవే—చదువ తగినవే.

శ్రీ శివారెడ్డి తన సహజ ధోరణిలో వ్రాసిన 'శకుంతల—దుష్యంతుడు' హృద్యంగా ఉన్నది. బెజవాడ గోపాలరెడ్డిగారి 'స్మృతులు' రాజకీయ చరిత్ర నభ్యసించగోరే యువకులకు ఉద్దీపనం కలిగిస్తుంది. శ్రీ మరుపూరి కోదండరామరెడ్డిగారు వావిళ్ళ ప్రచురణ సంస్థమీద వ్రాసిన వ్యాసం ప్రత్యేకంగా పేర్కొనదగినది.

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావుగారి "నెల్లూరు నగరమా" అనే పద్యాలు ప్రౌఢంగా ఉండగా శ్రీయుతులు బం.గో.రె; బండినాగ రాజు వ్రాసినవ్యాసాలు విజ్ఞానదాయకంగా ఉన్నాయ్. ఇంత ఆకర్షణీయ మైన ప్రత్యేక సంచికను ప్రచురించినందుకు శ్రీ నెల్లూరు శ్రీరామ మూర్తిని అభినందించాలి. ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర జిల్లాలలో కూడా ఇలాంటి పత్రికలు అభివృద్ధిచెందితే ఎంతబాగుంటుందీ ?

**శ్రీ ఎ. ఎస్. అవధాని**

# అ ధో లో క ం

***మూలంలో మహానాటకం. అనువాదంలో అధ్వాన్నం***

[మాక్సిం గోర్కీ: అనువాదం—శ్రీనివాస చక్రవర్తి. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్: :విజయవాడ—4. పుటలు: 123; వెల రు. 4—00.]

రష్యాలో కమ్యూనిస్టు విప్లవానికి, విప్లవానంతరం మేర్పడిన సమసమాజ స్థాపనకు లెనిన్ నేతృత్వం వహించినట్లే, ఆ వైభవోజ్వల మహాయుగంలో ఉద్భవించిన చేతన సాహితికి, మాక్సిమ్ గోర్కీ మార్గదర్శి. ఆమహారచయితవ్రాసిన దర్పణాత్మకనవల'మదర్' 'అమ్మ'గా లింగరాజుగారిచేత అనువదింపబడి, అఖిలాంధ్ర పాఠకుల మన్ననలనూ కొన్నిదశాబ్దాలక్రితమే పొందగల్గింది. ఆ తర్వాతఅనేక మంది తెలుగు నవలారచయితలను విశేషంగా ప్రభావితంచేసి, వారిని మార్క్సిస్టులుగా మార్చి, కాల్పనిక సాహిత్యంలోనే ఒక క్రొత్త వరవడికి కారణమైంది.

'మదర్'ను వ్రాసిన మాక్సిమ్‌గోర్కీ కలంనుండి వెలువడిన 'లోయర్ డెప్త్స్' 1902 డిసెంబరు 31న మాస్కో ఆర్ట్ థియేటర్‌లో తొలితొలుతగా ప్రదర్శితమై, ఆ నాటక రచయితకు అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చిపెట్టింది. మాస్కో ఆర్ట్‌థియేటర్ వ్యవస్థాపకుడైన నెమిరోవిచ్ డాన్‌చెంకో మాటల్లో, "ఈ నాటకం ఒక అసాధారణమైన పిడుగుపాటు. అసాధారణ కళానైపుణ్యం, రాజకీయ పరిశీలనం, రానున్న విముక్తిపైగల అచంచల విశ్వాసం, వీటి మేలు కలయిక." రచయిత గోర్కీ, ఈ నాటక సృష్టిలో తన కృషిని వివరిస్తూ ఇట్లా అంటాడు: "ఒకనాడు కలిగివున్న వాళ్ళ ప్రపంచాన్ని దాదాపు ఇరవైఏళ్ళు పరిశీలించిన ఫలితమే ఈ నాటకం. వీరిలో దేశద్రిమ్మరులూ, సత్రాల్లో బ్రతికేవాళ్ళునేకాక, ... మేధావి వర్గం వారినీ, జీవన వైఫల్యాలతో, అవమానాలతో గాయపడిన అనేకమందినీ కలిపాను."

ఈ నాటకం ఒక విధంగా జీవచిత్రం. జీవనచిత్ర చిత్రం. రసమైన జీవనకావ్యం. నాటకంలో ప్రధాన పాత్రలు పదిహేనుమంది. మరికొందరు మధ్యమధ్యలో రంగస్థలంమీదకు వచ్చిపోతూ, మసక మసగ్గా కన్పిస్తూ, లీలగా తమ జ్ఞాపకాలను వదలి వెళ్ళు తుంటారు. నాటకంలో వయసులో అతి చిన్నపాత్రధారి ఇరవైయేళ్ళ నటాషాకాగా, అందరికన్నా వృద్ధు అరవై సంవత్సరాల దేశద్రిమ్మరి లూకా. అయిదుగురు ఆడపాత్రలు. మిగిలిన పాత్రల్లో వివిధ వృత్తులకు చెందినవాళ్ళు ఎక్కువమంది. పోలీసు, తాళాలు బాగుచేసేవాడు, టోపీలు తయారుచేసేవాడు, చెప్పులు కుట్టేవాడు, నావలు బాగు చేసేవాళ్ళు, కొందరు పనిపాటా లేనివాళ్ళు, ఓ ఇంటి యజమాని, అతని భార్య, ఆ భార్య చెల్లెలు, అందరూ కలిసి వొక చీకటి కేంద్రాన్ని, ఆ కేంద్రంలో మధ్య మధ్యలో మిణుకు మిణుకుమని కనిపించే మానవత్వపు విలువల్ని, నిన్నటి బాధల్ని, రేపటి ఆశల్ని, ఇవాళ్టి ఆర్తిని, ఉద్వేగాన్ని, ఉన్మాదాన్ని, స్వార్థాన్ని, సంకుచితత్వాన్ని, నగ్నంగా, జుగుప్సాకరంగా, దయనీయంగా ప్రేక్షకులముందు ప్రదర్శిస్తారు.

ఈ బాధాదగ్ధజీవితాల్లో, ఒక నటుడు కూడా వుంటాడు. అతనికి వో పేరంటూ లేదు. అందరూ అతణ్ణి నటుడంటూనే పిలుస్తుంటారు. ఆ కళాజీవికి షేక్స్‌పియర్ నాటకాలు తెలుసు. షేక్స్‌పియర్ నాటకాల్లోని భిన్న భిన్న పాత్రల సంభాషణల్ని జ్ఞప్తి చేసుకుంటూ వాటిని తన వర్తమాన దరిద్ర జీవితానికి, కళా రాహిత్యానికి అన్వయించుకుంటుంటాడు. చివరకు, దారిలేక, గుర్తింపు లేక ఉరేసుకు చనిపోతాడు. వాస్కా పెప్పెల్ అనే ఇరవైఎనిమిదేళ్ళ యువకుడు, నటాషాను ప్రేమించి, ఆమె అక్క వాసిలిస్సా కార్పోవ్నా పన్నిన పన్నాగానికిలోనై, ఒకానొక ఉద్రేకంలో వాసిలిస్సా భర్త కొస్టిల్యోవోను చంపేస్తాడు.

నాటకంలో కోస్టిల్యోవ్, బూర్జువా మనస్తత్వానికి ప్రతీక. వాసిలిస్సా కుట్రకు కామానికీ, వంచనకూ, జగడాల మారితనానికీ, నిష్ఠుర సంకేతం.నటాషా అసాధారణమైనది జరుగుతుందని అనునిత్యం వూహిస్తూ ఆశకూ యౌవనానుభూతికీ మనసును కట్టివేసిన అనుభవ విహీన. మెద్వెదేవ్ అధికారాన్ని స్వార్థలాభాని కుపయోగించుకునే పరాన్నభుక్కు. వాస్కా పెప్పెల్ కలలుకంటూ, చావంటే భయంలేకుండా, ప్రేమకోసం బ్రతకదల్చుకున్న ఒక అభాగ్యుడు. దొంగవాడి కొడుకు. అన్నా, క్లెష్చ్ భార్య, రోగిష్ఠి ముప్పై సంవత్సరాలకే అన్నీ ముగించుకుని అర్థాంతరంగా చనిపోయిన హతభాగ్య. నాస్త్యకు గూడంటూలేదు. గుండెల్లో ఎప్పుడూ కొండంత గుబులు. బేరన్, సతీన్, బుబ్నోవ్, తాతార్, అల్యోష్కా, అందరూ విషాదాన్ని పంచుకుంటూ, ఉదయంకోసం ఎదురుచూసే ఉద్విగ్న పాత్రలు.

ఈ నాటకంలో అంతరంగ సంక్షోభమే కాని, సంఘటనల సంఘర్షణ చిత్రణానికి అంత ప్రాముఖ్యంలేదు. వ్యక్తిగత దౌర్బల్యాలూ, వైయక్తిక దృక్పథాలూ ప్రాధాన్యం వహించినంతగా, నాటకీయత ప్రాధాన్యం వహించదు. మాక్సింగోర్కీ కళాకారుడా, ఫోటోగ్రాఫరా, చిత్రకారుడా, హేతువాదా, తాత్వికుడా అన్నది ఈ నాటకం స్పష్టంగా సూచించదు. జీవితం నిర్వచనాతీతం. అదేవిధంగా ఉత్తమరచయిత కూడా ఏ రకమైన సంకుచిత పరిధుల్లోకీ ఇముడలేదు.

రచనా శిల్పంలో ఈ నాటకం స్పష్టంగా ఒక నూతన ప్రయోగమే. నాలుగంకాలున్నా, అంకభేదం ప్రదర్శనం కోసమేతప్ప

కథా విస్తరణకూ, కథన కుతూహలానికీ ఉద్దీప్తమైనట్లనిపించదు. షేక్స్పియర్, ఇబ్సెన్‌లకన్నా భిన్నమైంది ఈ రచనాపద్ధతి. రంగాలంకరణ సామాన్య ప్రదర్శకులకు అందుబాటులో ఉండదు. సంభాషణల్లో ఎక్కువభాగం 'కట్ డైలాగ్స్'. మనసు పొరలను చీల్చుకుని, వేదననూ, ఆత్మతత్త్వాన్నీ ప్రదర్శించే అలతి అలతి మాటలు.

ఇటువంటి నాటకాన్ని తెనుగు చేయడం ఏ దృష్టితో పరికించినా అసిధారావ్రతమే. శ్రీ శ్రీనివాస చక్రవర్తి ఆధునికాంధ్ర నాటక స్వరూపస్వభావాదులెరిగిన సాహితీవేత్త. రచయితగా, సంపాదకునిగా రాణకెక్కినవ్యక్తి. వారీ నాటకాన్ని రష్యనుభాషనుండి అనువదించారో లేక ఆంగ్లమాతృక ఆధారంగా తెలుగుచేశారో ఎక్కడా చెప్పలేదు. ఏ భాషనుండి దీన్ని దిగుమతి చేసుకున్నా, అనువాదం కృతకంగా, తెలుగుభాష తీరుతియ్యములకు విరుద్ధంగా, భారంగా, నాటకాభాసంగా సాగడం, పాఠకుల దుర్దృష్టం.

అనువాదంలో, వాక్యవిన్యాసంలో గ్రాంధిక వాసన. సంభాషణల తీరులో, గ్రామ్యంలో కృత్రిమత్వం. ప్రారంభంలోనే, ఒకటో అంకంలో, రంగాలంకరణ సూచిలో — (గుహలాంటి నేలమాళిగ. బరువైన విలువంపులో కప్పు పొగచూరి నల్లబడిపోయి ఉన్నది. ...కిటికీలోనుంచి వెలుతురు పడుతోంది ... పెప్పెల్‌గదిని సన్నని గోడ విభాగించుచున్నది... ఎడమమూలను ఒక పెద్ద రష్యన్ స్టోవ్ ఆక్రమించుకొన్నది ...అన్ని గోడలకు ఆనుకొని తిన్నెలు నిర్మితమైనాయి... ఎడమవైపున వెల్లకిలాపడిన ఒక దుంగ...... సతిన్ అతని తిన్నెమీద పండుకొని గొణుగుతుంటాడు.)

'పడుతోంది, విభాగించుచున్నది, ఆక్రమించుకొన్నది, గొణుగుతుంటాడు' వంటి క్రియాపదాలను, వ్యవహారికంలోకో, గ్రాంథికంలోకో మార్చుకోవడం పెద్ద కష్టంకాదే? ఏదో ఒక పద్ధతినే ఆశ్రయిస్తే, అందులో ఎంతో అందమూ, సొలుగూ ఉంటాయని శ్రీనివాస చక్రవర్తిగారికీ తెలుసు. కానీ అట్లా చెయ్యలేదు. 'విలువంపు' అన్నపదాన్ని వాడి పాఠకులను తికమకపెట్టి, మళ్ళీవారే 'స్టోవ్' అన్న ఆంగ్లపదాన్ని యథాతథంగా వుంచటానికి సందేహించలేదు. ''వెలకిలాపడిన, పండుకొని'' ప్రయోగాలను మరింత సన్నిహితంగా వుండేట్లు వాడలేమా?

శ్రామిక జనభాష జీవద్భాష. తత్త్వాలతో, జాతీయాలతో, విచిత్రాలంకారాలతో, సహజసుందర చమత్కారాలతో ముగ్ధ మనోహరంగానూ ఉంటుంది, గుండెలు వ్రయ్యలుచేసే భీషణార్భటితోనూ వుంటుంది. భాషలోగల గ్రామ్యత్వాన్నీ, మాండలికత్వాన్నీ తెలిసికొని పాత్రోచితంగా వాడగలనేర్పు మహారచయితకు మాత్రమే స్వంతమైన సొత్తు. మాక్సిమ్‌గోర్కీ కార్మికుల్నీ, శ్రామికుల్నీ, మేధావినీ, భావుకుణ్ణీ ప్రవేశపెట్టినపుడు, అనువాదంలో వారివారికి తగిన వృత్తిభాషను వాడినట్లయితే, నాటకం ఎంతో ప్రతిభాసమున్మీలితమై, భావ శబలితంగా భాసించేది. కానీ శ్రీ శ్రీనివాస చక్రవర్తి ఇంతటి శ్రమతీసుకొని ఉండకపోవడంతో, రచన నిర్వీర్యమైపోయింది. కేవలం వత్తులు తీసేసినందువల్లా, కచటతపల్ని గసడదబలు చేసినందువల్లా, ప్రజల భాషలో రచనలు చేస్తున్నామని భావిస్తే అది భ్రమ మాత్రమే! జన జీవన వ్యవహార శైలిలో రచన సాగించదల్చుకొన్నపుడు, గురజాడ అప్పారావునూ, రాచకొండ విశ్వనాథశాస్త్రినీ, పోరంకి దక్షిణామూర్తినీ, దాశరధి రంగాచార్యనూ క్షుణ్ణంగా చదివి, ఆ తర్వాత మరి రచనకు శ్రీకారం చుట్టడం మంచిది.

శ్రీనివాసచక్రవర్తిగారు యధాలాపంగా రచన చేశారనటానికి ఈ క్రింద ఉదాహరణలు చాలు.

1. ''క్వాష్న్యా:— అవును నిజం. యింకేటి. నీ పెళ్ళాన్ని చావువాత పడదోస్తుంటివిగా !''
2. ''క్లెష్చ్:—ఆస్టోవ్‌మీదినుంచి కిందికిదిగొచ్చివొళ్ళుశుబ్బరం జేసుకో. చేతులు పొడవతాయని బయంగావుందా?''
3. ''అన్నా:— నన్నొంటిగా పరుండనీ. పో. యెళ్ళిపో!''
4. ''అల్యోష్కా:—యిద్గో, నన్ను తినేసెయ్యండి...ఆమెద్వాకిన్ ''యీాదిలో కనిపిచ్చావో నీ కల్లుముంత ముక్కల్ ముక్కల్ సేసేత్తా'' అన్నాడు. అయినా యీాదిలో కెల్లేదీ! యెల్లి యీాది నడిమద్దెన పడకేత్తా. బల్లా, గట్టా నామీదిగా పోనీ, నాకేం అక్కర్లా!''
5. ''బుబ్నోవ్:— ''నా పెళ్ళానికో బండడుండేవాడు... పోకిరీ వెదవ! సొగటాల బలే బాగా ఆడేవోడులే.''

క్వాష్న్యా చిరుతిళ్ళు అమ్మే స్త్రీ. క్లెష్చ్ తాళాలు బాగుచేసేవాడు. అన్నా, క్లెష్చ్ భార్య. అల్యోష్కా చెప్పులు కుట్టేవాడు. బుబ్నోవ్ టోపీలు తయారుచేసేవాడు. కానీ శ్రీనివాసచక్రవర్తిగారి చేతిలో వీరందరూ, ఒకే భాషలో పోసిన ముద్దలైపోయినారు. వాళ్ళ భావవైరుధ్యం, భాషా భేదానికి కారణభూతం కాగలదన్న సంగతి పాఠకులకు తెలియకుండా అనువాదం కొనసాగింది.

మధ్య మధ్యలో కొంత కవిత్వం కూడా! ఉదాహరణకు నాలుగో అంకంలో ''నల్లిలాగా అసంగమేసే; మొగమేసుకునే వుండి వుంటే; తరిమేసి వుండేను సక్కాని, నా రాణి, అహహహహా!''

''అహహ్యామేసే'' అనడానికి వచ్చిన తిప్పలు కాబోలు'' ''అసంగ మేసే!'' అల్ప్కోష్యాకాదు, మనం నవ్వుకోవాలి జాలితో అనువాద కుణ్ని చూసి. మాక్సిం గోర్కీవంటి ఉత్తమశ్రేణి రచయితను, ఇంత అధ్వాన్నంగా తెలుగులోకి తీసుకువచ్చిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌ను చూసి బాధపడాలి.

''లోయర్ డెప్త్స్'' అన్న పేరులోనే ఎంతో వేదాంత పర మైన గూఢార్ధం ఆలోచనామృతంగా దాగివుంది. ''డెప్త్స్''ను ''లోకం''గా అనువదించడంతో నరకలోకం జ్ఞాపకం వస్తుంది తప్ప, ఆ పదంయొక్క గాఢత, వైశాల్యం తగ్గిపోతున్నవి. ఇటు వంటి పుస్తకాలు ప్రచురించటానికి కమ్యూనిజంమీద గుడ్డిప్రేమ ఒక్కటే కాదు కావలసింది సాహిత్య తత్త్వంకూడా కుణ్ణంగా అవ గతమై వుండాలి.''

***సురుచిర, సుందర, కవితా, మానవతారసైకంచన***

# జంగ్లీ (నవల)

[కిషన్‌చందర్. అనువాదం: నిడమర్తి ఉమారాజేశ్వరరావు నిడమర్తి శ్యామలాదేవి. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ—520004, పేజీలు: 272; వెల: రు. 8—00]

స్వర్గీయ కిషన్‌చందర్, ప్రకాశకుల మాటల్లో, ''సృజ నాత్మక సాహితీ సేవనతో భారతదేశ సాహితీ క్షేత్రాన్ని సంపద్వంతం చేసిన సాహితీవేత్తగా తెలుగు పాఠకలోకానికి సుపరిచితులు.'' గాడిద ఆత్మకథ, నలుగురు లోఫర్లు మొదలైనవి ఇదివరకే తెలుగులోకి అనూదితమై, వ్యంగ్యాత్మక కళావిలసనానికి పాఠకుల దృష్టిని ఆకట్టుకున్నాయి. కిషన్‌చందర్ పుట్టింది 1914 నవంబరు 26న పంజాబ్‌లో. చదివింది లాయరీ చదువు. పెరిగిందీ, మరణించిందీ బొంబాయిలో. వ్రాసింది ప్రధానంగా ఉర్దూ భాషలో. అయినా ఆ రచనలు ఇంగ్లీషు, రష్యన్, డేనిష్, పోలిష్, జర్మన్, హంగేరి యన్, చైనా భాషల్లోకి అనువదించబడి ఆయనను ప్రపంచ ప్రసిద్ధుణ్ని చేశాయి.

ఆధునిక భారతీయ నాగరకాత్మ కిషన్‌చందర్, కే. ఏ. అబ్బాస్, ముల్కరాజ్ ఆనంద్, వంటి వారి నవలల్లో ప్రతిఫలించి నంతగా, మరి ఏ కొద్దిమంది నవలా రచయితల్లోనో ప్రతిఫలి స్తుంటుందని విమర్శకుల అభిప్రాయం. కిషన్‌చందర్‌ను గాలిబ్ వారసుడుగా సాహితీలోకం సమాదరించింది, ఆయన శైలినీ, ఆయన రచనల్లో కనిపించే జీవిత వైవిధ్యాన్నీ, మాటలుగా రూపొం దిన మానసిక అంతర్మథనాన్నీ, నీరాజనం పట్టిన మహోదాత్త తమునూ, ఆకట్టుకునే దివ్యప్రేమనూ, బహుధా స్తుతించింది.

'జంగ్లీ' కిషన్‌చందర్ నవలల్లో మేలుబంతి కాదుగాని, ప్రాచుర్యం పొందిన నవల. 'విశాలాంధ్ర' దినపత్రిక సాహితీ స్రవం తిలో ధారావాహికంగా వెలువడి, ఈ సంవత్సరం ఫిబ్రవరిలో, అచ్చుతప్పులు అంతగాలేని ముద్రణంతో, అందమైన ముఖ చిత్రంతో పుస్తక రూపాన ఆవిష్కృతమైంది.

జంగ్లీ అడవికి ముద్దుబిడ్డ. అమాయకతకు పెద్ద బిడ్డ. వాడి వంశీనాదం ప్రకృతికే పారవశ్యం. 'అడవి అంతటా నీకై గాలించాను' అన్న మొదటి అధ్యాయంలో జంగ్లీ బాల్యం, వాడి తండ్రి అకాల మరణం, వడ్డీ వ్యాపారి ఆ అమాయకుడి కొద్ది భూమినీ కాజేయడం, తండ్రి చితిమంటకోసం వాడికి జీవన సర్వస్వ మనదగిన ఎడ్ల జతను కూడా ఆ వ్యాపారికే స్వాధీనం చేయవలసి రావడం, మోసానికి గురై, ఎవ్వరూలేని ఏకాకితనంలో, తండ్రి గౌరవం కాపాడ్డానికి మరింత డబ్బు అవసరమై, బొంబాయికి బయల్దేరడం, ఆ కాలినడక దారిలో దొంగ సాధువుల పాలబడడం, ఒక చోట ఆగిన లారీలో ఎవరూ చూడకుండా లోపలకు దూరి, ఉన్ని బేళ్ళమధ్య సందుచేసుకుంటూ లోపలకు ప్రాకి, అప్పటికే అక్కడ చేరి దాక్కుని పడుకొని వున్న తరనాను కలుసుకోవడమూ అద్భుతంగా, పరమ రమణీయంగా, కవితామయంగా వర్ణించ బడ్డాయి.

రెండవ అధ్యాయం 'క్లిష్టమైన ప్రయాణం'. లారీలో, గూడ్సురైలుబండిలో రహస్యంగా ప్రయాణం చేయడం, లారీ డ్రైవర్ల, క్లీనర్ల కష్టమయ జీవనమూ, తరనాను కాపాడ్డం కోసం జంగ్లీ బఖ్తియార్‌తో 'దుడకన్' అనే చాకుయుద్ధం చేయ డం, ఇష్టంలేని పెళ్ళిని తప్పించుకోవడం కోసం పారిపోయివచ్చిన తరనా, తనను వెతుక్కుంటూవచ్చిన బంధువులనుండి, పోలీసుల నుండి తప్పించుకుని, జంగ్లీలోని స్వచ్ఛతకు, నిర్మల హృదయానికి ఆకర్షితురాలై, అతనితో జత చేయి కలిపి బొంబాయికి తనుకూడా బయలుదేరడం, దారిలో తాజమహల్ దర్శనం, గూడ్సుబండిలో ప్రయాణం చేస్తూ చేస్తూ ఇద్దరూ విడిపోవడం, మనోజ్ఞంగా, హాస్యమయంగా, ఉదాత్తంగా రచించ బడ్డాయి.

మూడవ అధ్యాయం 'పేట పేటకీ తిరిగిన బాటసారి'. మొదటి బాటసారి తరనా. బొంబాయిలో రాఫో ఆమెను విక్టర్‌కు విక్రయిస్తాడు. విక్టర్ ఆమెను మేడమ్ సి. సి. కి విక్రయిస్తుంది. మేడమ్ సి. సి. తరనాను మిత్తల్ సేఠ్‌కు అర్పిస్తుంది. ఆమె యౌవనాన్ని, సౌశీల్యాన్ని, సౌకుమార్యాన్ని కొల్లగొట్టే ప్రయత్నంలో తరనా ధైర్యంగా నిలబడి మిత్తల్ సేఠ్‌ని చావగొట్టి చెవులు మూసి, ఏ అపకారమూ జరక్కముందే బయటపడి 'రాజు' గా మారిన జంగ్లీని కలుసుకుని, బొంబాయిలో పేవ్‌మెంటు మీద జీవితాలు గడిపే లక్షలాది మందిలో ఒకతెగా మారి, పనిమనిషిగా స్థిరపడి, ఆ బ్రతుకు రోసి, అనాధశరణాలయం నిర్వాహకుడైన గంగాధర్ అండదండలతో, పేవ్‌మెంటుమీది బీద బాలబాలికలకు రహస్యంగా చదువులబడి తెరచి, ఆ బడిని సంరక్షించుకునేయత్నంలో ప్రాణాలొడ్డటానికికూడా సిద్ధమై, ఒక నవోదయానికి కారణ మౌతుంది. ఇంక రెండవ బాటసారి జంగ్లీ బొంబాయిలో నల్ల బజారు నడిపే వందలాది సంఘవ్యతిరేక నాయకుల్లో ఒకడైన రథియాకు కుడిభుజ మౌతాడు. 'రాజు'గా రూపాంతరం చెందిన జంగ్లీలో తొలినాటి నిసర్గ సౌందర్యం లుప్తమౌతుంది. తరనాను రక్షించుకోవడం కోసమే రథియాతో జట్టు కట్టినా, ఆ చీకటి

సావాసం అతని బుద్ధిని కళంకితం చేస్తుంది. అబద్ధాలకోరుగా మారుస్తుంది. కానీ తరనా నిరంతర సాహచర్యంలో, ఆమె త్యాగ మయ జీవన విన్యాసంలో తన తప్పు తెలుసుకుని, ఒకానొక సాహస క్రియలో ఎద్దుల జత కొనుక్కోవడంకోసం కావలసినంత డబ్బును పందెంగా గెల్చుకుని, ప్రేయసితో తిరిగి తన పల్లెకు పయన మౌతాడు.

ఈ నవలను చదవడం ముగించింతర్వాత, అంతరంగంమీద ఒక విచిత్రమైన మబ్బుతెర మోహనంగా పరుచుకుంటుంది. అడవులు, సెలయేళ్ళు, క్రూరమృగాలు, వసంత సమీరాలు, అప్పుడే విచ్చిన పూవులు, పుప్పొడి పరిమళం, గ్రామీణుల నిర్మల మమకారం, ఇవన్నీ ఒక కళా జగత్తును కంటిముందు నిలిపి రాగవిపంచిని మ్రోగిస్తే, లారీలు, గూడ్సుబళ్ళు, పేవ్‌మెంటు బ్రతుకులు, వ్యభిచార గృహాలు, త్రాగుడు మైకం, ధనమదాంతత, కటిక బీదతనం, నిరుద్యోగి ఉన్మాదం, దొంగతనాలు, హత్యలు, చీకటి తప్పులు, నల్లబజారు వెకిలితనం, ఇవన్నీ బ్రతుకు నగ్నతను, కుళ్లుతున్న ఆధునిక వ్యవస్థను, సమాజంలో పెరుగుతున్న దానవత్వపు రాచపుండును కంటి ముందు నిలిపి గుండెను తడిగుడ్డతో పిండుతున్నాయి.

ఈ నవలా రచనలోనూ యథాపూర్వంగా కిషన్ చందర్ సూచ్యప్రాయంగా కొన్ని నిష్ఠుర సత్యాలను తెలియజేశాడు. రెండు వందల డెబ్బయి రెండు పేజీల నవలలో ప్రాకృతికమైన రామణీయ కతను వివరించటానికీ, వంశీనాదకర్తగా జంగ్లీని అత్యంతము ఆహ్లాదకరమైన రాగసుధా మూర్తిగా నిరూపించటానికీ వంద పేజీలకన్నా ఎక్కువ తీసుకోడు. మిగిలిన నూట డెబ్బయి పేజీలూ నాగరక జీవన వైక్లబ్యానికీ, విలువల మధ్యగల సంఘర్షణ చిత్రణానికీ వినియోగించబడ్డాయి. అంటే ఆధునిక భారతంలో ప్రకృతీ—మానవుడు వీరి మధ్యగల సంయోగం తగ్గిపోతున్నదనీ, మానవుడు సుఖలాలసా పీడితుడుగా మారి పతనం కావడం ఎక్కువవుతున్నదనీ చెప్పకుండా చెబుతున్నాడు. ఈ పరిణామం అనర్థ హేతువు. కాబట్టే జంగ్లీనీ, తరనానూ రచయిత బొంబాయినుండి పల్లెకు తిరిగి పంపిస్తాడు. మరొక ముఖ్యమైన సంగతిని కూడా కిషన్ చందర్ సూచిస్తున్నాడు. సుమారు మూడువందల పేజీల నవలలో తరనా, జంగ్లీల ప్రణయం మోహనంగా వర్ణించబడింది. ఒకరి బాహువుల్లో ఒకరు, ఒకరి కంటి వెలుగుగా మరి ఒకరు, ఒకరు నాదం మరొకరు రాగం, కానీ తరనా ఎక్కడా తన శీలాన్ని జంగ్లీకి అర్పించినట్లు వర్ణించలేదు. వారు ప్రేమ మూర్తులు. పవిత్రాంతరంగులు. జంగ్లీ ఎడ్లజతను కొన్న తర్వాత పల్లెకు తిరిగి వెళ్ళింతర్వాత వివాహమైంతర్వాత, అప్పుడే తరనా తనూయష్టిని జంగ్లీ స్వంతంచేసుకోగల్గడం ! ఎంతటి అభ్యుదయమైనా, సంప్రదాయాన్ని త్రోసిరాజుచేసి ముందుకు సాగరాదన్నది ఇందులోని పరమార్థం. మరో విషయంకూడా కిషన్ చందర్ తన నవలలో సూచిస్తాడు. మనిషిలోని వ్యక్తిత్వం, మహోన్నతమైన నిస్వార్థతను, త్యాగాన్ని, మంచి తనాన్ని ప్రదర్శించడంలోనే సఫలమౌతుంది. ప్రతి వ్యక్తిలోను, బూడిదలో దాగిన నిప్పు రవ్వలాగా మంచితనం జ్వలిస్తూనే వుంటుంది. దానికి దోహద క్రియ ఎడనెడ జరుపుతూ వుండాలి. దొడ్డమ్మ, ఫతేచంద్, బఖ్తియార్, మహాదేవ్, తాజ్‌మహల్, ముసలి కాపలావాడు, గంగాధర్, కుసుమ, ధర్మరాజు, దాదీమా, వీరందరూ కష్టమూ, సుఖమూ తెలిసిన, బ్రతికివున్న మనుష్యులు. వీళ్ళందరూ ఎప్పుడో ఒకప్పుడు ఒక మంచి మాట, ఒక చల్లని చూపు, ఒక చిన్న సాయం చేస్తారు. అందులో తమకు కష్టం కలిగినా సహిస్తారు. ఇంక రెండో వర్గం మనుషులున్నారు.

ఆ పాత్రల చిత్రణలోనే రచయిత సామాజికస్పృహ ప్రస్ఫుట మౌతుందన్నది కొందరు విమర్శకుల భావన. తరానా జీవితంతో రాజీపడదు. నిత్య వ్యగ్రమైన మానసం ఆమెది. ముసలి వరుగుతో వివాహాన్ని వ్యతిరేకించింది. కట్టుబాట్లను ఛేదించుకొంది. ప్రేమ సాఫల్యాన్ని ఆశించింది. కానీ ఒకానొక దశలో వ్యక్తి నిష్టమైన తన సంస్కారాన్నీ, చైతన్యాన్నీ, క్రమేపీ మనస్సు పెరగడంతో సమాజ నిష్టంచేసి, చదువుకోసం సర్వాత్మనా త్యాగం కావడానికి సిద్ధపడింది. అయితే చదువు నేర్చుకొంటున్న ఆ అమాయకపు పిల్లల్లో ఆ చదువెంత మార్పును తీసుకువచ్చింది? అంతకుముందు వున్న భయాన్ని ఆవలకునెట్టి ఆ పసిఎదలల్లో ఒక నిబ్బరాన్నీ, మమకారాన్నీ నింపి, పరిస్థితుల్ని ఎదుర్కొనే వీరుల్ని చేసింది. చదువుకుంటే మనుషులవుతారన్న సంగతి, ఆ మనుష్యులు తమకు శత్రువులన్న సంగతి, దొంగగా, కటువుగా, దోపిడిలో బ్రతికే రథియాకు తెలుసు, లక్ష్మన్‌కూ తెలుసు. జ్ఞానం ఒక ప్రబలశక్తి. అది అన్ని రకాల విప్లవాలకూ అత్యవసరమన్నదే కిషన్‌చందర్ ఇందులో ప్రధానంగా తెలియజెప్పాడు. జంగ్లీ బొంబాయికివచ్చి ఆ తెలివికి దూరమైనందువల్లనే రథియాకు దాసోహమన్నాడు. తరనానుండి పారిపోయినాడు. మళ్ళీ ఎప్పుడైతే అతని మనసులో తన కర్తవ్యమూ, సామాజికంగా తన బాధ్యతా, కౌటుంబికంగా తన పరువూ జ్ఞాపకాలుగా తిరిగి మొలకెత్తాయో అప్పుడే అతను రథియాను ఎదుర్కొనే బలాన్నీ సంపాయించుకున్నాడు. తరానా, జంగ్లీ వీరిద్దరూ ఒక ప్రత్యేక వర్గానికి చెందినవారైతే, మరోరకం మనుషులున్నారు. వాళ్ళు మిత్తల్‌సేఠ్, చమన్, రథియా, మేడమ్ సి—సి, విక్టర్,

రాఘో—వీళ్ళ హృదయాలు తాగుడికి, తార్పుడికి, దౌష్ట్యానికి డబ్బుకు, రోగాలకు ఎప్పుడో అంకితమైపోనాయి. అయితే వీరి హృదయ చలనం వెనకనుండి గూడా బలహీనంగా మంచితనపు సన్నాయి వినిపిస్తూనే వుంటుంది. కిషన్‌చందర్ ఏ వ్యక్తినీ మమ కార రహితంగా చిత్రించడు. ఆ కారణంగానే ఆ పాత్ర సజీవంగా మూర్తిమంతమై పాఠకుల కళ్ళముందు నిలుస్తుంది. కిషన్ చందర్ శ్రమశక్తినీ, రాగరక్తినీ సూచిస్తాడు. మానవుని అచంచల ఆత్మబలంముందు, బలిష్టమైన బాహువుల శక్తిముందు, ఏ దుష్టత్వమూ ఎదురునిల్చి గెల్వలేదు. స్త్రీ తన శీలరక్షణకు నడుం బిగించినప్పుడు, ఆ స్థైర్యంముందు ఏ దానవుడూ నిలువ లేడు. ఇంతటి ప్రేరణతో, సామాజిక స్పృహతో, లక్ష్యసిద్ధితో, భారత జనతను జడత్వంనుండి ఏకతా మార్గానికి, కర్తవ్యనిష్టకు మరల్చే రచనలుచేసిన కిషన్‌చందర్ నిజంగా ధన్యుడు! అతని రచ నలు అవశ్య పఠనీయాలు !

'జంగ్లీ'ని తెలుగుచేసిన నిడమర్తి ఉమారాజేశ్వరరావు, నిడ మర్తి శ్యామలాదేవిగారలు, ఏ భాషనుండి ఈ నవలను అనువదిం చిందీ తెలియజేయలేదు. అనువాద పద్ధతిలో శైలీ రామణీయకత, శబ్దాడంబరంపై వ్యామోహం రెండూ కన్పిస్తున్నాయి. వీలయి నన్నిచోట్ల తెలుగుతనం పోకుండా అనువాదకులు జాగ్రత్త వహిం చారు. కానీ జన జీవన భాషను యథాతథంగా వాడాలన్న వ్యామో హంలో అనేక పదాలను జుగుప్సాకరంగా వాడారు.

''దొబ్బుడాయి, పాసుగూల, నీ యక్క..., గుంటముండ, కుర్రముండ...దానక్క, నెత్తిమీద రెండంటించి పండబెట్టక, పగలనూకడం, పాయకారి లంజాముండా,''వంటి మాటలను వాడితేనే జీవద్భాష వాడినట్లా ?. మరికొన్నిచోట్ల అనువాద ప్రయో గాలు ఎబ్బెట్టుగా వున్నాయి. 'దిసపాదాలతో నడచి వెళ్తున్నాడు.' దిసమొల ప్రయోగాన్ని విన్నాం కాని, దిసపాదాలు, శోకన్నాలు, డెకారించాడు, చిక్కురొక్కురుగావున్న సాధువులు, ఎర్రని గుంట కళ్ళు, వెడదరరొమ్ము, తొస్సేడే బోసిముఖం, సెలయేళ్ళు ఝుంకారం చేయడం (తుమ్మెదలకు బదులుగా) వంటివి అంత సన్నిహితంగా వినిపించవు. ఏకఖండికగా పరిశీలిస్తే, అనువాదం మొత్తంమీద చాలా సంతృప్తికరంగావుంది. 'అందాల ఓ మేఘమాలికా! నా ప్రియు నికీ లేఖ అందించిపోవా' అన్నచోట, ముగింపులో జానపదరీతిలో, ''నీకు నాకూ జోడు అయితే, మల్లెపూలా తెప్పకట్టే, తెప్పమీదా తేలిపోదామే!'' అన్నచోట అనువాదకుల ఉపజ్ఞ తెల్లమవుతున్నది. కిషన్‌చందర్ నవలలు మరికొన్నింటిని ఈ అనువాదక ద్వయం మరి కొంత విశిష్టంగా తెలుగులోకి తీసుకురావడానికి విశాలాంధ్ర ప్రచు రణంవారు విరివిగా దోహదం చెయ్యాలి.

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

# గ్రంథ స్వీకారము

* భద్రాద్రి రామచంద్ర శతకము, రచన : శ్రీ అవధానుల పురుషోత్తమశర్మ. పేజీలు: 24. వెల: 0—75 పైసలు. ప్రాప్తిస్థానము : రచయిత, తెలుగు పండిట్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, భద్రాచలం — 507111 ఖమ్మం జిల్లా.

* శ్రీ భద్రగిరి చంద్రచూడేశ్వర శతకము, రచన: శ్రీ కె. యస్. సుబ్బనారాయణమూర్తి, పేజీలు : 32, వెల : 75 పైసలు. ప్రతులకు : రచయిత, ప్రభుత్వోన్నత బాలుర పాఠశాల, హోసూరు— 635109. ధర్మపురి జిల్లా.

* శ్రీకృష్ణ ప్రభూశతకము, గ్రంథకర్త : శ్రీ బులుసు వేంక టేశ్వర్లు, పేజీలు: 22. వెల: రు. 1—00. ప్రతులకు: రచయిత, 2/8—10—22, కమలాదేవివీధి, గాంధి నగరం, కాకినాడ—4.

* శ్రీ రామలింగేశ్వర స్తవమంజరి: రచన : శ్రీ పృథివి సుబ్బ నాగయ్య, పేజీలు 30, వెల: రు. 1—00. ప్రతులకు: రచయిత, 29/353, శివాలయంవీధి, మచిలీపట్నం.

* శ్రీరామావతారం, రచన: శ్రీయెన్నేటి రామారావు, పేజీలు : 96, వెల : రు. 3—50. ప్రతులకు : బాలసరస్వతీ బుక్ డిపో, నెం, 6, సుంకురామశెట్టివీధి, మద్రాసు— 600001. లేక శ్రీ వై. అప్పారావు, లక్ష్మీదేవిపేట, అనకాపల్లి, విశాఖ జిల్లా.

* మాస్టర్ వీరభద్రవిజయం, (నాటకము) రచయిత: శ్రీ పెంటపాటి హనుమంతరావు, పేజీలు : 156, వెల : అమూల్యం, ప్రతులకు : శ్రీ పసుమర్తి వీరభద్రస్వామి స్మారక సంఘం, విజయనగరము. విశాఖ జిల్లా.

* ఇందిరావాణి (ఖండకావ్యము) రచయిత: శ్రీ గుత్తికొండ సీతారామయ్య, పేజీలు: 24, వెల: తెలియదు. ప్రతులకు: రచయిత, (రేడియో ఆర్టిస్టు) సీనియర్ తెలుగు పండిట్, కొల్లూరు. గుంటూరు జిల్లా.

* శ్రీ కురవి వీరభద్రమహాత్మ్యము; రచన : శ్రీ ముళ్లపూడి సచ్చిదానందమూర్తి, పేజీలు: 64. వెల: రు. 3 —00. ప్రచురణ: సాహిత్యరంజని, 17—7—818, యాకుత్ పురా, హైదరాబాద్—23,

Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.